అపరాధ పరిశోధన అనుబంధం—79

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సగం కాల్చిన చుట్ట

రచన: టెంపోరావ్

## తిరిగొచ్చిన గాడిద

రచన: సికిందర్

## మరణ వాఙ్మూలం

రచన: వాణిశ్రీ

## మేడలో దెయ్యం

రచన: ప్రతాప రవిశంకర్

పొగమంచు — ఏడవ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—79**
జూలై, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# సగం కాల్చిన చుట్ట

## టెంపోరావ్

ముగ్గురూ కలిసి కూర్చొని భోజనం చేస్తున్నారు. మేనక ఏదో చెప్తోంది. ఆమెవైపు అనురాగంతో చూస్తూ మోహన్ నవ్వుతున్నాడు.

ఐదేళ్ళ కుర్రాడు ఆనంద్ మెల్లిగా తింటున్నాడు.

మోహన్ టైమ్ చూశాడు.

"ఆనంద్, తొందరగా తినరా! సినిమా టైమవుతుంది" అన్నాడు తండ్రి.

తొమ్మిదింటి కల్లా వాళ్ళు భోజనాలు ముగించారు. ఆమె దుస్తులు ధరించి, మేకప్ చేసుకుంటోంది. ఆమె జడలో మల్లెపూల దండను అతడు నవ్వుతూ తురిమాడు.

అద్దం ముందున్న ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

"మోహన్, ఏమిటలా చూస్తున్నావు?" అందామె.

"నువ్వు మహా అందంగా వున్నావు. నిన్ను చూస్తూంటే సినిమా మానుకోవాలనిపిస్తోంది" అన్నాడతను.

"తిరిగి వచ్చేస్తాంగా! రాత్రంతా నీ పక్కనే

వుంటాను" అంది మేనక.

"ఈ దుస్తుల్లోనే వుండాలి."

"నీ కోరిక తీర్చుకుందుగానిలే!" అందామె నవ్వుతూ.

"సినిమాకు పదమ్మా" అన్నాడు ఆనంద్.

ఆనంద్‌ని ఫ్లాట్‌లో ఒంటరిగా వదల్లేరు. ఎప్పుడు ఎక్కడికి వెళ్ళినా ఆనంద్‌ని తీసుకెళ్ళడం వాళ్ళకు అలవాటై పోయింది.

ముగ్గురూ బయటకు నడిచారు. ఆమె ముందు తలుపును ఏర్‌లాక్ చేసింది. మెట్లుదిగి వాళ్ళు కిందకు వెళ్ళారు.

ఎప్పటిలా ఆనంద్ స్కూటర్ సీటు ముందు నుంచు న్నాడు. మోహన్ స్టార్ట్ చేసి కూర్చున్నాడు. వెనుకసీటు మీద ఆమె ఆశీనురాలైంది.

మోహన్ స్కూటర్ని పోనిచ్చాడు. చల్లటి గాలి వీస్తోంది. రోడ్డులైట్లు ప్రకాశవంతంగా వెలుతున్నాయి. ఒక చేత్తో ఆమె భర్తను పట్టుకుంది. వేళ్ళతో నిమురుతూ ఆమె తన ప్రేమను అతడికి ప్రదర్శిస్తోంది.

ముగ్గురూ థియేటర్లోకి ప్రవేశించారు.

మేనక తండ్రి కొడుకుల మధ్య కూర్చుంది. సినిమా ప్రారంభమైంది. ఇంటర్‌వెల్ సమయంలో లైట్లు వెలిగాయి. ముందు కుర్చీలో కూర్చున్న నలుగురు మనుషులు అప్పుడప్పుడు వెనుదిరిగి ఆమెవైపు చూస్తున్నారు.

వాళ్ళ చూపులను గుర్తించనట్లు ఆమె భర్తతో మాట్లాడుతూ కూర్చుంది.

"వాళ్లు అలా నా వైపు చూడ్డం మర్యాదగా లేదు!" అందామె తగ్గుస్వరంలో.

"నీ అంత అందమైన స్త్రీ వంక పురుషులు సహజంగా చూస్తారు. తప్పు వాళ్ళదికాదు, నీ అందానిది!" అన్నాడు

భర్త చిరునవ్వుతో.

"అయినా అలా చూడ్డం అన్యాయం! వాళ్ళకు సంస్కారం లేదు" అందామె.

"అది నిజమే! సంస్కారం వున్న వ్యక్తులు అలా చూడరు!" ఒప్పుకున్నాడు మోహన్.

సినిమా పూర్తయ్యేసరికి ఒంటిగంట అయింది. ముగ్గురూ బయటకు నడిచారు.

మోహన్ స్కూటర్ని స్టార్ట్ చేయడానికి ప్రయత్నించాడు. ఎంత కష్టపడినా స్కూటర్ స్టార్ట్ కాలేదు. అతడు నిరుత్సాహంగా భార్యవైపు చూశాడు. ఆనంద్ ఆవులిస్తున్నాడు.

"మనం యివాళ కాళ్ళకు పని చెప్పాలేమో!" అన్నాడతను.

"పదండి నడిచిపోదాం! చల్లటి గాలి వీస్తోంది. హాయిగా వుంటుంది" అందామె.

తండ్రి ఆనంద్ వైపు చూశాడు.

"నడవగలవా?" అన్నాడు.

"చక్కగా నడుస్తాను, డాడీ" అన్నాడు ఆనంద్.

ఆనంద్ ముందు నడుస్తున్నాడు. వెనకనే స్కూటర్ని తోస్తూ మోహన్ అడుగులేస్తున్నాడు. మేనక తీయగా కబుర్లు చెప్తోంది. మూడు కిలోమీటర్ల దూరంలో వున్న యింటివైపు వాళ్ళు మెల్లిగా కదులుతున్నారు.

ఆనంద్ ఆగాడు. నిస్సహాయంగా తండ్రివంక చూశాడు.

"వాడింక నడవలేడనుకుంటాను" అంది మేనక.

"అయితే స్కూటర్ మీద ఎక్కి కూర్చో! తోసుకుపోతాను" అన్నాడు మోహన్.

ఆనంద్ సీటుమీద కూర్చున్నాడు. మోహన్ తోస్తూ మేనక మాటల్ని ఆలకిస్తున్నాడు.

మెయిన్ రోడ్డు నుంచి వాళ్లు ఎడంవైపుకు తిరిగారు.

"ఇది దగ్గర తోవ!" అన్నాడు మోహన్.

ఆమె రోడ్డు పొడుగునా చూసింది. మానవ సంచారం లేదు. ఆమె లోలోపల భయపడ్తోంది.

"మన స్కూటర్ని థియేటర్లో వదిలేసి ఏ ఆటోలోనో పోవలసింది" అందామె.

అతడు ఆమెవైపు చూశాడు.

"అలసటగా వుందా?"

"భయంగా వుంది!" అందామె.

"భయం దేనికి, నేను పక్కనున్నానుగా!" అన్నాడు మోహన్ ధీమాగా.

హెడ్ లైట్ల కాంతి వాళ్ళమీద పడింది. ఏదో కారు వస్తోంది. అతడు వెనక్కి తిరిగి చూశాడు.

"ఎందుకులే మోహన్! మనం నడిచే వెళ్దాం" అందామె.

కారు వాళ్ళ పక్కనే ఆగింది.

"మిస్టర్, ఎనీ ట్రబుల్?" అడిగాడు కారులో వున్న ఒక వ్యక్తి.

"స్కూటర్ స్టార్ట్ కాడంలేదు!" అన్నాడు మోహన్.

తలుపులు తెర్చుకుని కార్లోంచి నల్గురు మనుషులు కిందకు దిగారు. వాళ్ళవైపు చూసి మేనక వులిక్కిపడింది.

ఇంతకు ముందు వాళ్ళే థియేటర్లో తనవైపు పదేపదే చూశారు! నల్గురూ పాంట్లు, స్లాక్సులో వున్నారు. గూండాల్లా కనిపిస్తున్నారు. తటాలున జేబుల్లోంచి వాళ్లు కత్తులను పైకి తీశారు. మెరుస్తూన్న కత్తులను చూసి

మోహన్ గుభరాపడ్డాడు. ఆమె భర్త వెనక్కి జరిగింది. ఆనంద్ కిందుకురికి తల్లిచాటున దాక్కున్నాడు.

గదిలో యిరుక్కున్న పిల్లిలా మోహన్ ధైర్యాన్ని తెచ్చుకున్నాడు.

"మీకేం కావాలి, డబ్బా?" అడిగాడు మోహన్.

నలుగురూ పకపక నవ్వారు.

"అది మేం నీ కివ్వగలం. మాకు కావల్సింది—ఆమె!" అన్నాడొకడు.

మోహన్ వుగ్రుడయ్యాడు. "మర్యాదగా మాట్లాడండి. మీలాంటి జులాయి వెధవలు వందమంది నైనా ఎదిరించగలను!" గర్జించాడు మోహన్.

ఎలుగుబంటిలావున్న ముల్లా ముందుకు దూకి మోహన్ చంపమీద చళ్ళున వాయించాడు. మోహన్ నోట్లోంచి రక్తం చుక్కలు కిందపడ్డాయి. వెనువెంటనే ముల్లా బూట్‌తో పొట్టలో తన్నాడు. అతడి నోట్లోంచి చుట్ట దూరంగా పడింది. మోహన్ కింద పడ్డాడు.

"రాస్కెల్, ఎదిరించావా! నిన్నూ, నీ కొడుకునూ చంపి, ఆమెను లాక్కుపోతాం. అర్థమైందా?"

మోహన్ మూలుగుతూ లేచాడు. మేనక అతడిని పట్టుకుని ఆపింది.

"అంతమంది కిరాతకులతో నువ్వు పోట్లాడలేవు. నిన్నూ, బాబునూ చంపి వాళ్ళు నన్ను ఎలాగూ తీసుకుపోతారు. మీరు చావడం నా కిష్టంలేదు. వాళ్ళతో నన్ను వెళ్ళనీ! కనీసం మీరేనా బ్రతికి వుంటారు!" అందామె.

"నువ్వు లేకుండా నేనూ, బాబూ బ్రతకడం ఎందుకు?" అరిచాడు మోహన్.

"పొద్దుటే ఆమె నీ యింటికి వచ్చేస్తుంది!" అన్నాడు

ముల్లా.

క్షణకాలం అందరూ నిశ్శబ్దంగా వుండిపోయారు.

"మోహన్, నా మాట విను!" అందామె.

"నువ్వు యింటికెళ్ళి పడుకో! ప్రొద్దుటే ఆమె వస్తుంది. పోలీస్ రిపోర్ట్ యివ్వకూడదు. ఇస్తే ఆమె శవం ఏ రోడ్డు పక్కనో పడుంటుంది" అరిచాడు ముల్లా.

మోహన్ మాట్లాడలేదు. అతడి కన్నీళ్ళు ఆమె చేతి మీద పడ్డాయి. ఆమె వెనక్కి తిరిగింది. వాళ్ళవంక చూసింది.

మౌనంగా వెళ్ళి కారులో కూర్చుంది. నలుగురూ ఎక్కి, తలుపులు మూశారు. కారు కదిలింది. వెనుదిరిగి ఆమె భర్త కొడుకులకేసి చూడలేదు!

కన్నీళ్ళు జలజల ఆమె కళ్ళనుంచి కారుతున్నాయి. ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆ కారు వెళ్ళిపోయిన కొన్ని నిమిషాలదాకా అతడిలో చలనం లేదు.

"వాళ్లెవరు డాడీ — బూచిగాళ్లా?" అడిగాడు ఆనంద్.

మోహన్ లేచాడు. కొడుకుని స్కూటర్ మీద ఎక్కించి, దాన్ని తోస్తూ నడవసాగాడు.

"అమ్మను వాళ్ళతో ఎందుకు పోనిచ్చావు డాడీ?"

ఆనంద్ ప్రశ్న కమ్చీలా అతడి ఒంటిమీద, హృదయంమీద ఛెళ్లుమంది!

"నిన్నూ, నన్నూ కాపాడ్డంకోసం మీ అమ్మ వాళ్ళతో వెళ్ళింది నాయనా! మీ అమ్మ చాలా గొప్పది!" అని మోహన్ ఏడుస్తూ స్కూటర్ని తోస్తున్నాడు.

# 2

ఇల్లు చేరుకున్న మరుక్షణంలో ఆనంద్ నిద్రపోయాడు. మోహన్ గదుల్లో తిరుగుతూ, అప్పుడప్పుడు కిటికీలోంచి బయటకు చూస్తూ వుండిపోయాడు.

టైమ్ కదుల్తోంది. మూడు దాటింది. గుర్రాల్లా ఆలోచనలు అతని మెదడులో పరుగెడుతున్నాయి.

మేనకను తను ఆ దుర్మార్గులతో పంపేశాడు! తను అసమర్థుడు. ఇటువంటి సమయంలో సినిమాలో హీరో వాళ్ళందర్నీ చావగొట్టి తరిమేస్తాడు. తను చవటలా ఆమెను వాళ్ళ కప్పగించి యింటికొచ్చాడు!

తనని తాను నిందించుకుంటూ మోహన్ సిగరెట్‌ను యాష్ట్రేలో పడేశాడు. యాష్ట్రే సిగరెట్ పీకల్తో నిండిపోయింది. ఇలా సిగరెట్ వెలిగించి, నాలుగు దమ్ములు పీల్చి అతడు పారేస్తున్నాడు.

అతడి మెదడంతా మేనకమీదే వుంది. ఆమెను వాళ్లు ఎంతగా హింసిస్తున్నారో! ఆమె ఎలా భరిస్తోందో!

మెదడులో ఆలోచనల పరంపరలు! భయంకరమైన దృశ్యాలు! ఆమె పొద్దుట నిజంగా తిరిగి వస్తుందా? వాళ్లు వెళ్ళనిస్తారా? అన్నీ అనుమానాలే!

అతడి కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమెను గురించి ఆలోచిస్తూ అతడు లోలోపల కుమిలిపోతున్నాడు. ఏడుస్తున్నాడు. మానసిక క్షోభను తట్టుకోలేకపోతున్నాడు.

అతడు మళ్లా టైమ్ చూశాడు. మూడూ పదిహేను అయింది. కాలచక్రం నత్తలా కదుల్తోంది. అతడు మెల్లిగా వెళ్ళి బీరువా తెరిచాడు. లోపలున్న బ్రాందీ బాటిల్ను పైకి తీసి తలుపుమూశాడు.

అతడు రిఫ్రిజిరేటర్ లోంచి ఒక బుడ్డీ చల్లటి నీళ్ళు

తీశాడు. గ్లాసులో బ్రాందీపోసి, నీళ్ళు కలిపి గడగడ తాగేశాడు. మూడు పెగ్గులు తాగాక అదో విస్తమైన ధైర్యం అతడిని ఆవరించింది. బ్రాందీ మనిషిలో సృష్టించే కృత్రిమ ధైర్యం!

అతడు పిడికిలి బిగించాడు. ఆ కారు నంబరు తను చూశాడు. మేనక తిరిగొచ్చాక తను వెళ్ళి ఆ నలుగుర్నీ చిత్తు చేయాలి. వాళ్ళను ముక్కలు చెక్కలుగా నరకాలి! అతడు వుద్రేకంతో కుర్చీలోంచి లేచాడు.

తూలుతూ కింద కూలిపోయాడు. మొజాయిక్ ఫ్లోర్ మీద లేచి కూర్చున్నాడు. టీపాయి మీదున్న బాటిల్ వంక చూశాడు.

గదిలోని వస్తువులు అతడి కళ్ళకు లీలగా కనిపిస్తున్నాయి. అతడు గ్లాసులో మళ్ళీ బ్రాందీ పోసుకున్నాడు. మైకంలో వుండడంవలన గ్లాసులో బ్రాందీ ఎక్కువగా పోశాడు. నీళ్ళుపోసి, నేలమీద కూర్చుని తాగుతూ కూర్చున్నాడు.

గ్లాసు ఖాళీ అయింది. దాన్ని టీపాయిమీద పెట్టి అతడు నేలమీద వెల్లకిలా పడుకున్నాడు.

అతడికి తెలియకుండా నిమిషాలు గడుస్తున్నాయి.

ఆరు కావస్తోంది.

ఎవరో తలుపును తట్టారు. తూలుతూ అతడు లేచి వెళ్ళాడు. పాలు తెచ్చే మనిషి అయివుంటుంది!

అతడు తలుపు తెరిచాడు.

బయట వాలిపోయిన ముఖంతో మేనక నిలబడి వుంది!

ఆమె అతడి వంక చూడలేదు. చరచన లోపల కెళ్ళింది.

అతడు తలుపును దగ్గరగా మూసి ఆమెవైపు వెళ్ళ

బోయాడు. ఆమె దూరంగా జరిగింది.

"నువ్వు తిరిగొచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను మేనకా," అన్నా డతను.

ఆమె అతడివైపు చూడలేదు.

"స్నానంచేసి వస్తాను. అప్పుడు మాట్లాడుదాం," అని ఆమె లోపలకు వెళ్ళింది.

అతడు హాల్లో నేలమీద కూర్చుండిపోయాడు. అతడి హృదయంలోంచి ఆనందం పొంగుకొస్తోంది. ఆమె తిరిగి వస్తుందో, రాదో అని అతడు సతమత మయ్యాడు. ఆమె యింటికి తిరిగొచ్చింది. అదే చాలు. తనకోసం, కొడుకు కోసం ఆమె ఎంత నరకయాతన్ని భరించి, బయట పడిందో!

అతడు లోపల గదులవైపు చూస్తున్నాడు. ఆమె రాకకోసం ఎదురు చూస్తున్నాడు. ఎవరో తలుపును తట్టారు.

అతడు ముందు గుమ్మంవైపు వెళ్ళి తలుపు తెరిచాడు. పాలమనిషి. ఆమె యిచ్చిన పాత్రను తీసుకుని లోపలకు వెళ్ళాడు.

టేబుల్ మీదున్న పాత్రలో పాలు పోస్తూండగా సగం పైన కింద పడ్డాయి. నేలమీద పడిన పాలవంక విచారంతో చూస్తూ అతడు ఖాళీ పాత్రను తీసుకుని నడుస్తూ బాత్ రూమ్ ముందు క్షణం ఆగాడు. తలుపు మూసి వుంది.

అతడు పాత్రను పాలమనిషికిచ్చేసి తలుపు మూశాడు. భార్య రాకకోసం యెదురుచూస్తూ సోఫాలో చతికిల బడ్డాడు.

భయంకరమైన అరుపులు లోపల్నుంచి ధ్వనించాయి.

అతడు లోపలకు పరుగెత్తాడు. బాత్‌రూం తలుపు తోశాడు. అక్కడి దృశ్యాన్ని చూసి అతడు తారెత్తి పోయాడు.

ఆమె కట్టుకొన్న గుడ్డలు కాలిపోతున్నాయి.మంటల్లో మాడిపోతోంది మేనక! సమీపంలో కిరసనాయిల్ డబ్బా వుంది.

అతడు గట్టిగా అర్చాడు. నేలమీద పడి ఆమె మండుతూ దొర్లుతోంది. ఏం చెయ్యాలో తోచక అతడు బకెట్‌లోని నీళ్ళను ఆమెమీద పోశాడు. కాని మంటలు ఆరిపోలేదు. అతడు బయటకెళ్ళాడు. దట్టంగా వున్న తివాసీ తెచ్చి ఆమెమీద కప్పేశాడు.

తివాసీ కిందున్న ఆమె కదలడంలేదు. అతడు తివాసీని పైకి తీశాడు. ఆ ఘోర దృశ్యాన్ని చూసి అతడు భయంకరంగా అర్చి నేలకూలిపోయాడు.

బయటనుంచి యెందరో తలుపును తట్టుతున్నారు. అతడు వినే స్థితిలో లేడు. ఎవరో వచ్చి అతడిమీద పడ్డారు. అతడు కళ్ళు తెరిచాడు. కొడుకు ఆనంద్.

"డాడి! డాడీ!"

అతడు కొడుకువైపు చూశాడు.

"ఎవరో తలుపు కొడుతున్నారు!" అన్నాడు ఆనంద్.

అతడు లేచాడు. మెల్లిగా, సత్తువ లేనట్లు నడుస్తూ వెళ్ళి ముందు తలుపు తెరిచాడు. బయట డజనుమంది నిలబడి వున్నారు.

"అరుపులు విని వచ్చాం. ఏమైంది, మిస్టర్ మోహన్?" అన్నాడు పక్క ఫ్లాట్‌లో వుండే రామలింగం.

మోహన్ జవాబుగా చేత్తో లోపలకు చూపించాడు,

రామలింగం తదితర్లు వేగంగా లోపలకు వెళ్ళారు.

లోపల కెళ్ళినవాళ్ళు హాల్లోకి తిరిగివచ్చారు. రామలింగం మెల్లిగా మోహన్ భుజంమీద చెయ్యి వేశాడు.

"ఇంత ఘోరంగా ఆమె ఎలా మరణించింది? యాక్సిడెంట్ అయిందా?"

అదే ప్రశ్న యితర్లు అడిగారు. మోహన్ చెవులు మూసుకున్నాడు.

"ప్లీస్, నన్నొదక్కండి! చెప్పలేను. ఎవరేనా పోలీసులకు ఫోన్ చేసి రమ్మనండి" అన్నాడు మోహన్.

రామలింగం, మరి కొందరు బయటకు వెళ్ళారు. రామలింగం భార్య ఆనంద్‌ని తీసుకెళ్ళడానికి ప్రయత్నించింది. కాని ఆనంద్ తండ్రిని వదల్లేదు.

ఎవరెవరో లోపలకు వెళ్ళి శవాన్ని చూసి హాల్లోకొచ్చి అతడితో ఏదో అంటున్నారు. కాని అదంతా అతడికి వినపడ్డంలేదు.

మోహన్ ఆలోచిస్తున్నాడు. తననీ, కొడుకునీ రక్షించాలనే వుద్దేశంతో ఆమె వాళ్ళ కూడా వెళ్ళింది. తిరిగొచ్చాక తన ముఖం చూడలేక, ఆమె తన ప్రాణాన్ని తీసుకుంది.

ఆమె ఏం తప్పు చేసింది? ఆమె ఏ తప్పూ చెయ్యలేదు. ఆమె దేవత. తన హృదయ జ్యోతి, యింటి దీపం ఆరిపోయింది. ఎంత అపరాధాన్నైనా తనభర్త మన్నించగలడన్న విషయం ఆమె మర్చిపోయింది. తనకు మాట్లాడే అవకాశం కూడా లేకుండా ఆమె మరణమందిరంలోకి దూరింది!

పిచ్చివాడిలా మోహన్ ఆలోచిస్తున్నాడు.

"డాడీ అమ్మ బాత్‌రూమ్‌లో పడుకుందేం?" ఆనంద్

అమాయకంగా అడిగాడు.

మోహన్ కన్నీళ్ళు తటాలున ఆనంద్ మీద జల జల కారాయి.

## 3

ఇన్‌స్పెక్టర్ నాయర్ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి కాలి నగ్నంగా వున్న శవాన్ని చూశాడు. శవం పక్కన కిరసనాయిల్ డబ్బా వుంది. కొంచెం దూరంలో టూవ్, పైన పవర్ వున్నాయి.

ఆమె శరీరం ఘోరంగా మాడిపోయింది. చూసే వాళ్ళ గుండెలు దడ దడ మనేటట్లు వుందా దృశ్యం.

ఇన్‌స్పెక్టర్ ముందు హాల్లోకి వెళ్ళాడు. మోహన్, కొడుకు అలాగే కూర్చుని వున్నారు.

"మిస్టర్ మోహన్, ఏదేనా పాత చీర వుంటే శవాన్ని కప్పొచ్చు" అన్నాడు నాయర్.

"అనవసరం, యిన్‌స్పెక్టర్! కప్పడానికి ఇక్కడేముంది?" అని వాపోయాడు మోహన్.

"ఏం జరిగిందో చెప్పండి."

"ఆమె ఆత్మహత్య చేసుకుని సుఖంగా మమ్మల్ని విడిచి వెళ్ళిపోయింది."

"ఎందుకలా జరిగింది?"

మోహన్ గది నలువైపులా చూశాడు. ఒక కానిస్టేబుల్ దూరంగా నిలబడి వున్నాడు.

"నేను చెప్పేది మీరు తప్ప యెవరూ వినకూడదు."

"ఆల్ రైట్," అని ఇన్‌స్పెక్టర్ నాయర్ కానిస్టేబుల్ని బయటకు పొమ్మని సౌజ్ఞ చేశాడు.

ఏదీ దాచకుండా జరిగినదంతా మోహన్ ఏడుస్తూ చెప్పాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ మౌనంగా అంతా

విన్నాడు. కారు నెంబర్ను యిన్‌స్పెక్టర్ రాసు కున్నాడు.

"ఇన్‌స్పెక్టర్, అదీ కథ. ఈ మహాపట్నంలో అటు వంటి దుర్మార్గులు సంచరిస్తున్నారు" అన్నాడు.

ఎవరో తలుపును తట్టారు.

"కమిన్," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డాక్టర్ సుధాకర్ లోపలకు వచ్చాడు. అతడిని నాయర్ బాత్‌రూమ్‌లోకి తీసుకు వెళ్ళాడు. కాస్సేపట్లో నాయర్ హాల్లోకి తిరిగి వచ్చాడు.

"సినిమా టికెట్ల కౌంటర్‌ఫోయిల్స్ మీ దగ్గర వున్నాయా?"

మోహన్ పాంటు జేబు వెతికి మూడు టికెట్ల కౌంటర్ ఫోయిల్స్‌ను నాయర్‌కి యిచ్చాడు.

"మీ స్కూటర్ ఎక్కడుంది?"

"కింద."

"దాని కీ యివ్వండి."

పాంటు జేబులోంచి స్కూటర్ కీ తీసి అతడు ఇన్‌స్పెక్టర్‌కి ఇచ్చాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు వెళ్ళి పోయాడు.

కిందనున్న స్కూటర్ని పరీక్షించారు నాయర్. అది స్టార్ట్ అవలేదు. తతిమ్మా ఫ్లాట్స్‌లో వున్నవాళ్ళను కలుసు కుని మోహన్ గురించి ఇన్‌స్పెక్టర్ నాయర్ వివరాలు తెల్సుకున్నాడు. మోహన్ అతడి భార్య గురించి అందరూ ఒకే విధంగా చెప్పారు.

"ఐడియల్ కాపుల్ సార్! వాళ్ళను చూస్తుంటే మేడ్ ఫర్ యీచ్ అదర్ అడ్వర్టైజ్‌మెంట్లు గుర్తు కొస్తాయి. చాలా, హాయిగా, ఆనందంగా జీవించే

వారు!" అన్నా రందరూ.

ఇన్‌స్పెక్టర్ నాయర్ శవం వున్న గదిలోకి వెళ్లాడు. ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్ తన పని ముగించి నాయర్ వైపు చూశాడు.

"ఈ డబ్బామీద ఆమె వేలిముద్రలు వున్నాయి," అన్నా డతను.

శవం ఫోటోలు తీస్తున్నారు. ఇన్‌స్పెక్టర్ బయట నున్న నడవలోకి వెళ్లి డాక్టర్ సుధాకర్‌తో మాట్లాడి హాల్లోకి తిరిగివచ్చాడు.

హాల్లో కూచ్చున్న మోహన్ వైపు ఓసారి చూశాడు. గదిలో పచార్లు చేస్తూ ఆలోచించసాగాడు. ఆత్మహత్య చేసుకునేవాళ్లు సాధారణంగా వుత్తరం రాస్తారు. కాని ఆమె రాసినట్లు లేదు. మోహన్ చెప్పినదంతా అతడి మెదడులో తిరిగింది. ఆ స్థితిలో ఆమె వుత్తరం రాయ లేదు!

మోహన్ యెదురుగా వున్న యిన్‌స్పెక్టర్ వైపు చూశాడు.

"ఇన్‌స్పెక్టర్, ఒక విన్నపం!" అన్నాడు.

"ఏమిటి?"

"నా భార్య మేనక మరో లోకంలోకి వెళ్ళి పోయింది. ఏదో జరిగిపోయింది, ఎవరూ ఆపలేని పరి స్థితుల్లో. ఆమె పేరు, నా పేరు బయటపడ్డం నా కిష్టం లేదు. దయ చేసి పత్రికల వాళ్ళకు మా పేర్లు యివ్వ కండి."

"మిస్టర్ మోహన్, మీ పేర్లు ఎక్కడా బయట పెట్టను. మీరు బెంగ పెట్టుకోకండి" అన్నాడు ఇన్ స్పెక్టర్ నాయర్.

మేనక శవాన్ని స్ట్రెచర్ మీద బయటకు మోసుకు పోతున్నారు, పోస్టుమార్టమ్‌కి. మోహన్ కొడుకు లేచి మౌనంగా నిలబడ్డారు, పాలిపోయిన ముఖాలతో.

స్ట్రెచర్ వెళ్ళిపోయింది. మోహన్ సోఫాలో కూలి పోయాడు. అతడి కాళ్ళమీద ముఖాన్ని ఆనించి ఆనంద్ పడుకొన్నాడు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ విచారవదనంతో మోహన్ ముందుకు నడిచాడు.

"మిస్టర్ మోహన్, జరిగినదానికి నేను చాలా విచారిస్తున్నాను. ఆమె మీకు ఒక కొడుకు నిచ్చి వెళ్ళి పోయింది. అతడి అభివృద్ధికోసం తాపత్రయ పడండి."

మోహన్ ఇన్‌స్పెక్టర్ వంక కన్నీళ్ళతో చూశాడు. "ఆనంద్‌కోసం బతకాలి! వీడు లేకపోతే ఆమెతో నేనూ వెళ్ళిపోయి వుండేవాణ్ని."

ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు వెళ్ళిపోయాడు.

## 4

దినపత్రికలో మొదటి పేజీలో వచ్చిన కన్నీటి గాథను డిటెక్టివ్ పరశురామ్ చదివాడు. అతడి హృదయాన్ని ఎవరో సూదులతో పొడుస్తున్నట్లు అనిపించింది.

పక్కనున్న పార్వతికి పేపరిచ్చి చదవమన్నాడు. ఆమె బాధతో చదివింది. క్షణకాలం కళ్ళు మూసుకొంది. తెరవగానే ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

పరశురామ్ భార్య భుజంమీద చెయ్యివేశాడు. ఆమె వైపు ఆప్యాయంగా చూశాడు.

"పారూ, వాళ్ళ పేర్లు పత్రికలో రాలేదు. అయినా

యీ అన్యాయం యే యిల్లాలికి జరిగిందో కనుక్కొని ఆ దుష్టులను తగు విధంగా శిక్షిస్తాను," అన్నాడు పరశురామ్.

"వెంటనే చేయండి. మరో స్త్రీకి యిలా జరగ కూడదు," అంది పార్వతి.

పరశురామ్ టైమ్ చూశాడు. పది కావస్తోంది. రిసీవ రెత్తి ఒక నెంబరు తిప్పాడు.

"హలో, ఇన్స్పెక్టర్ నాయర్?" అంది అటువైపు కంఠం.

"నాయర్ భాయ్, ఇవాళ పేపర్లో మొదటి పేజీలో పడ్డ వార్త చూశావా?"

"చూశాను, బ్రదర్. చాలా ట్రాజిక్."

"ఆ కేసును నువ్వు పరిశోధిస్తున్నావా?"

"యస్, బ్రదర్."

"వాళ్ళ గురించి నాకు చెప్పగలవా?"

"బ్రదర్, ఆఫీసుకు రాగల్గితే రా. అంతా నీకు చెప్తాను."

"వెంటనే వస్తున్నాను," అని పరశురామ్ రిసీవర్ని పెట్టేశాడు.

కెటిల్లోని కాఫీని పార్వతి కప్పులో పోసింది. అతడు వేగంగా తాగి, లోపల గదిలోకి వెళ్ళాడు. దుస్తులు మార్చుకుని పరశురామ్ మెట్లమ్మట కిందకు పరుగెత్తాడు.

ఇన్స్పెక్టర్ నాయర్కి యెదురుగా పరశురామ్ కూర్చున్నాడు. పైన ఫాన్ తిరుగుతోంది. నాయర్ టేబుల్ మీద పది దినపత్రిక లున్నాయి, అనేక భాషల్లో.

"బ్రదర్ వాళ్ల పేర్లు యెవ్వరికీ చెప్పవద్దని అత

నన్నాడు. అందువలన నే పత్రికల్లో వాళ్ళ పేర్లు రాలేదు. జరిగినది మాత్రం చిత్రించబడింది," అన్నాడు నాయర్.

పరశురామ్ ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి, పొగ వదుల్తూ నాయర్ వంక సూటిగా చూశాడు.

"నేను ఆ అభాగ్యురాలి భర్తను కల్సుకుని మాట్లాడాలి! ఈ గూండాలకోసం నేను వేటాడ దల్చాను."

నాయర్ అంతా చెప్పాడు.

"కారు నెంబర్ని గురించి దర్యాప్తు చేశాను. అది నకిలీ నెంబర్ ప్లేట్. మోహన్ చూసిన కారు అంబాసిడర్. ఆ నెంబరున్న కారు మోరిస్," అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

"అతడు యింట్లోనే వుంటాడుగా?"

"నెల రోజులపాటు లీవు పెట్టానని చెప్పాడు. ఇంట్లోనే వుంటాడు. అతడి పేరు పత్రికలవాళ్ళ చెవుల్లో పడకుండా చూడు!"

పరశురామ్ కుర్చీలోంచి లేచాడు. నాయర్ కి బై బై చెప్పి అతడు బయటకు నడిచాడు.

## 5

డాడ్జి కారును పరశురామ్ వేగంగా పోనిచ్చాడు.

పదిహేను నిమిషాల్లో పెద్ద భవనం ముందు కారు ఆగింది. మెట్లెక్కి అతడు పైకి వెళ్ళాడు. నెంబర్ 8 ఫ్లాట్ తలుపు ముందు ఆగాడు. వేళ్ళతో తలుపును తట్టాడు.

తలుపు తెరవబడింది. ఎదురుగా వున్న వ్యక్తి వంక పరశురామ్ సానుభూతితో చూశాడు.

అతడు జీవచ్ఛవంలా వున్నాడు. బాగా మాసిన

గడ్డం. ఎర్రబడిన కళ్ళు. మనిషి నీరసంగా అగుపిస్తున్నాడు. అమాంతంగా అతడివయస్సు ఏ యిరవై ఏళ్ళో పెరిగినట్లు కనిపిస్తున్నాడు.

"మిస్టర్ మోహన్, అయామ్ డిటెక్టివ్ పరశురామ్" అన్నాడతను.

అతడు శూన్యంలోకి చూసినట్టు చూశాడు.

"మీకేం కావాలి?" జీవంలేని కంఠంతో అడిగాడు మోహన్.

"మీతో మాట్లాడాలి."

"అంతా అయిపోయింది. ఇక మాట్లాడ్డం దేనికి? క్షమించండి."

అతడు తలుపు మూయబోయాడు. పరశురామ్ తటాలున లోపలకు దూరి వీపుతో తలుపు మూశాడు.

మోహన్ మెల్లగా వెళ్ళి సోఫాలో కూలిపోయాడు. అతడి కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

పరశురామ్ అతడి దగ్గరగా వెళ్ళి చెయ్యి పట్టుకున్నాడు.

"మిస్టర్ మోహన్, మీకు జరిగినదాన్ని గురించి ఒక దిన పత్రికలో చదివాను. ఆ దుర్మార్గులను బంధించి చిత్రవధ చెయ్యాలనే దృఢ నిశ్చయంతో యిలా వచ్చాను. మీ పేరు బయటకు పొక్కకుండా నేను జాగ్రత్త పడ్తాను" అన్నాడు పరశురామ్.

"పరశురామ్‌గారూ, మరో లోకంలో సుఖంగా నిద్ర పోతున్న ఆమెను లేపడం నా కిష్టంలేదు" అన్నాడతను.

"మరణించిన వాళ్ళను ఎవ్వరూ లేపలేరు. కాని బ్రతికున్న వాళ్ళ జీవితాలు ధ్వంసం కాకుండా జాగ్రత్తపడ్డం మన కర్తవ్యం. ఆ కిరాతకులను అలా వదిలేస్తే ఇలాగే

మరికొన్ని నిండు సంసారాలను వాళ్ళు కూలగొడ్తారు."

"నన్నేం చెయ్యమంటారు?"

"నా ప్రశ్నలకు జవాబివ్వండి."

పరశురామ్ నలువైపులా చూశాడు.

"మీ అబ్బాయి ఆనంద్ ఏడి?"

"వాడిని స్కూల్లో వదిలివచ్చాను. నాతో కూర్చుంటే నాలాగే పిచ్చివాడవుతాడు!"

"కార్లోనుంచి దిగిన ఆ నలుగుర్నీ యింతకు ముందు మీరు ఎప్పుడేనా చూశారా?"

"థియేటర్లో వాళ్ళు మా ముందు కుర్చీల్లో కూర్చున్నారు. ఇంటర్వెల్లో వెనుదిరిగి నా భార్యవైపు పదేపదే చూశారు. అది నా భార్య గమనించింది. నాతో కూడా చెప్పింది. అప్పట్లో నేనదంతా లైట్‌గా తీసుకున్నాను."

"వాళ్ళను గురించి మీకు తెలిసినది, వూహించింది చెప్పండి. వాళ్ళను వర్ణించండి!"

"ఇద్దరు పొట్టిగా, లావుగా వున్నారు. ఇద్దరు పొడుగ్గా సన్నంగా వున్నారు. ఖరీదైన పాంట్లు, స్లాకుల్లో వున్నారందరూ. బీదవాళ్ళయి వుండరు. చేతులకు మంచి వాచీలు వున్నాయి. అందరూ మందు సేవించి సినిమాకొచ్చారని తెలుస్తోంది. వాళ్ళు మాట్లాడుతుంటే బ్రాందీ వాసన కొడ్తోంది. వాళ్ళు దిగిన కారు నల్లటి అంబాసిడర్. అందరి చేతుల్లోనూ బటన్ నొక్కితే పైకెగిరివచ్చే కత్తులున్నాయి. ఇటువంటి నేరాలు చేయడంలో ఆరితేరినవాళ్ళయి వుండాలనిపించింది నాకు."

మోహన్ ఆగాడు. మొహాన్ని చేత్తో కప్పుకొన్నాడు.

"మిస్టర్ మోహన్! మీరు నెల దాకా లీవు

పెట్టారా?"

అతను తలాడించాడు.

"నేను వాళ్ళ కోసం రాత్రిళ్ళు వెంటాడుతాను. మీరూ నాతో సహకరిస్తూ పని చేయొచ్చు. రాత్రిళ్ళు స్కూటర్ మీద మీరు తిరగండి. వాళ్ళు ఎక్కడేనా కనబడితే నా నెంబరుకి వెంటనే ఫోన్ చేయండి."

"తిరిగితే మేనక వస్తుందా?"

"ఆ దుర్మార్గులను పట్టి శిక్షిస్తే మేనక ఆత్మకు శాంతిని కలిగించిన వారవుతారు."

"మీరు చెప్పింది నిజమే!" అని వూరుకొన్నాడతను.

జేబులోంచి ఒక విజిటింగ్ కార్డు తీసి పరశురామ్ అతడి కిచ్చాడు.

"మీ కొడుకు ఆనంద్ ఒంటరిగా వుండనవసరం లేదు. అతడు నిద్రపోయాక మీరు తిరిగొచ్చు. కొంతకాలం పాటు అతడికి తోడుగా వుండడానికి ఏ పనిమనిషినో మీరు నియమించండి."

"అలాగే చేస్తాను. మా పనిమనిషి మంగమ్మ యిక్కడే వుండి వాడిని చూసుకుంటుంది."

పరశురామ్ అతడివంక సూటిగా చూశాడు.

"మీ సహాయంతో ఆ దుర్మార్గులను పట్టుకోగలననే నమ్మకం నాకుంది" అని అతడితో కరచాలనం చేసి పరశురామ్ బయటకు వెళ్ళాడు.

వేగంగా మెట్లు దిగి తన కారువైపు నడిచాడు.

## 6

ఆనంద్ నిద్రపోతున్నాడు. మోహన్ టైమ్ చూశాడు. పది కావస్తోంది.

అతడు ముందుగదిలో కొచ్చాడు. మంగమ్మ నేలమీద

కూర్చుని వుంది.

"మంగమ్మా, చాప వేసుకొని బాబున్న గదిలో పడుకో. వాడిని జాగ్రత్తగా చూసుకో!"

అతడు బయటకు నడిచాడు. ముందు తలుపును ఏర్ లాక్ చేశాడు. మెట్లమ్మట దిగుతూ అతడు ఆలోచించ సాగాడు. వాళ్ళకోసం ఎక్కడ వెతకాలి?

ఆ రాత్రి తను వెళ్ళిన "రీనా" థియేటర్లో వాళ్ళు వుంటారేమో!

అతడు స్కూటర్ని పోనిచ్చాడు. థియేటర్ కాంపౌండులో స్కూటర్ ఆపి లాక్ చేసి, లోపలకెళ్ళి టికెట్ కొన్నాడు. థియేటర్లోకి నడిచాడు.

హాల్లో చీకటిగా వుంది. ఇండియన్ న్యూస్ రివ్యూ సాగుతోంది. అతడు ఒక కుర్చీలో కూర్చుని నలువైపులా చూశాడు. ఎన్నో ఆకారాలు! ఎవర్నీ అతడు స్పష్టంగా చూడలేకపోయాడు. ఇంటర్వెల్లో లైట్లు వెలిగాక తను చూడొచ్చు!

వాళ్ళ అంబాసిడర్ కారు అతడికి గుర్తొచ్చింది. వాళ్ళు థియేటర్లో వుంటే కారు కాంపౌండ్లో వుండాలి! ఈ ఆలోచన తట్టగానే అతడు బయిటకు వెళ్ళాడు.

కాంపౌండు నలువైపులా చూశాడు. అరడజన్ కార్లు వున్నాయి. ఒక బ్లూ అంబాసిడర్ కారు వుంది. తతిమ్మావి వేరే కార్లు. వాళ్ళు యీ థియేటర్కి రాలేదు. మరెక్కడికో వెళ్ళుంటారు.

అతడు స్కూటర్ వంక నడిచాడు. కాస్సేపు మౌనంగా నిలబడ్డాడు. ఆ నాటి రాత్రి తనూ, మేనకా, ఆనంద్ గేటు దాటి నడుస్తూ వెళ్ళడం అతడికి గుర్తొచ్చింది. ఏదో బాధ అతడిని వేధించింది,

స్కూటర్ని స్టార్టుచేసి అతడు కూర్చొని పోనిచ్చాడు. ఆనేక రోడ్లమ్మట తిరిగాడు. రెస్టారెంట్ల ముందు ఆపి నల్లటి అంబాసిడర్ కోసం చూశాడు. ఎక్కడా వాళ్ళు తటసపడలేదు.

పేపర్లలో పడిన వార్తను చదివి, భయపడి వాళ్ళు ఎక్కడో దాగున్నారేమో! కొంతకాలందాకా బయటకు రారేమో!

ఒక రెస్టారెంట్లోంచి అతడు పరశురామ్కి ఫోన్ చేశాడు.

"హలో!" అందొక తియ్యటి స్త్రీ కంఠం.

"పరశురామ్గారు కావాలి."

"మీ పేరు?"

"మోహన్."

"పరశురామ్గారి భార్యని? వాళ్ళెక్కడేనా కనిపించారా?" అడిగిందామె.

"లేదు."

"రాక్షసుల్ని వెదికి పట్టుకోడానికి కొంత టైము పడుతుంది. పరశురామ్గారు పట్నంలో తిరుగుతున్నారు. ఎక్కడో మీకు కనపడొచ్చు!" అందామె.

"మీ నిద్రకు భంగం కల్గించినందుకు మన్నించండి" అన్నాడతను.

"మిస్టర్ మోహన్, యీ సంఘటన్ని గురించి చదివాక నాకు నిద్రపట్టడం లేదు. వేలాది స్త్రీలు నాలాగే భావిస్తూ వుండాలి, నిర్విరామంగా వేటాడండి! చివరకి మీరు జయిస్తారు" అందామె.

అతడు రిసీవర్ని పెట్టేశాడు. కుర్చీలో కూర్చుని టీ ఆర్డరిచ్చాడు. వేడి టీ తాగి అతడు బిల్లు చెల్లించి బయటకు

నడిచాడు.

ఆనాటి రాత్రి వాళ్ళు తనకు తటస్థపడిన రోడ్డువైపు స్కూటర్ని తిప్పాడు మోహన్. ఆ రోడ్డుమీద వుండే కొన్ని లైట్లు పగిలిపోయాయి. అందువలన చీకటిగా వుంది.

అతడు స్కూటర్ని మెల్లిగా పోనిస్తున్నాడు. స్కూటర్ కాంతిలో రోడ్డు వారగా ఒక కారు ఆగి వుంది. అతడు వులిక్కిపడ్డాడు. వాళ్ళు కారు మార్చారేమో!

కారు పక్కనే అతడు స్కూటర్ని ఆపాడు. కారులో ఎవ్వరూ లేరు. దూరంనుంచి ఏదో టార్చికాంతి అతడిమీద పడింది.

ఎవరో అతడివైపు వేగంగా వస్తున్నారు. బూట్ల చప్పుడు!

"మిస్టర్ మోహన్, మీరా?" అన్నాడు పరశురామ్.

"మీ కోసం ఫోన్ చేశాను" అన్నాడు మోహన్.

"ఏమేనా చెప్పాలా?"

"ఎక్కడా వాళ్ళు పత్తాలేదు."

"నేరాలు చేసేవాళ్ళు జాగ్రత్తపడ్తారు. మనం చెయ్యి చాచగానే దొరికిపోరు! వాళ్ళకోసం మనం వెతుకుతూనే వుండాలి" అన్నాడు పరశురామ్.

"మీ రిక్కడ కెందుకొచ్చారు?" ప్రశ్నించాడు మోహన్.

"ఒకతను మీతో యీ ప్రదేశంలో మాట్లాడాడు. ఆ సమయంలో ఏదేని అతడి వస్తువు యిక్కడ పడిందేమో అని వెతికాను."

"ఏదేనా దొరికిందా?"

పరశురామ్ తన చేతిలో వున్న వస్తువు మీదకు

టార్చిని తిప్పాడు. సగం కాల్చిన ఖరీదైన చుట్ట!

"ఇది వాళ్ళదో కాదో చెప్పలేను?" అన్నాడు పరశురామ్.

మోహన్ క్షణకాలం మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

"పరశురామ్‌గారూ, నన్ను తన్నినపుడు అతడి నోట్లో నుంచి కాలుతున్నదేదో కిందపడ్డం నాకు గుర్తుంది. ఈ చుట్ట అతనిదే కావచ్చు" అన్నాడు మోహన్.

"గుడ్, మన పరిశోధన ముందుకు వెళ్తోంది. ఆ నలుగురిలో ఒకడు చుట్టలు కాలుస్తాడని మనం అనుకోవచ్చు," అన్నాడు పరశురామ్.

మరి కొంతసేపు మాట్లాడి యిద్దరూ విడిపోయారు. డాడ్జికారును శరవేగంగా పోనిచ్చాడు పరశురామ్.

టైమ్ చూశాడు. ఒంటి గంట కావస్తోంది. ఒక థియేటర్ ముందు కారాపి పరశురామ్ కార్లో కూర్చుని బయటకు చూశాడు.

గుంపులు గుంపులుగా జనం బయటకొస్తున్నారు. ఎన్నో కార్లు బయటకొచ్చి రోడ్డమ్మట పోతున్నాయి. ఒక నల్ల అంబాసిడర్ కారు మీదకు అతడి దృష్టి వెళ్ళింది. అందులో ఒక పురుషుడు, స్త్రీ, పిల్లలు కూర్చుని వున్నారు. ఆ కారు తనకు కావల్సింది కాదు!

ఏదో ఆలోచన తట్టి పరశురామ్ కారును థియేటర్ కాంపౌండ్‌లోకి పోనిచ్చి కార్లు ఆగే పార్కింగ్ స్థలంలో ఆపాడు. ఒక యువకుడు కారువైపు పరుగెత్తు కొచ్చాడు.

పరశురామ్ అతడివంక నవ్వుతూ చూశాడు. "ఇక్కడ ఆపిన కార్లకు నువ్వు వాచ్‌మన్‌వా?"

"అవును సార్."

"నలుగురు పురుషులు నల్లటి అంబాసిడర్ కార్లో యిక్కడికి కొచ్చారా? ఇద్దరు పొట్టిగా లావుగా వుంటారు. తతిమ్మా యిద్దరూ పొడుగ్గా వుంటారు."

"చెప్పలేను సార్," అన్నాడు కార్ల వాచ్‌మన్.

పరశురామ్ పదిరూపాయల నోటును అతడికి కనిపించేలా పట్టుకొన్నాడు.

"చెప్పగలిగితే యీ నోటు నీదవుతుంది. ఆ నలుగురిలో ఒకతను చుట్ట కాలుస్తాడు!"

"వాళ్ళు గుర్తున్నారు సార్. ఇక్కడికి యీ మధ్య రాలేదు. మునుపు వచ్చేవారు. వాళ్ళకు చాలా కార్లు వుండుండాలి. వేరు వేరు కార్లలో వాళ్ళు వచ్చారు."

"ఆ కార్ల పేర్లు చెప్పగలవా?"

"నల్ల అంబాసిడర్, క్రీమ్ కలర్ ఫియట్, బ్లూ హెరాల్డ్, గ్రీన్ హిల్‌మన్ కార్లలో వాళ్ళు రావడం నేను చూశాను, సార్. బాగా మందుకొట్టి సినిమా కొస్తారు," అన్నాడు వాచ్‌మన్.

పరశురామ్ పది రూపాయల నోటును అతడి కిచ్చేశాడు.

"ఈ సారి వాళ్లు సినిమాకొస్తే యీ నెంబర్కి ఫోన్ చేసి చెప్పు! నీకు వందరూపాయలు వస్తుంది," అని పరశురామ్ తన కార్డు యిచ్చాడు.

"అలా చేస్తే నాకు ప్రమాదం రాదుగా?"

పరశురామ్ నవ్వాడు.

"మొగాడివి. భయపడకు! ప్రమాదమొస్తేఎదురొక్క. నాకు ఫోన్ చేస్తే నేనొచ్చి కాపాడ్తాను."

"అలాగే సార్,"

"ఆ కార్డు ఎవ్వరికీ చూపించకు! మనం మాట్లాడిన దంతా రహస్యంగా వుంచు."

"అలాగే సార్!" అన్నాడతను.

పరశురామ్ కారును పోనిచ్చాడు. వాళ్ళు కార్లనూ, కార్ల నెంబర్లనూ మారుస్తూ వుంటారని స్పష్టంగా తెలుస్తోంది. అతడు కారును స్పీడుగా మరికొన్ని రోడ్లమ్మట పోనిస్తూ, ఆలోచించసాగాడు. ఇదే విధమైన యేర్పాటు యితర థియేటర్ల వద్ద కూడా చేస్తే బాగుంటుందని పించింది.

## 7

గీతా థియేటర్లో లైట్లు వెలుగుతున్నాయి. గోపాల్, రాధిక పక్కపక్కనే కూర్చున్నారు. వాళ్ళ పెళ్ళయి వారం రోజులైంది.

రాధిక వయస్సు పదెనిమిది సంవత్సరాలుంటుంది. ఆమె చాలా అందంగా వుంది. బంగారంలాంటి శరీర చ్ఛాయ. విశాలమైన కాటుక కళ్ళు. తీర్చిదిద్దిన ముక్కు. ఎర్రటి పెదిమలు. పట్టుచీర ధరించిందామె. జడలో గులాబీలు, మల్లెపూలు వున్నాయి.

ఒక చాక్లెట్‌ను సగం కొరికి గోపాల్ ఆమెకిచ్చాడు. ఆమె నవ్వుతూ నోట్లో పడేసుకుంది.

"నైట్ షోకి నేనింత వరకూ వెళ్ళలేదు," అందామె.

"నైట్ షోలంటే నాకెంతో సరదా. భోజనం ముగించి హాయిగా సినిమా చూడొచ్చు. ఇంటి కెళ్ళాక హాయిగా నిద్ర పట్టేస్తుంది," అన్నాడు గోపాల్.

"నిద్ర పోయేవాడికి పెళ్ళెందుకు?" అంది రాధిక అతడి వంక కొంటెగా చూస్తూ.

"నిద్రపోసులే! ఆఫీసుకు వెళ్ళక్కర లేదుగా? పగలు పడుకోవచ్చు," అన్నాడతను.

"సీతో ఎంతో మాట్లాడాలి!" అందామె.

"దేన్ని గురించి?"

"నేనొక నవల చదివాను. అందులో లవర్స్ చాలా అనురాగంతో జీవిస్తారు. ఒకర్నొకరు విడిచి క్షణంకూడా వుండలేరు...."

"అది జీవితంలో సాధ్యంకాదు, రాధికా. మొగుడు ఆఫీసు కెళ్ళాలి. డబ్బు గడించాలి. చేతిలో డబ్బు లేక పోతే ప్రేమ హరించిపోతుంది."

"నిజమైన ప్రేమ దేన్నీ కోరదు!" అందామె.

"ఆ నిజమైన ప్రేమంటే ఎలా వుంటుందో నేను, నీ దగ్గర నేర్చుకుంటాలే," అన్నాడతను, ఆమెవంక ఓరగా, సంతోషంగా చూస్తూ.

కార్లు ఆపే స్థలంలో క్రీమ్ రంగు ఫియెట్ ఆగింది. నలుగురు మనుషులు కిందకు దిగారు. కార్లను చూసే యువకుడు వాళ్ళవైపు చూశాడు. అతడి మెదడులో ఏదో మెరిసింది.

"సార్?" అన్నాడతను.

"ఏమిటి?" అడిగాడు ముల్లా.

అతడి నోట్లో చుట్ట వెలుగుతోంది.

"ఒకాయన మిమ్మల్ని గురించి నన్ను అడిగాడు. మీరు సినిమా కొస్తే ఫోన్ చేసి చెప్పమన్నాడు. వంద రూపాయ లిస్తానన్నాడు."

ముల్లా తతిమా వాళ్ళవంక చూశాడు.

"ఎవరతను?" అడిగాడు మస్తాన్.

"పేరు చెప్పలేదు. టెలిఫోన్ నెంబర్ చెప్పాడు,"

అబద్ధమాడాడు వాచ్‌మన్.

"ఆ నెంబరు చెప్పు," అన్నాడు పైడిరాజు.

వాచ్‌మన్ నెంబరు నెప్పాడు.

"ఈ నెంబరెవర్దో నేను కనుక్కొంటాను," అన్నాడు నాయుడు.

"డోంట్ బాదర్!" అని ముల్లా వాచ్‌మన్ వంక చూశాడు.

"వాచ్‌మన్, మేం వచ్చినట్లు చెప్పకు. నీకు రెండు వందలు యిస్తాం" అన్నాడు ముల్లా.

వాచ్‌మన్ రెండు నోట్లనూ జేబులో దాచేసుకున్నాడు.

"ప్రాణంపోయినా నేను చెప్పను, సార్" అన్నాడు.

"అంతే, వీడి నోరు నొక్కేశాం" అని ముల్లా ముందుకు నడిచాడు, చుట్టను పక్కకి విసురూ.

తతిమ్మా ముగ్గురూ అతడిని వెంబడించారు.

"వాడు ఫోన్ చేసి చెప్తే?" అడిగాడు నాయుడు.

"చెప్పడు. జేబులోని నోట్లు అతడి నోటికి తాళం వేస్తాయి" అన్నాడు ముల్లా.

ముగ్గురూ థియేటర్లోకి వెళ్ళిపోయారు.

గోపాల్ వెనక్కి తిరిగి చూశాడు. నల్గుగు వ్యక్తులు అప్పుడే వచ్చి వెనక కుర్చీల్లో కూర్చున్నారు. వాళ్ళనుంచి బ్రాందీ వాసన కొడ్తోంది. లైట్లు ఆరిపోయాయి.

గోపాల్ ఆప్యాయంగా ఆమె చెయ్యిని పట్టుకుని వేళ్ళను నిమిరాడు. ఆమె దగ్గరకు వంగి చెవిలో ఏదో చెప్పాడు. ఆమె కిలకిల నవ్వింది.

"నువ్వెప్పుడేనా ఎలుగుబంట్లను చూశావా?" అడిగాడు గోపాల్ తగ్గు స్వరంలో.

"లేదు" అందామె.

"లైట్లు వచ్చాక చూడు, వెనక కూర్చున్నాయి."

"జంతువులు సినిమాలు చూస్తాయా?" అందామె.

"సినిమాల్లో జంతువులు నటిస్తున్నాయిగా, అవి సినిమాలు చూస్తే మనం ఆశ్చర్యపడకూడదు" అన్నాడు గోపాల్.

ఆమె కిలకిల మళ్ళా నవ్వింది.

# 8

కార్ల వాచ్‌మన్ ఆలోచిస్తున్నాడు. తనకు అనుకోకుండా రెండొందలు వచ్చింది. అతడు యిస్తానన్న వందను ఎందుకు పోగొట్టుకోవాలి? ఫోన్ చేసి చెప్తే తన వందా తన కొస్తుంది.

సినిమా ప్రారంభమైంది. ఇంక కార్లు రావు. అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతడు ఒక నిశ్చయానికొచ్చి బయటకు నడిచాడు.

థియేటర్ ఎదురుగా టెలిఫోన్ బూత్ వుంది. లోపలికెళ్ళి అతడు తలుపు మూశాడు. రిసీవరెత్తి నంబరు తిప్పాడు, డబ్బు చిల్లులో పడేశాడు.

"హలో, పరశురామ్" అంది అటువైపు కంఠం.

"నేను గీతా థియేటర్ వాచ్‌మన్ని సార్. వాళ్ళు వచ్చారు. నాకు వంద యివ్వాలి. మీకు చెప్పానుగా" అన్నాడతను.

"వస్తున్నాను. నీకు డబ్బు యిస్తాను" అన్నాడు పరశురామ్.

అతడు రిసీవర్ పెట్టేసి థియేటర్‌లోకి వెళ్ళిపోయాడు. కార్ల పక్కనే కూర్చుని ఆలోచిస్తూ వుండిపోయాడు. తను ప్రమాదం లేకుండా చూసుకోవాలి.

డాడ్జి కారు లోపలకొచ్చింది. ఒక కారు పక్కనే ఆగింది. వాచ్‌మన్ అటువైపు పరుగెత్తాడు.

"ఇదిగో నీ వందరూపాయలు" అన్నాడు పరశురామ్ ఒక నోటు యిస్తూ.

నోటును వాచ్‌మన్ ఆశతో తీసుకుని దాచుకున్నాడు.

"వాళ్ళు లోపల వున్నారా?"

అతడు తల గోక్కున్నాడు.

"వాళ్ళు వెళ్ళిపోయారు, సార్."

"సినిమాకి వచ్చినవాళ్ళు ఎందుకు వెళ్ళిపోయారు?"

"వాళ్ళు వచ్చి లోపలకెళ్ళారు, సార్. వెంటనే మీకు ఫోన్ చేశాను. వాళ్లు యిప్పుడే వెళ్ళిపోయారు" అన్నాడు వాచ్‌మన్.

పరశురామ్ బయటకు దిగి సిగరెట్ వెలిగించాడు. పొగ వదులుతూ అతడివంక చూశాడు.

"నేను వస్తానని తెలిసి వాళ్ళు పోయారేమో!"

"నేను చెప్పలేదు, సార్."

"వాళ్ళు ఏ కారులో వచ్చారు?" అడిగాడు పరశురామ్ అక్కడున్న కార్లను చూస్తూ.

"నల్ల అంబాసిడర్ కారులో వచ్చారు, సార్."

"ఆ క్రీమ్‌రంగు ఫియట్ ఎవరిది?"

"అది మరొకళ్ళది సార్."

ఆలోచిస్తూ పరుశురామ్ ఫియట్ దగ్గరకు నడిచాడు. ఫియట్ చుట్టూ తిరిగి చూశాడు. సగంపైన కాల్చినచుట్ట ఫియట్ పక్కనే పడుంది. దాన్ని పరశురామ్ పరీక్షగా చూశాడు.

ఖరీదైన సిగార్! తనకు రోడ్డువారగా దొరికిన నటు వంటిదే!

ఆ చుట్టను చూడగానే వాచ్‌మన్ మొహంలో గాభరా గోచరించింది.

అమాంతంగా పరశురామ్ వాచ్‌మన్ మెడను వేళ్ళతో చుట్టి పట్టుకున్నాడు. రెండో చెయ్యి అతడు వందరూపాయిల నోటు పడేసుకున్న జేబులోకి వెళ్ళింది.

అతడి చెయ్యి పైకొచ్చింది. మూడు వందరూపాయిల నోట్లు! మూడిటివైపూ పరశురామ్ ఆశ్చర్యంగా చూశాడు.

"ఒకటి నేనిచ్చాను. తతిమ్మా రెండూ ఎవరిచ్చారు?"

"నెల రోజుల్లో నా పెళ్ళి కాబోతోంది, సార్. మావ ఆ డబ్బు యిచ్చాడు. గుడ్డలు కుట్టించుకోమన్నాడు" బొంకాడతను.

"నీ పెళ్ళి యిప్పుడే అవుతుంది! రాస్కెల్, నిజం చెప్పు" అర్చాడు పరశురామ్.

అతడి గొంతు చుట్టూ పరశురామ్ వేళ్ళు బిగుసుకుపోతున్నాయి.

"వదలండి సార్! సార్, సార్!" అన్నాడతను.

"చెప్పు! నిన్ను చావదన్ని తోలు ఒల్చేస్తాను!"

"వాళ్ళు థియేటర్లో వున్నారు సార్. ఈ కారు వాళ్ళదే సార్. యీ డబ్బు వాళ్ళిచ్చారు. మీకు ఫోన్ చెయ్యొద్దన్నారు. మీ వందకోసం దురాశపడి ఫోన్ చేశాను" అన్నాడతను గాభరాగా.

"ఈ మూడు నోట్లూ నీ దగ్గరే వుంచుకో!" అని పరశురామ్ నోట్లను యిచ్చేశాడు.

"మన్నించండి, సార్!"

"నోరు మూసుకుని నీ పని చూసుకో! నీకే ప్రమాదం

రాదు" అని పరశురామ్ తన కారువైపు నడిచాడు.

డాడ్జి కారును బయటకు మెల్లిగా పోనిచ్చాడు.

# 9

ఒంటి గంటకు సినిమా ముగిసింది.

గోపాల్, రాధిక బయటకు నడుస్తున్నారు. థియేటర్ బయట టాక్సీలు, ఆటోలు లేవు. సైకిల్ రిక్షాలు మాత్రం వున్నాయి.

"రిక్షాలో పోదామా?" అందామె.

"అరగంటలో యింటికి పోవచ్చు, నడుద్దాం" అన్నాడతను.

ఇద్దరూ రోడ్డు వారగా నడుస్తున్నారు. రాధిక చూసిన సినిమా గురించి చెప్తోంది.

"పాపం, కథానాయిక మహా కష్టపడింది. విలన్ ఆమెను ముప్పుతిప్పలూ పెట్టాడు" అందామె.

గోపాల్ వెనక్కి చూశాడు. ఏదో కారు వస్తోంది. సమీపంలో ఎవ్వరూ లేరు. చటుక్కున కారు వాళ్ళ పక్కనే ఆగింది. తలుపు తెరిచి యిద్దరు కిందకు దిగారు. రాధికను కార్లో యీడ్చి కూర్చోబెట్టారు. కారు దూసుకు పోయింది.

గోపాల్ అరుస్తూ కారు వెనక పరుగెడుతున్నాడు.

"కార్ను ఆపండి! నా భార్య! నా వైఫ్!" బొబ్బలెడుతున్నాడతను.

గోపాల్ వెనక మరో కారు ఆగింది.

"గెటిన్!" అన్నాడు పరశురామ్.

గోపాల్ టక్కున ఎక్కి కూర్చుని తలుపు మూశాడు.

పరశురామ్ కారును పోనిచ్చాడు.

"ఆ కార్ను ఆపి, నా భార్యను రక్షించి పుణ్యం

కట్టుకోండి! ప్లీజ్!" గోపాల్ పిచ్చిగా చూస్తున్నాడు.

"మిస్టర్ భయపడకు! నీ భార్యకు ప్రమాదం రాకుండా నేను చూస్తాను. ఆ కారును ఆపుతాను" అన్నాడు పరశురామ్.

పరశురామ్ స్పీడు హెచ్చించాడు. ముందు కారు వెనుక లైట్లు కనిపిస్తున్నాయి.

డాడ్జి కారు విమానంలా దూసుకుపోతోంది. ఫియట్ బాగా దగ్గరైంది. తటాలున ఫియట్ ఎడంవైపు రోడ్డు మీదకు తిరిగింది. ఆ రోడ్డుమీద జనసంచారం లేదు.

పరశురామ్ తన కారును అటువైపు తిప్పి పోనిచ్చాడు. ఫియట్ కారు డ్రయివర్ కొంచెం ఎడంవైపుకు వెళ్ళి వెనక వస్తున్న కారుకు తోవ యిస్తున్నట్లు సౌజ్ఞ చేశాడు.

ఫియట్‌ను దాటి డాడ్జి కారు వెళ్ళిపోయింది. కొంచెం దూరం వెళ్ళాక పరశురామ్ సడెన్ బ్రేక్‌తో కార్ను ఆపాడు. వెనకనే ఫియట్ ఆగవలసి వచ్చింది.

తలుపు తెరిచి పరశురామ్ కిందకు దూకాడు. అతడి చేతిలో పిస్టల్ మెరుస్తోంది.

ఫియట్ తలుపులు తెరవబడ్డాయి. నలుగురూ బయటకు దిగారు. వాళ్ళ చేతుల్లో కత్తులున్నాయి. ఫియట్ కారులో కూర్చున్న రాధిక భయంతో అంతా గమనిస్తోంది.

పరశురామ్ వాళ్ళవైపు రెండుసార్లు షూట్ చేశాడు. పెదిరాజు అరుస్తూ కిందపడ్డాడు. రెండో బులెట్ కారుకి కొట్టుకుంది.

మల్లా, మస్తాన్, నాయుడు వెనక్కు తిరిగి పరుగెడుతున్నారు. పరశురామ్ వాళ్ళ వెనక చిరుతపులిలా పరుగెత్తాడు.

నాయుడిని వెనకనుంచి తన్నాడు. అతడు రోడ్డు

వారగా పడ్డాడు. మరోసారి పారిపోతున్న వాళ్ళవైపు షూట్ చేశాడు.

"రాస్కల్స్! చేతులెత్తండి, లేకపోతే చస్తారు!" గర్జించాడు పరశురామ్.

కొంచెం దూరంలో చేతులెత్తి ముల్లా, మస్తాన్ నిలబడ్డారు.

పరశురామ్ వాళ్ళ దగ్గరకు నడిచాడు. ఒక దెబ్బతో ముల్లా చంప పగిలి నోటమ్మట రక్తం కారింది. మరో దెబ్బకు మస్తాన్ మెడ తిరిగినట్లయింది. వాళ్ళను వెనక నుంచి తన్నుతూ పరశురామ్ కార్లవైపు కదిలాడు. రోడ్డు పక్క పడిన నాయుడు మూలుగుతూ లేచాడు. అతడిని బలంగా తన్నాడు పరశురామ్. అతడు రోడ్డుమీద దొర్లుతూ ఫియట్ పక్కనే పడ్డాడు.

నేలమీద పడున్న పైడిరాజు కాలినుంచి రక్తం కారోంది.

"అందరూ చేతులు వెనక్కి కట్టుకొని నిలబడండి!" అర్చాడు పరశురామ్.

మస్తాన్, ముల్లా, నాయుడు అలాగే చేశారు. వాళ్ళ చేతులను నైలాన్ తాడుతో గోపాల్ కట్టేశాడు.

రాధిక చేతులెత్తి పరశురామ్‌కి నమస్కరించింది.

"వీళ్ళకోసం నేను థియేటర్ ముందు కార్లో కాచుకుని కూర్చున్నాను. నీకు ఏ ప్రమాదమూ రాకుండా కాపాడగలిగనందుకు ఆనందిస్తున్నాను" అన్నాడు పరశురామ్, ఆమెను ఓదారుస్తూ.

"ఇక్కడనుంచి ఎలా వెళ్ళడం?" అంది రాధిక.

"డోంట్ బాదర్, నేను దింపుతాను" అన్నాడు పరశురామ్.

ఏదో స్కూటర్ రోడ్డమ్మట మెుసుకొస్తోంది. స్కూటర్ వాళ్ళ ముందు ఆగింది.

"మీరా?" అన్నాడు మోహన్.

"ఆ దుర్మార్గులు వీళ్ళే!" అన్నాడు పరశురామ్ వాళ్ళ వైపు చూపిస్తూ.

మోహన్ అమాంతం కిందకు చూశాడు. వుద్రేకంతో జేబులోంచి కత్తిని తీశాడు.

"మీ రక్తం తాగుతాను! మిమ్మల్ని నరికి మీ మాంసాన్ని గద్దలకు పడేస్తారా!" పిచ్చిగా అరుస్తున్నాడు మోహన్.

పరశురామ్ అతడి చేతిలోని కత్తిని లాక్కున్నాడు.

"మిస్టర్ మోహన్, మన దేశంలో కోర్టులున్నాయి. వాళ్ళు చేసిన నేరాలకు తగిన శిక్ష విధించబడుతుంది" అన్నాడు పరశురామ్.

వాళ్ళవైపు పళ్లు కొరుకుతూ చూశాడు మోహన్.

"మిస్టర్ మోహన్, నువ్వు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి ఫోన్ చెయ్యి! వెంటనే యిక్కడకు రమ్మను" అన్నాడు పరశురామ్.

మోహన్ స్కూటర్ని స్టార్ట్ చేసి పోనిచ్చాడు. సిగరెట్ పొగ పీల్చి వదులూ పరశురామ్ రోడ్డుమీద యిటూ, అటూ పచార్లు చేయసాగాడు. ఇన్‌స్పెక్టర్ రాకకోసం అతడు ఎదురు చూస్తున్నాడు!

—: ఐపోయింది :—

# తిరిగొచ్చిన గాడిద

## సికిందర్

లాల్ సగం కాలిన సిగరెట్‌ను అష్ట్రేలో కుక్కి భుజా లెగరేసి, అసహనంగా అన్నాడు. "మైడియర్! ఎందుకింత ఆలస్యం? వాళ్ళు వస్తామని చెప్పి ఇరవై నిమిషాలు గడిచాయి! పంజగుట్టనుంచి ఖైరతాబాదు రావడాని కింత టైము పడుతుందా!"

జాన్ చిన్నగా నవ్వాడు. "అత్తా కోడళ్ళిద్దరూ నువ్వా—నేనా అనుకుంటూ ముస్తాబవుతున్నారేమో? ఎవరికి తెలుసు!"

జాన్ మాటలకి లాల్ చిరాకు పడ్డాడు.

"ఒకవేళ వాళ్ళ మధ్య అలాంటి పోటీ వుంటే—. అందుకిది సమయం కామూ—సందర్భమూ కాదు!"

"అయితే మనసు మార్చుకొనుండాలి........యిక రారేమో?"

"మనసు మార్చుకోవడానికివి పెళ్ళిచూపులు కావు. చావు బ్రతుకుల దుర్ముహూర్తం! ఫోన్‌లో ఆమె యేం

చెప్పింది?"

"కుమారుడు అపాయంలో వున్నాడని—అర్జంటుగా మమ్మల్ని చూడాలనీ!"

లాల్ కళ్ళు మెరిశాయి, "అక్కడే వుంది పాయింట్! తమ నెవరూ వెంటాడకుండా జాగ్రత్త తీసుకుంటూ వస్తున్నారు. అందుకే యీ ఆలస్యం. అర్థమైందా?"

"అర్థమైంది. యీ పాయింట్ నీకు ఆలస్యంగా తట్టింది."

"అప్పుడప్పుడు నా మెదడు షికారుకెళ్తుంది....లుక్, జాన్! దేశంలో అత్యాచారాలు చేయడానికి దుర్మార్గులు చాలా తెలివైన మార్గాల ననుసరిస్తున్నారు. సులభ పద్ధతుల్లో ప్రయోజనాలను సాధించుకోడానికి కుటుంబ చరిత్రల్ని తిరగేసి—ఎక్కడ వీక్ పాయింట్ వుందో కనిపెట్టి సరిగ్గా అక్కడే గురిచూసి కొడుతున్నారు. అలాటి అఘాతాలకి తట్టుకోవడం ముందూ వెనుకా మగ దిక్కెవరూ లేని యిలాటి అత్తా కోడళ్ళ వల్ల గాదు!"

బయట కారిడార్లో అస్తవ్యస్తంగా అడుగుల చప్పుడు వినిపించడంతో జాన్ చెవులు రిక్కించి, "ఆడ పడుచులొచ్చేశారు!" అన్నాడు.

లాల్ సైగ చేశాడు.

జాన్ వెళ్ళి డోర్ తీశాడు, "రండి! చాలా శ్రమ తీసుకొని వచ్చారు! మేమే అక్కడికి రావాలనుకున్నాం గానీ అదీ మరీ ప్రమాదకరం! వాళ్ళు మీ యింటిమీద నిఘా వుంచవచ్చు...."

"మమ్మల్ని అనుక్షణం కనిపెడతామని ఫోన్లో

చెప్పారు."

"అయినా మీరు వాళ్ళ కళ్ళలో కారం కొట్టారని నమ్మకమేనా?"

"అవును, మేం యింటి నుంచి తిన్నగా యిక్కడికి రాలేదు. దారిలో తెలిసినవాళ్ళ యింటి. కెళ్ళి కారుని యింటి ముందు వదిలేసి, వెనుక దారిగుండా ఆటో ఎక్కి వచ్చేశాం!"

"చాలా సాహసం చేశారు!"

"నేనేమీ చెయ్యలేదు. అలా చేద్దామని సుమిత్ర చెప్పింది."

జాన్ నవ్వి లోనికి దారి చూపించాడు.

ఇద్దరు స్త్రీలు లోనికి ప్రవేశించారు. వాళ్ళలో సుమారు యాభై ఏళ్ళ స్త్రీ కళ్ళు లాల్ మీద పడి, తేలికబడ్డ మనసుతో వచ్చి ఎదురుగా కూర్చుంది.

మరో పాతికేళ్ళ యువతి, కళావిహీనంగా వున్న వర్ఛస్సుతో లాల్ని చూస్తూ; సానుభూతీ సహాయం కోసం తపించిపోతున్నట్లు అసహనంగా కదుల్తూ కూర్చుంది.

లాల్ వాళ్ళని అరక్షణం తదేకంగా చూశాడు. ఆ తర్వాత సిగరెట్ ఆష్ట్రేలో కుక్కి అన్నాడు: "మొన్న రాత్రి మీ కుమారుడు అపహరించబడ్డాడని మీరు ఫోన్లో చెప్పారు, మిసెస్ నళిని. మీ రింతవరకు పోలీసుల కెందుకు తెలియజేయలేదు? కిడ్నాపర్స్ హెచ్చరించారా? అయితే ఇప్పుడు మమ్మలెందుకు కలుసుకున్నారు?"

నళిని నిట్టూర్చింది. "చెప్తాను, వాళ్ళు మాటి మాటికీ ఫోన్లో బెదిరిస్తున్నారు! వాళ్ల షరతులు వింతగా వున్నాయి! యాభై వేల రూపాయలు నిన్న సాయంత్రం

అయిదుగంటలకి సరూర్ నగర్ చెరువులో పడెయ్యమని—"

"నో, నో, సరిగా చెప్పండి!"

సుమిత్ర అందుకుంది, "రెండు లీటర్ల కెపాసిటీ గల ఒక ప్లాస్టిక్ జాడీ తీసుకుని-పారదర్శకం కానిది, గుండ్రటి ఆకారంతో-అందులో అన్నీ వంద రూపాయల నోట్లతో యాభైవేల రూపాయలు పెట్టి, మూత గట్టిగా బిగించి చెరువులో విసరమన్నారు."

డిటెక్టివ్‌లు చూపులు మార్చుకున్నారు.

"వెల్, ఇంకా?" లాల్ అన్నాడు.

"ఈ పని నిన్ననే చెయ్యమన్నారు. కానీ సాధ్యం కాలేగు. ఇవాళ చివరి అవకాశం ఇచ్చారు. నాలుగ్గంటలకి కార్లో బయలుదేరి, ఆ చెరువు దగ్గరికి చేరుకొని, గంటసేపు వెంట తెచ్చుకున్న తినుబండారాలతో పిక్నిక్‌లా గడపాలట!"

"ఆ తర్వాత?"

"పిక్నిక్ అయ్యాక సరంజామా కార్లో చేరుస్తూ, చూసేవాళ్లకు ఆ డబ్బు గల జాడీ పనికిరానిదన్న భావం కలిగిస్తూ బలంకొద్దీ చెరువులో దూరంగా విసరాలట. ఆ తర్వాత కారెక్కి వెళ్ళిపోవాలట. అక్కడ వాళ్ల మనిషి మమ్మల్ని గమనిస్తుంటాడట. ఆ జాడీ స్వాధీనం చేసుకొన్న తర్వాత, చీకటిపడ్డాక ఆయన్ను క్షేమంగా యింటికి పంపిస్తారట—"

"బాగానే వుంది. ఇందులో మేమేం చెయ్యాలి? మీరు డబ్బు యివ్వలేని స్థితిలో వున్నారా? ఇవ్వదలచలేదా?"

"రెండూ కావు!" అంది సుమిత్ర, "కిడ్నాపర్స్‌ని

నమ్మకూడదు! ప్రాణాల్నీ, బేరానికి పెట్టి డబ్బు గుంజే పరమ దుర్మార్గులు! డబ్బిచ్చాక ప్రాణానికి క్షేమం వుంటుందని గ్యారంటీ లేదు! తమ ఆనవాల గురించి తెలిసిన బందీని వదిలేడంకంటే, తమ కేమాత్రం విలువలేని అతని నిండు ప్రాణాన్ని బలిగొనడమే వాళ్లకు క్షేమం! ఇలాటి సంఘటనలు నేను పత్రికల్లో చాలా చూశాను."

జాన్ కల్పించుకున్నాడు, "అంటే, డబ్బు తీసుకొని చంపేసి పారిపోతా రంటారా? మీ అనుమానం బహుశా——"

"నా అనుమానం కాదు! అందుకు నిదర్శనం వుంది!" సుమిత్ర బ్యాగు తెరిచి మూడు ఫోటోలు తీసి టేబిల్ మీదకు విసిరింది, "ఆ ఫోటోలు చూడండి!"

లాల్ వాటి నందుకొన్నాడు.

ఆ ఫోటోల్లో ఒక యువకుడు వెల్లకిలా పడివున్నాడు. అతని జుత్తు, ముఖం, ఛాతీ, షర్టు....రక్తంలో తడిసి వున్నాయి. కళ్ళు మూసుకొని బాధ అనుభవిస్తున్నాడు. లాల్ వాటిని చూశాడు. మార్చి మార్చి చూశాడు. భూతద్దంలో పరీక్షగా చూసి చిన్నగా ఈల వేశాడు.

జాన్ చెయ్యి జాపి ఫోటో అందుకోబోయాడు. లాల్ మృదువుగా నవ్వి, వారిస్తూ, సొరుగులో దాచాడు.

"వెల్, ఇవెప్పు డందాయి?"

"ఇందాకే——పది గంటలకు" అంది సుమిత్ర.

"ఎలా అందాయి?"

"కవర్లో పెట్టి, ఎవరూ చూడకుండా తలుపు సందులోంచి విసిరి వెళ్ళిపోయారు. అది లోనికి పడ్డప్పుడు మేం చూడలేదు. లేకపోతే వెంటనే తలుపు తీసే వాళ్లం——గొడవయ్యేది. మిస్టర్ లాల్, నిన్న డబ్బుం

దివ్వకపోతే రాక్షసులు మావార్ని హింసించి ఆ ఫోటోలు తీసి పంపారు. ఇప్పుడు చెప్పండి, ఆయన్ను ప్రాణాలతో వదులారా?"

"నిన్న డబ్బెందు కివ్వలేదు?"

"మొదటినుంచీ చెప్తాను," అంది సుమిత్ర గొంతు సవరించుకొని, "మొన్న రాత్రి ఆయన చాలా సేపటివరకు యింటికి రాలేదు—అది మామూలే. ఇంతలో 11 గంట లకి ఫోన్ వచ్చింది....ఫోన్‌లో మాకు తెలియని కంఠం ఒకటి మా వార్ని క్షేమంగా ఒక చోటుకి తరలించామని చెప్పింది. తాము చెప్పినట్లు చేస్తే ఏ అపాయమూ వుండ దని హామీ యిచ్చింది. ఆయన కారు సెక్రటరియేట్ దగ్గర వుందనీ, యెవరైనా పంపించి రప్పించుకోమనీ, ఈ సంగతి మా యిద్దరికి తప్పించి మూడవ వ్యక్తికి తెలిస్తే ఏర్పడే పరిణామాల్ని వివరించడం తన కిష్టం లేదనీ చెప్పింది. అంతే—రేపు వుదయం మళ్ళీ ఫోన్ చేస్తామని చెప్పాక లైను కట్ అయింది."

"అప్పుడేం చేశారు?"

"విపరీతంగా భయపడ్డాం! ఈ సంగతి ఎవరికీ చెప్ప లేదు! ఆ రాత్రి నిద్రలేదు! మర్నాడు ఉదయమంతా ఫోన్‌కోసం ఎదురుచూశాం. కానీ మధ్యాహ్నం మూడు గంటలకు వచ్చింది. డబ్బు ఎలా చెల్లించాలో చెప్పాడు. కానీ—అంత తక్కువ వ్యవధిలో ఆ డబ్బెక్కడనుంచి తేవాలి? అప్పటికి బ్యాంకులన్నీ మూసేస్తారు! ఈ విషయం చెప్పాను. వాడు ఒప్పుకోలేదు — రేపటికి వాయిదా వేయడానికి.

"మేం ఏమీ చేయలేని స్థితిలో పడ్డాం! మా మేనేజర్ రావ్‌కు డబ్బుకోసం ఫోన్ చేశాం. అతను నిల్వ ఏమీ

లేదన్నాడు. మర్నాడుదయం బ్యాంకు తెరవగానే తెస్తా నన్నాడు. మాకేమీ పాలుపోలేదు! వాళ్ళు నిన్న సాయంత్రమూ, రాత్రీ ఫోన్ చేసి; చెప్పినట్టు చెయ్యా నందుకు ఫలితం చూస్తామని బెదిరించారు. ఇప్పుడీ ఫోటో లందాయి. ఇవి అందిన అయిదు నిముషాలకు మళ్ళీ ఫోన్ చేసి, ఇకనైనా డబ్బు చెల్లించకపోతే—మావార్ని మర్చిపొమ్మన్నాడు!"

"వెల్, మీరలా చెయ్యరనుకుంటాను...."

"లేదు! ఇప్పుడు మా దగ్గర,డబ్బు వుంది! మేనేజర్ తెచ్చి ఇచ్చాడు. దాన్ని వాళ్ళ మొఖాన కొడతాం! కానీ నా కొక్కటే భయంగా వుంది! ఆయన్ను ప్రాణాలతో వదుల్తారా అని! ఆయన తిరిగివచ్చి వాళ్ళ ఆనవాలు పోలీసులకు చెప్పవచ్చు! ఆ భయంతో వాళ్ళాయన్ని— మిస్టర్ లాల్—ఈ భయంతోనే నేనింత రిస్క్ తీసు కొని ఆ త్తయ్యతో ఇక్కడికొచ్చి మీ సహాయం కోరు తున్నాను. ఆయన తిరిగి వచ్చాక పోలీసులకు చెప్పరు! ఎవరికీ చెప్పరు! ఇది కిడ్నాపర్స్ నమ్మేలా చేసి ఆయన్ను క్షేమంగా తప్పించండి!"

లాల్ అన్నాడు, "మీ రనవసర భయాలతో అపాయం తెచ్చుకుంటున్నారు. కిడ్నాపర్స్ ఆయన్ను చంపరు! ముమ్మాటికీ చంపరు! అర్థమైందా? ఇది నా హామీ! నిశ్చింతగా వుండండి. ఆయన పేరేమిటి?"

"నరేష్ — నరేష్‌కుమార్" అంది నళిని గొంతు పెగుల్చుకొని, "వాడికి బాధ్యతల్లేవు! సమస్యల్లేవు! ఇంటి గురించీ, వ్యాపారం గురించీ ఏమీ పట్టించుకోకుండా తిరుగుతాడు! అంతా నమ్మకస్తుడైన రావ్ చేతులమీదే నడుస్తోంది. వాడు తండ్రి పోయాక బుద్ధులు మారి దారి

కొంటాడనుకున్నాను. అలా జరుగలేదు! వాడి స్నేహితులూ తిరుగుళ్లూ, ఖర్చులూ మితిమీరిపోయి పూర్తిగా చెడి పోయాడు! చివరికి పెళ్ళిచేస్తే దారికొస్తాడనుకున్నాను. అదీ వమ్ము అయింది! ఈ సంవత్సరంనుంచీ సుమిత్ర ఏ సుఖమూ నోచుకోకుండా ఏ సితికొచ్చిందో మీకు తెలి యదు! అంతా తెలిసీ నేనామె గొంతు కోశాను!"

"ఓహ్, అత్తయ్యా .... మీరలా మాట్లాడకండి!" సుమిత్ర వారించింది.

"నీకేం తెలుసు! నేను పాపిష్టిదాన్ని!" అర్పింది నళిని ఉద్రేకంగా, "మిస్టర్ లాల్, మీరు వాణ్ణి గండం లోంచి లాగి బుద్ధి నేర్చుకునేలా చూడండి!"

"అలాగే. బయట నరేష్ ఎక్కడ గడుపుతాడు? స్నేహితులెవరు?"

"ఎక్కడ గడుపుతాడో దేవుడెరుగు! కానీ ఎక్కు వగా అంబాసిడర్ హోటల్లోనే పడివుంటాడని విన్నాం. రిసెప్షనిస్ట్ సలీంతో ఎక్కువ స్నేహం వుందట. ఇంకెవరున్నారో మాకు తెలియదు!"

"మంచిది, మీరిక జాగ్రత్తగా వెళ్ళండి. కాస్సేపట్లో మీకు ఫోన్ చేసి ఏం చెయ్యాలో సూచనలిస్తాం. వాటిని మీరు తూచా తప్పకుండా పాటించాలి. ఏమంటారు?"

"అలాగే లాల్! నాకు నమ్మకముంది! మీరు వాణ్ణి క్షేమంగా అప్పగిస్తారు!" నళిని బ్యాగులోంచి ఒక నోట్ల కట్ట తీసి, టేబిల్ మీద వుంచి లేచి నిలబడింది.

## 2

"వెల్, ఏమిటి నీ అయిడియా పార్ట్నర్?" వాళ్ళి ద్దరూ నిష్క్రమించాక అడిగాడు జాన్.

లాల్ నవ్వి సొరుగులోంచి ఆ ఫోటోలు తీసి, టేబిల్

మీద పడేశాడు. "ఈ జోక్ చూడు! నవ్వకపోతే చంపుతాను."

జాన్ తికమకగా వాటిని అందుకున్నాడు. వాటిని చూసి కళ్లు విశాలమయ్యాయి. "గాడ్!" అన్నాడు పెద్దగా. లాల్ భూతద్దం అందించాడు. జాన్ ముఖం చిట్లిస్తూ దానితో పరీక్షగా చూశాడు. వాటిని వంతుల వారిగా చూసి, "వాట్—ఇది రక్తంకాదు! టొమాటో కెచప్!" అనర్చాడు.

"ఎలా వుంది జోక్?"

జాన్ పగలబడి నవ్వాడు. "వండర్ఫుల్! వీళ్ళని అదరగొట్టడానికీ ట్రిక్ చాలు."

లాల్ అన్నాడు: "అది రక్తంకాదు. నరేష్‌ని గాయపర్చలేదు. స్పృహ పోగొట్టి, టొమాటో కెచప్ జల్లి ఈ ఫోటోలు తీశారు—ఇది క్లయింట్స్‌కు తెలియదు. తెలిస్తే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారని అప్పుడు వీటిని నీ చేతికివ్వలేదు. ఎట్టి పరిస్థితిలోనూ కిడ్నాపర్స్ నరేష్‌ని చంపరని ఈ ఫోటోలవల్ల తెలుస్తోంది. పిరికివాళ్ళా? ఏమో! కానీ జాన్, ఇప్పుడు మనం శత్రువుల శిబిరంలో కలకలం రేపే పథకం తయారుచేసి తుపాకీ తూటాలా వదలాలి—"

జాన్ రెండు క్షణాలు ఆలోచించి, "వెల్—నీ అయిడియా ఏమిటో చెప్పు!" అన్నాడు.

లాల్ లేచి పచార్లు చేస్తూ చెప్పాడు:—

"కిడ్నాపర్స్ ప్లాను చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది. ఇందులో మనం పుల్లలు పెట్టడానికి చాలా అవకాశాలు వున్నాయి. ఎక్కడైనా నేరం జరుగుతోంటే చూస్తూ వూరుకోకుండా, దాన్ని నివారించి నేరస్తుల్ని శిక్షించడం మన ధర్మం గనుక, ఈ కిడ్నాపింగ్ బిజినెస్‌లో మనం

జోక్యం చేసుకోక తప్పదు.

"కాబట్టి ఈ వ్యవహారంలో మనం డబ్బు పాత్ర లేకుండా నరేష్‌ని రక్షించి, కిడ్నాపర్స్‌ని పట్టుకో నేందుకు ప్రయత్నించాలి. కిడ్నాపర్స్ కోరినట్లు మనం జాడీలో డబ్బు పంపడం లేదు. ఖాళీ జాడీ బహూకరిస్తాం! విసిరి నప్పుడు గాలి నిరోధాన్ని ఛేదించుకొని ప్లాస్టిక్ జాడీ దూరంగా వెళ్ళలేదు గనుక—దానిలో నీళ్ళు నింపాలి.

"నువ్వెంటనే ఈ పని చేసి సుమిత్రకు ఫోన్ చెయ్యి. ఇంట్లో పనిమనిషి వుంటే మూడు గంటలకు వెచ్చాల కొట్టుకు పంపమను. దాని అడ్రసు తెలుసుకొని, ఆ సమయానికి అక్కడికి చేరుకొని ఆ జాడీ ఆమెకిచ్చి ఇంట్లో ఇవ్వమను. డబ్బు ఇంట్లోనే వుంచి, ఆ జాడీతో సరూర్ నగర్ చేరుకొని కిడ్నాపర్స్ చెప్పినట్టు చెయ్యమను. ఓ.కే.?"

"ఓ.కే!"

"వెల్, ఆ తర్వాత నీ గర్ల్‌ఫ్రెండ్స్‌లో తెగువ, సాహసం గలామె నెన్నుకో. ఆమెకు ముఖ్యంగా ఈత వచ్చి వుండాలి. నువ్వు మారువేషంలో హిప్పీలా ఆమెతో ఆమె కారులో - ఆమెకు కారు లేకపోతే మరెక్కడైనా అద్దుకొని — సరూర్ నగర్ చెరువు దగ్గరకి నాలుగు గంటలికల్లా చేరుకో. నీ వెంట కేమేరా, బైనాక్యులర్స్, రైఫిల్ వుండాలి.

"కిడ్నాపర్ ఆ ప్రాంతాలే వుంటాడు కాబట్టి అతని కంట బడకుండా జాగ్రత్తగా మెలగాలి. ఒకవేళ కన్పించినా పట్టించుకోనట్లు నటించాలి. రైఫిల్ కన్పించనివ్వకూడదు! నీ ఫ్రెండ్‌ని ఫోటోలు తీస్తూ, తాగుతూ, కబుర్లు చెప్తూ, చెట్లచాటున గడిపెయ్యి—

"ఈ లోపు సుమిత్ర వాళ్ళు వచ్చి పార్టీ చేసుకొని వెళ్ళిపోతారు. వెళ్తూ జాడీని చెరువులో విసురుతారు. దాన్ని నువ్వు బైనాక్యులర్స్‌లో గమనించాలి. వాళ్ళు కారెక్కి వెళ్ళిపోయాక కిడ్నాపర్ రంగంలో దూకుతాడు.

"కానీ, అంతకు ముందే మీరిద్దరూ బయటకొచ్చి కేరింతలతో అరుపులతో కట్టెలెంబడి పరిగెత్తాలి. నీ ఫ్రెండ్ చెరువులో దూకేసి జాడీ కేసి ఈత కొట్టాలి. కిడ్నాపర్ కంగారుపడి వెనుకాడుతాడు. కానీ పారిపోడు. ఆ జాడీ దక్కించుకునేందుకు నీట్లో దూకేస్తాడు. అప్పుడు నీ చేతిలో రైఫిల్, మెళ్ళో కెమెరా, బైనాక్యులర్స్ వుంటాయి.... వాళ్ళిద్దరూ జాడీని దక్కించుకునే ప్రయత్నంలో ఎదురెదురుగా ఈదుతూ వస్తుంటారు. నువ్వు రైఫిల్‌తో జాడీని గురిచూసి షూట్ చెయ్యాలి. ఒకటి—రెండు—మూడు— చాలు! మూడు తూటాలతో జాడీ చిల్లులుపడి మునిగిపోతుంది."

"అప్పుడేం జరుగుతుంది?"

"జాడీ మునుగుతోంటే దానికోసం కిడ్నాపర్ కూడా మునుగుతాడు. నీ ఫ్రెండ్ కూడా మునగాలి. కాసేపు పెనుగులాడి దాన్ని అతనికే వదిలెయ్యాలి. అతను పైకి తేలి ఒడ్డుకేసి ఈతకొడతాడు. నీ ఫ్రెండ్ వెంటాడుతుంది. నువ్వు వాళ్ళు గట్టెక్కేచోట కెమెరాతో సిద్ధంగా వుండాలి. నీ ఫ్రెండ్ గట్టెక్కగానే 'ఓహ్! హౌ బ్యూటిఫుల్ యూ ఆర్!' అనన్చి స్నాప్ లాగాలి. ఆ ఫోటోలో కిడ్నాపర్ కూడా రావాలి.

"దట్సాల్, జాన్. ఆ తర్వాత మీరిద్దరూ కాస్సేపు రెస్టుతీసుకొని వచ్చేయాలి."

"మరి కిడ్నాపర్?"

"అతన్ని వదిలెయ్యాలి. జాడీకోసం అతని పాట్లు మీ ఇద్దరికీ అనుమానం కల్గించవచ్చున్న భయంతో అతను నేరుగా స్థావరానికి వెళ్తాడనుకోను. కాబట్టి వెంటాడ్డం దండగ!"

జాన్ తలూపాడు.

"అతన్ని వెంటాడి స్థావరం కనుక్కొనే అవసరం లేకుండానే నరేష్‌కుమార్ తిరిగి వస్తాడు. నీ ప్లానువల్ల ఆ ఖాళీ జాడీ కిడ్నాపర్స్‌లో తగాదా తెస్తుంది. డబ్బు కోసం పంపిన ఖాళీజాడీతో తిరిగివస్తే అతని అనుచరులు నమ్మరు. డబ్బు కాజేసి బూటకపు కథ అల్లాడనుకుంటారు. జాడీమీద కాల్పులు అతనే సృష్టించాడనుకుంటారు. లేదా—హిప్పీ జంట పానకంలో పుడకల్లా ఆ జాడీమీద దాడిచేస్తే ఆ అవకాశాన్ని అతను వినియోగించుకున్నాడనుకుంటారు.

"ఇంకా నేను తీసే ఫోటో వాళ్ళలో కలవరం పుట్టిస్తుంది. వాళ్ళ హెచ్చరికను సుమిత్ర పూర్తిగా పాటించి తన బాధ్యత తీర్చుకుంది గనుక, మళ్ళీ డబ్బుకోసం బెదిరించరు. అలా చేస్తే ఆమె మతి కోల్పోయి పోలీసుల దగ్గర కెళ్ళడం ఖాయం! పోలీసులు రంగంలో దిగారంటే—నేను తీసిన ఫోటో వాళ్ళ చేతిలో పడిందంటే—ఆ ఫోటోలో ఫోజిచ్చిన ఆ ఒక్క బ్రూట్ వల్ల తామంతా పట్టుబడతామని ప్లానుకు గుడ్‌బై కొట్టి పారిపోతారు. అంతేనా?"

"అంతే! అది నా వ్యూహం. దాన్ని నువ్వాచరించాలి. ఇందులో చిన్నచిన్న సవరణల్ని సమయానుకూలంగా

నువ్వే స్వయంగా చేసుకోవాలి."

"బాగానే వుంది. మరి నువ్వేం చేస్తుంటావు? ఇక్కడ కూర్చొని గోళ్ళు కత్తిరించుకుంటావా?"

లాల్ నవ్వాడు. "నా ఉద్యోగానికి రెండు వైపులుంటాయి: ఒకవైపు నువ్వు చూడు, రెండోవైపు నేను. అంబాసిడర్ హోటల్ కెళ్ళి నరేష్ కలాపాల గురించి ఆరాతీస్తాను, ఓ.కే?"

## 3

ఆరంతస్తుల హోటల్ అంబాసిడర్ ఆవరణలో కారు దిగి లాల్ చకచకా నడిచాడు.

ఇంతలో నాలుగో అంతస్తులో కొద్దిగా తెరిచివున్న ఒక గది కిటికీ రెక్కలు ఒక్కసారిగా అమాంతం తెరచుకొని, ఒక యువతి గుండ్రటి తల బయటికొచ్చి క్రిందకు చూసింది.

లాల్ రిసెప్షన్‌లోకెళ్ళి కౌంటర్ దగ్గర ఆగాడు. అక్కడ రిజిస్టర్‌లో ఏవో ఎంట్రీలు చేస్తూ తంటాలు పడుతోన్న క్లర్కు, తలెత్తి ప్రశ్నార్థకంగా చూశాడు.

లాల్ చిన్నగా నవ్వి, "మిస్టర్ సలీం?" అన్నాడు.

"మిస్టర్ పాల్" అన్నాడతను, "సలీం లోపల వున్నాడు. ఏం కావాలి?"

"పర్సనల్ ...." అని వదిలేశాడు లాల్.

వెనుక అడుగుల అలికిడయింది. ఒక యువతి గబగబ నడిచి వస్తోంది. లాల్ ఆమెని చూశాడు: ఇరవై ఏళ్ళుంటాయి. చామనఛాయ వర్ణంలో ఆకర్షణీయంగా వుంది.

ఆమె దగ్గరకి వచ్చి, నవ్వి, "మీరు లాల్ కదూ?" అంది.

లాల్ తలూపాడు.

"నమస్తే! మీ ఫోటో చూశాను - నా పేరు నస్రీన్, కడపనుంచి వచ్చాను...."

"యస్?" లాల్ అడిగాడు ఆసక్తిగా.

"మిమ్మల్ని బయట కారు దిగుతుంటే చూశాను— ఈ హోటల్‌లో మేం మూడు రోజులనుంచీ వుంటున్నాం. మిమ్మల్ని గదిలోంచి చూసి వెంటనే గుర్తుపట్టాను. లాల్ అండ్ జాన్ జంట డిటెక్టివ్స్‌లో మీరొకరు—కాంతి లాల్ ఖన్నా!"

లాల్ నవ్వాడు. "గ్లాడ్ టు మీట్యూ! మీరిక్కడేం చేస్తున్నారు?"

"నాన్నతో వచ్చాను—ఆయన బిజినెస్ పనిమీద వచ్చారు. నేను చదువుకుంటున్నాను. మీరెప్పుడైనా కడప వచ్చారా?"

"లేదు."

"వస్తే మా ఇంటికి రండి!"

"అలాగే!"

ఆమె అటూ ఇటూ చూసి ఛటుక్కున ఇంకా దగ్గరగా జరిగింది:

"మా వూరినుంచి ఒక కిరాతకుడిక్కడ తిరుగుతున్నాడు. మీరతన్ని పట్టుకొంటారా?" అంది రహస్యంగా.

"ఎవరతను?" లాల్ అడిగాడు అంతే రహస్యంగా.

"ఆచారి" అంది నస్రీన్.

"మీ వూళ్ళో ఏం చేస్తుంటాడు?"

"కిరాతకాలు చేస్తుంటాడు."

"అతన్ని మీరెక్కడ చూశారు?"

"ఈ హోటల్‌లోనే— మొన్న రాత్రి."

"అతన్ని పోలీసులు గాలిస్తున్నారా?"

"లేదు-వారం క్రితంవరకూ కడపలోనే వున్నాడు."

"ఇప్పుడతన్ని ఎందుకు పట్టుకోమంటున్నారు?"

"ఎందుకేమిటి! కిరాతకుల్నెందుకు పట్టుకుంటారు!"

లాల్ పగలబడి నవ్వాడు: "వెల్! డిటెక్టివ్‌లకి దొంగల్నీ, హంతకుల్నీ పట్టుకోవడం తప్ప మరో వ్యాపకం లేనట్టుంది! కన్పిస్తే చాలు, లేని సమస్యలు కూడా కల్పించుకొని ఏకరువు పెడతారు! మీలాంటి అందమైన అమ్మాయిలు నేరసుల గురించి ఆలోచించకూడదు. మరేదైనా అందమైన సహాయం కోరి రిలీఫ్ కల్గించండి! లైఫ్ పూర్తిగా యాంత్రికమైపోయింది!"

ఆమె లాల్‌ని నొచ్చుకుంటూ చూసింది. "క్షమించండి....అయితే సాయంత్రం నన్ను కార్లో తిప్పుతారా-ఈ సిటీ నాకు కొత్త?"

"ఇట్ విల్ బి ఎ ప్లెజర్!" అన్నాడు లాల్ తలెగరేసి. ఇంతలో కౌంటర్ వెనుక వేగంగా నడిచి వస్తున్న పాతికేళ్ళ యువకుడిని చూసి మళ్ళీ అన్నాడు, "వెల్ నస్రీన్! మీతో కాలక్షేపం కాలం తెలియకుండా చేస్తుంది. నాకిప్పుడు ముఖ్యమైన పని వుంది. మీరు గదిలో నాకోసం ఎదురు చూస్తుంటారా—సాయంత్రం వచ్చి తీసికెళ్తాను?"

ఆమె తలూపి, మెరుస్తున్న కళ్ళతో లాల్‌ని చూసి, వెనక్కి తిరిగి వడివడిగా అడుగులేసింది.

ఆమె కనుమరుగయ్యాక లాల్ ఆ యువకుడివైపు తిరిగాడు.

అతను నోరు పెద్దగా తెరిచి అర్చాడు: "వాట్! మీ రెక్కడనుంచి వూడిపడ్డారు!"

"వూడిపడ్లేదు—వచ్చి పడ్డాను—మీకోసం. మీరు

మిస్టర్ సలీం కదూ?"

"అవును! డిటెక్టివ్ లాల్! వెల్, నాకోసం వచ్చారా?"

"అవును. మీతో బిజినెస్ మాట్లాడాలి."

"వాట్ బిజినెస్?"

"నరేష్‌కుమార్ గురించి—అతను మీ ఫ్రెండ్."

"అవును, అతని కేమయింది?"

"రెండు రోజులనుంచీ యింటికి రావడంలేదు. అతని జాడ తెలుసుకోవాలి. మాయమైన రోజు—మొన్న రాత్రి—అతనిక్కడికొచ్చాడా?"

"వచ్చాడు. అతనితో మరో ఇద్దరున్నారు: పాల్, సుకుమార్‌లు. రాత్రి 10:30 కి ఇక్కడినుంచి వెళ్ళిపోయారు."

"ఇక్కడి కెప్పుడొచ్చాడు?"

"తొమ్మిది గంటలకు. మిస్ కామిని ప్రోగ్రాం చూసి పదిన్నరకు వెళ్ళిపోయాడు."

లాల్ ఒక్కక్షణం ఆలోచించాడు.

"పాల్, సుకుమార్ ఎక్కడుంటారు?"

"పాల్ సనత్‌నగర్‌లో వుంటాడు" అని అడక్కముందే అడ్రసు వ్రాసి, లాల్ కందిస్తూ మళ్ళీ అన్నాడు సలీం: "సుకుమార్ గురించి నాకు తెలియదు."

"సరే, నరేష్ రోజూ ఇక్కడికొస్తాడా?"

"కొత్త డాన్సర్ వస్తే బోరు కొట్టేదాకా వస్తాడు."

"మిస్ కామిని ఎప్పుడొచ్చింది?"

"పది రోజులైంది."

"ఎటువంటిది?"

"అది చెప్పకూడదు. వాళ్ళ గుణం గురించి యెలాటి

వ్యాఖ్యానాలూ చేసి వ్యక్తిత్వాన్ని కించపర్చటం మా అభిమతం కాదు."

"నరేష్ ఆమెతో స్నేహం చేశాడా?"

"ఆమె స్నేహాన్ని తిరస్కరించే దెవరు? డబ్బు వెద జల్లగల వాళ్ళెవరైనా కాంక్షిస్తారు!"

"నరేష్ వెదజల్లుతా డనుకుంటాను—"

"అవును. ఆమెతో బాగా స్నేహం చేశాడు. అతి త్వరలో ఆమె నిక్కడనుంచి ఎగరేసుకుపోతానని నాతో ఒకసారి చెప్పాడు."

"ఐసీ....ఐసీ...."

"వాడ్డూ యూ సీ, మిస్టర్ లాల్?"

"నెవర్ మైండ్. మొన్న రాత్రి అతను కేవలం డాన్సు చూసి వెళ్ళిపోయాడా? ఆమెతో గడపలేదా?"

"లేదు—ఆ రాత్రి ఆమె ఆరోగ్యం చెడింది. గుండె జబ్బు వుంది. సన్నగా పోటు ప్రారంభమైతే షో మధ్యలో వదిలేసి గది కెళ్ళిపోయింది."

"ఇప్పుడు కోలుకుందా?"

"అది మామూలే. కానీ, ఏ క్షణమైనా ఆమెకు ప్రాణాపాయమే!"

"ఆమెను నే నొకసారి చూడాలి" అన్నాడు లాల్

మిస్ కామిని గది ఆరో అంతస్తులో చివర్న వుంది. సలీం బెల్ నొక్కగానే తలుపు తెరిచి ఆమె దర్శన మిచ్చింది. ఆమె వయసు 20 మించదు. మంచి సౌష్ఠం గల శరీరం. లేత వయసులోనే చవిచూసిన నికృష్టపు జీవితానుభవాల ఛాయలు ఆమె కళ్ళలో ప్రతిఫలిస్తున్నాయి.

సలీం ఆమెను లాల్ కి పరిచయం చేసి నిష్క్రా

మించాడు.

"మిస్ కామినీ, మీరు నరేష్‌ని ప్రేమిస్తున్నారా?" అడిగాడు లాల్ సూటిగా.

ఆమె తలూపింది.

"అది చెప్పడానికి సందేహించను!" అందామె నిశ్చయంగా, "ఇంతవరకూ నన్ను పొందేవాళ్ళనే గానీ—చేపట్టగల ఒక్క ధీరుడ్నీ చూడలేదు! ఐ లైక్ హిమ్ వెరీమచ్. అతని ధైర్యాన్ని మెచ్చుకోకుండా వుండలేను! నా జీవితం ఏమిటి? అంతా కృత్రిమం!.... నా పేరు, నా వేషం, నా మాటలు, నా నవ్వు....అంతా కృత్రిమం! ....ఇక సహించను. నా జీవితాన్ని సహజంగా అనుభవించాలి! మిగిలివున్న కొద్ది యవ్వనాన్ని నా మనసుకు తృప్తి కలిగే రీతిలో ఖర్చు చేయాలి!.... దాన్ని ఆస్వాదించగల అర్హత గలవాడు నాకు నరేష్ ఒక్కడే కనిపిస్తున్నాడు."

"కానీ నరేష్‌కు పెళ్ళయింది....ఈ సంగతి మీకు చెప్పలేదనుకుంటాను."

"చెప్పాడు—భార్యా తల్లీ కట్టకట్టుకుని గండిపేటలో దూకినా తనకేమీ పట్టదనికూడా చెప్పాడు. నా బ్రతుకు తిరిగి వికసించబోతోంది....నాది స్వార్థం. సాటి ఆడదాని జీవితం గురించి నేనిప్పుడు ఆలోచించను!"

"మీ రిద్దరూ యెక్కడికి వెళ్ళాలనుకుంటున్నారు?"

"యెక్కడికైనా! స్వతంత్రంగా జీవించడానికి లోకంలో చాలా చోటు వుంది—కదూ?"

"కానీ, ఇప్పుడొక సమస్య వచ్చి పడింది సిస్టర్."

"సిస్టర్! మీరు నన్ను సిస్టర్ అన్నారా?"

"అనకూడదా? సమస్య వినండి!"

"చెప్పండి."

"నరేష్ కనిపించడంలేదు, మొన్నటినుంచి."

"ఎక్కడికి వెళ్ళాడు?"

"అది తెలిస్తే మీ దగ్గరి కెందుకొస్తాను!" లాల్ నవ్వాడు.

"అంటే మీ కనేది—యెవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడా?"

"అవును. మొన్న రాత్రి మీకు గుండెపోటు వచ్చిందని విన్నాను. ఐయాం సారీ, అప్పుడు నరేష్ మిమ్మల్ని కలిశాడా?"

"ఇక్కడే కలిశాడు. చాలా కంగారు పడ్డాడు. నా జబ్బు గురించి అతనికి తెలుసు. అయినా వెనుకంజవేయ లేదు! ఇక ఈ వృత్తికి స్వస్తి చెప్పమని బలవంతం చేశాడు. రెండు రోజుల్లో నన్నిక్కడి నుంచి తీసికెళ్ళిపోయి నా గుండె జబ్బు నయం చేయిస్తాడట! నేనూ ఓ మనిషిగా గుర్తింపబడుతానని ఎప్పు డనుకున్నాను!"

హఠాత్తుగా ఆమె కళ్ళు ఉలిక్కిపడ్డాయి. ముఖం ఎర్రబడింది.

"ఏమిటి?" లాల్ అడిగాడు.

"నరేష్ నన్ను హెచ్చరించాడు!" అర్చిందామె ఒక్కసారిగా. "తన నెవరో రహస్యంగా వెంటాడు తున్నట్టు చెప్పాడు! అత నెవరో స్పష్టంగా చూడలేదు గానీ, ఆ నీడవల్ల మా ఇద్దరికీ ప్రమాదం వుందని చెప్పాడు! ప్లాను చెడుతుందట! నన్ను గది కదలవద్దన్నాడు! బహుశ ఆ నీడను అతని తల్లి నియమించి వుంటుంది—ఆ భయంతో నరేష్ ఎక్కడికైనా పారిపోయి వుంటాడు! ఓహ్! మళ్ళీ నా బ్రతుకు మొదటికే వచ్చింది!"

మిస్ కామిని నిస్సహాయంగా, విరక్తిగా, చేతిలో వున్న గాజుగ్లాసుని విసిరికొట్టి, సోఫాలో కూలబడింది.

## 4

సాయంత్రం అయిదు గంటలకు క్రీం కలర్ లో మెరుస్తున్న ఫియెట్ కారొకటి ఇరువైపులా డోర్స్ మీద 'టిసిడిపి' అన్న ఎర్రటి అక్షరాలతో సిటీలోని రోడ్లన్నీ పిచ్చి పిచ్చిగా తిరిగేస్తూ, గమ్యం తెలియక గగనంలో సందిగ్ధంగా విహరిస్తున్న ఒంటరి పక్షిలా సాగిపోతోంది....

కార్లో డిటెక్టివ్ లాల్ ప్రక్కన కూర్చున్న నస్రీన్, అతని మాటలు వూపిరి బిగబట్టి వింటోంది.

లాల్ కొన్ని శతాబ్దాల చారిత్రాత్మక కట్టడాల నుంచీ నేటి నూతనాకాశాహార్మ్యాల వరకూ నగరాన్ని క్షుణ్ణంగా వివరిస్తూ, వర్ణిస్తూ, చివరికి, "ఉఫ్ ఫ్!.... అన్నట్టు అసలు విషయం మరిచాను! ఇండియా పటంలో హైదరాబాదు నడిబొడ్డున వుందని మీకు తెలుసా?" అని, టాంక్ బండ్ మీద మున్సిపల్ హోర్డింగ్ చూపించి, "మనది అందమైన నగరం—కానీ పరిశుభ్రంగా వుంచడానికి మన మెవరం? అది కార్పొరేషన్ ఉద్యోగుల గ్రహచారం!" అంటూ కామెంట్ చేసి కారాపేశాడు.

నస్రీన్ గుండెలమీద చేతులు వేసుకొని, భారంగా వూపిరి వదిలి అంది, "గాడ్ మీ మాటలతో నన్నదరగొట్టేశారు!"

"అలాగా? ఐయాం సారీ! అది నా లోపం. నా స్థానంలో జాన్ వుంటే మరో విధంగా వుండేది. అతనికి రోమాన్స్ యెలా సాగించాలో బాగా తెలుసు. నాకు తెలియదు. కొంపలంటుకున్నట్లు గడగడ వాగేసి అదర

గొంతు కోసేస్తాను!"

"దుర్మార్గులను పట్టుకునే వాళ్ళలాగే వుండాలి!" అంది నస్రీన్.

"అవును. అందుకే ఒక్కోసారి మీలాంటి అందమైన అమ్మాయిల్ని యిలా అదరగొట్టేసి నేనే దుర్మార్గుడిలా కన్పిస్తాను...."

లాల్ ఒక్క క్షణం తర్వాత ఛటుక్కున వంగి మళ్ళీ అన్నాడు, "దురాగ్రుడంటే బిజినెస్ జ్ఞాపకమొచ్చింది! కడప—మీ కడప కిరాతకుడి గురించి నాకు చాలా కుతూహలంగా వుంది."

నస్రీన్ కూడా ముందుకు వంగి, "దేనికి?" అంది.

"ఓహ్ మీకేం తెలుసు! మీకు తెలియకుండా నాకెంత సహాయం చేశారో తెలుసా? నేను కన్పించగానే అభిమానంకొద్దీ మీరు కోరిన అసందర్భపు కోరిక ఇప్పుడెంత విలువైనదో మీకు తెలుసా?"

"అంటే—యేమిటి మీరనేది....?" నస్రీన్ భయపడింది.

"రిలాక్స్. మీ కోరిక ఇప్పుడు చాలా అమూల్యమైనది. నేను ఆచారిని పట్టుకోడానికిప్పుడు సిద్ధంగా వున్నాను. అతని గురించి చెప్పండి."

"ఏమిటి మీ రనేది మిస్టర్ లాల్!"

"కాకతాళీయం. నమ్ముతారా? నేనో కేసు దర్యాప్తులో మీరు బసచేసిన హోటల్ కే రావడం, మీరు నన్ను గుర్తించి పరిచయం చేసుకోవడం, మీ వూరి కిరాతకుడి ప్రసక్తి తేవడం, ఇప్పుడదే కిరాతకుడు నేను పని చేస్తున్న కేసులో నా క్కావల్సిన మనిషి కావడం—మీరు నమ్ముతారా?"

"ఆశ్చర్యంగా వుంది! ఆచారి మీ క్కావల్సిన మనిషా!"

"అవును."

"ఎందుకు? అతనేం చేశాడు?"

"మీ వూళ్ళో యేం చేస్తుంటాడు? అలాటిదే యిక్కడా చేశాడు. అతను మీ వూరు వదిలి ఎన్నిరోజులైంది."

"వారం రోజులైంది... ఆయనకి మా ఊళ్ళో ఒక ప్రత్యేకత వుంది. అతనెక్కడ అడుగు కదిపినా ఊళ్ళో అందరికీ తెలిసిపోతుంది."

"నిన్న ఇక్కడ అతన్ని హోటల్ లో చూసినప్పుడు మిమ్మల్ని చూశాడా?"

"లేదు—అతను కన్పించగానే తప్పుకున్నాను. నన్ను చూడలేదు. చూసినా ఏమీ చెయ్యడు—అతను ఆడ వాళ్ళ జోలికి రాడు."

"ఎందుకు రాడు?"

"అతనికో కూతురుండేది—ఇరవై ఏళ్ళు. ఇద్దరు రౌడీలు ఆమెని ఒక రాత్రి సాల్వెంట్ ఆయిల్ ప్లాంట్ వెనుక ఎత్తుకుపోయి—"

"చంపేశారా?"

"అవును, అంతే, చంపేశారు. తర్వాత ఆచారి వాళ్ళిద్దర్ని చంపేశాడు. కానీ పట్టుబడలేదు. చచ్చిపోయిన కూతురికోసం అతనిప్పటికీ కుమిలిపోతుంటాడు. ఆడ వాళ్ళెవరైనా కనిపిస్తే చాలు-ఆప్యాయంగా పలకరిస్తాడు గానీ, అపకారం చెయ్యడు. అయినా అతను హత్యలు చాలా చేస్తాడని చెప్పుకొంటూరు. కానీ యెన్నడూ పట్టు బడలేదు!"

"అదెలా?"

"చిమ్మ చీకట్లో 'చావుదెబ్బ—పోలీసు లెవర్ని పట్టు కుంటారు?"

లాల్ రెండు క్షణాలు ఆలోచించాడు. "అయితే అతను కిరాయి హంతకుడన్నమాట?"

నస్రీన్ తలూపింది. "అవును, అతనితో లావాదేవీలు చాలా గుట్టుగా జరుగుతుంటాయి."

"సరే, ఇప్పుడు చెప్పండి! నిన్న మీ రతన్ని సరిగ్గా ఎక్కడ నుంచి చూశారు?"

నస్రీన్ అంది, "నిన్న రాత్రి 10 గంటల వరకూ నాన్న తిరిగి రాలేదు. ఫోన్ చేయలేదు. ఎక్కడ వుంటారో తెలియదు. నా కేమీ పాలుపోక క్రిందికి దిగి వచ్చాను. అప్పుడు కౌంటర్ దగ్గర అతన్ని చూశాను—బిల్లు చెల్లిస్తూ కన్పించాడు ఆచారి! నేను గబుక్కున పైకెళ్ళి గదిలో పడ్డాను. కిటికీ తెరిచి బయటికి చూశాను. కాస్సేపటి తర్వాత ఆచారి బయటి కొచ్చి...."

"చెప్పండి."

"ఆచారి బయటి కొచ్చి సిగరెట్ తాగుతూ నిలబడ్డాడు. పది నిమిషాల తర్వాత ముగ్గురు యువకులు—వాళ్ళెవరో స్పష్టంగా కన్పించలేదు. నేను పట్టించుకో లేదు. నా దృష్టి ఆచారిమీదే వుంది—ఆ ముగ్గురూ కారెక్కి బయలుదేరారు. గ్రీన్ అంబాసిడర్. అది బయలుదేరాక ఆచారి యెక్కడి నుంచి తెచ్చాడో, మెరుపులా ప్రక్కనే వున్న జావా మీదెక్కి స్టార్ట్ చేసి దూకించాడు. అంతే—ఆ తర్వాత నా కేమీ కన్పించ లేదు."

"జావా నెంబర్ మీరు చూశారా?"

"చీకట్లో, అంతదూరంనుంచి కన్పించదు."

"సరే, ఆచారి ఎలా వుంటాడు?"

ఆమె ఒక నిమిషంసేపు వర్ణించింది. అది జాన్ వర్ణనతో సరిపోయింది.

"వెరీవెల్, అంతా మర్చిపోండి! ఈ సంభాషణ గురించి యిక ఆలోచించకండి!"

"అలాగే! కానీ నాకో విషయం చెప్తారా? ఆచారి ఇంకెవర్ని చంపాడు?"

"ఇంకెవర్నీ చంపలేదు."

"మరి ఎందుకు గాలిస్తున్నారు?"

"ఆచారి స్వయంగా ఏవైనా పనులు చేపడతాడా?"

"లేదు. ఇతరులు అతన్ని ఎన్నుకుంటారు—డబ్బిచ్చి."

"అయితే అతని గురించి తెలిసిన వాళ్ళెవరో ఇక్కడ వున్నారన్నమాట. వాళ్ళతన్ని పిలిపించి ఈ పని అప్ప జెప్పి వుంటారు."

"ఏ పని?"

"నెవర్ మైండ్. చాలా రాత్రయింది, ఇక వెళ్దాం. మీ డాడీ కోప్పడవచ్చు."

"కోప్పడతారా!" అర్చింది నస్రీన్. "ఈ సాయంత్రం నా జీవితంలో మరపురానిది! డిటెక్టివ్ లాల్‌కు నేను అతి ముఖ్యమైన విషయాలు చెప్పి సహాయపడినందుకు ఆయనెంత సంతోషిస్తారో మీకు తెలుసా!"

"నాకు తెలియదు," లాల్ అడ్డంగా తలూపాడు.

## 5

హోటల్ అంబాసిడర్‌లో లాల్ నస్రీన్‌ను డ్రాప్ చేసి, టెలిఫోన్ బూత్‌లోకెళ్ళి ఆఫీసు నెంబర్ డయల్ చేశాడు.

"హాలో జాన్, లాల్ హియర్."

"లాల్!" అర్చాడు జాన్, "ఎక్కడున్నావు? గంట నుంచీ ఎదురుచూస్తున్నాను!"

"ఏమయ్యింది?"

"ఓహ్! అంతా తలక్రిందులైంది! ఫ్లాప్! అత్తా కోడళ్ళిద్దరూ కారెక్కి వెళ్ళిపోయాక చెట్టుమీద బైనాక్యులర్స్‌తో కూర్చున్న కోతి—సారీ—అతనక్కడ అరగంట నుంచీ మమ్మల్ని గమనిస్తున్నాడు—ఢడాలున చెరువులో దూకేసి ఈత కొట్టాడు. మేం వెంటనే బయటికొచ్చి ఆరుస్తూ పరిగెత్తాం. నా ఫ్రెండ్ సోనియా, చెరువులో దూకేసి జాడీకేసి ఈత కొట్టింది. ఇద్దరూ ఎదురెదురుగా వస్తున్నారు. నేను క్షణం ఆలస్యం చెయ్యక గురిచూసి వరుసగా మూడు షాట్స్ పేల్చాను — కానీ— మొదటి షాట్ తగిలే లోపునే జాడీ మునిగిపోయింది!"

"ఏమిటీ!"

"అవును, లాల్! జాడీ దానికదే మునిగిపోయింది! నాకేమీ అర్థంగాలేదు! వాళ్ళిద్దరూ పెనుగులాడుతున్నారు. సోనియా అతన్ని విదిల్చికొట్టి, కొంటెగా వెక్కిరించి, జాడీ మునిగినచోట మునిగింది. అతనూ మునిగాడు. కాసేపు నీటిపైన కలకలం. ఇంతలో సోనియా బయటకొచ్చి ఒడ్డుకేసి ఈదసాగింది. కొన్ని క్షణాలయాక అతనూ బయటికొచ్చాడు. చేతిలో ఏమీ లేదు! వింటున్నావా? అతని చేతిలో ఏమీ లేదు!"

"మరి!"

"ఒట్టి చేతులతో శకికొద్దీ ఈదుతూ సోనియాను తిట్టసాగాడు! జాడీ తన కివ్వమని కేకలు వేశాడు! ఆ జాడీ సోనియా దగ్గర లేదు! ఆమె గట్టెక్కి బట్టలు

పిండుకోసాగింది. నేను కెమేరా సిద్ధం చేసుకున్నాను. ఇంతలో అతనూ పైకి వచ్చి ఆమెని పట్టుకున్నాడు. వెంటనే స్నాప్ తీశాను. వాళ్ళిద్దరూ వాదించుకుంటున్నారు. అంతవరకూ మతి పోగొట్టుకున్న నేను, తెలివిలోకొచ్చి కల్పించుకున్నాను. ఆ జాడీ అతని కెందుకని అడిగాను. చెప్పలేదు. అందులో ఏముందని అడిగాను. చెప్పలేదు. చచ్చేంత నెర్వస్ అయ్యాడు."

"నే నతన్ని ఎక్కువ వేధించకుండా, ఆ జాడీ షూట్ చేసేలోపునే మునిగిపోయిందనీ; అక్కడే అడుక్కి చేరుకొని వుండవచ్చనీ; కాబట్టి జాగ్రత్తగా గాలించమని చెప్పి బయలుదేరాను. అతను నన్ను ఆపి ఈ వ్యవహారం యెవరికీ చెప్పవద్దన్నాడు. ఆ జాడీలో అతని ప్రియురాలి లేఖలున్నాయట! కానీ, నా కెమేరాలో అతని ఫోటో వుందని తెలియదు!"

లాల్ నిట్టూర్చాడు: "ఆ తర్వాత ఏం జరిగింది?"

"మేం తిరిగి వచ్చేశాం, దట్సాల్. కానీ ఆ జాడీ ఎందుకు మునిగిందో అర్థంగావడంలేదు! చేప మింగిందా? అబ్సర్డ్!"

"ఆ జాడీ ఎంతసేపు నీటిపైన తేలింది?"

"దాన్ని విసిరిన వెంటనే వాళ్ళు కారెక్కలేదు. అయిదు నిమిషాలు ఆలస్యం చేశారు. ఆ తర్వాత కిడ్నాపర్ చెట్టుదిగి ఈతకొట్టి చేరుకోవడానికి నాలుగు నిమిషాలు పట్టింది.... మొత్తం కలిపి సుమారు పది నిమిషాలు తేలిందనుకుంటాను."

"క్లయింట్స్ నీ సూచనలు పాటిస్తామన్నారుగా?"

"అవును, అందుకు ఒప్పుకున్నారు."

"నిజంగా ఒప్పుకున్నారా?"

"అంటే?"

"అంటే—ఒకవేళ వాళ్లు జాడీలో నీళ్ళు తీసేసి నోట్లు పెట్టివుంటే?1

"ఓహ్! అలా ఎందుకు చేస్తారు?"

"భయంకొద్దీ—మనమీద నమ్మకం లేక!"

"అయితే జాడీ ఎందుకు మునుగుతుంది? నిండా నీటితో తేలినప్పుడు, నోట్లతో ఎందుకు మునుగుతుంది?"

"కంగారులో మూత గట్టిగా బిగించకపోతే—"

"ఎంత వదులుగా బిగించినా మునగడం అసంభవం!"

"అయితే ఒక్కటే సంభవం—బుల్లెట్ తాకింది—దట్సాల్. మాట్లాడకు! ఒక్కోసారి నువ్వు కంగారుపడి గందరగోళం సృష్టిస్తుంటావు! కిడ్నాపర్ మళ్ళీ చెరువులో కెళ్ళి ఈసారి జాగ్రత్తగా గాలిస్తాడు. జాడీ తప్పక దొరుకుతుంది. నరేష్ క్షేమంగా తిరిగి వస్తాడు, డబ్బు పోతుంది. కానీ—కిడ్నాపర్స్ మనచేతికి ఇక చిక్కరు!"

"ఆ జాడీలో డబ్బుంటుందనిఎందుకనుకుంటున్నావు?"

"ఏమో, ఎందుకో అలా అన్పిస్తోంది .... ఆడవాళ్ళ గట్స్‌ని ఇంతకంటే ఎక్కువ అంచనా వెయ్యలేక పోతున్నాను."

"ఈ ఆలోచన నీకు ముందే రావల్సింది!"

"క్లయంట్స్‌లో మనమీద సరైన ఇంప్రెషన్ కల్గించ లేక పోయాం. దద్దమ్మల్లా ప్రవర్తించామనుకుంటాను.... పైగా వాళ్ళకు నరేష్ ప్రాణభయం పీకుతోంది! ఛ, ఆ ఫోటోల్లో నిజం చెప్తే బాగుండేది! వెల్, జాన్! ఆ జాడీలో డబ్బుందన్న నా గుడ్డి నమ్మకంతో నెర్వస్ అవకు! అది కేవలం వూహ! ఆ ఫోటో కిడ్నాపర్స్‌ని పట్టి స్తుంది. ఆ స్నాప్‌ని ప్రింట్ తీశావా?"

"తీశాను, ఆనవాలు చెప్తాను: వయసు సుమారు పాతిక. తెలుపు రంగు. లావు శరీరం. పొడవాటి జుత్తు. ఎత్తు అయిదున్నర. గ్రే కలర్ ప్యాంటు, తెల్లషర్టు."

"అతను ఆచారి కాదు కదా?" అన్నాడు లాల్, "వెల్, నేను వెంటనే వచ్చి ఆ ఫోటో చూస్తాను.... అక్కడే వుండు."

"ఆచారి వయసు యాభై, బట్టతల. మారు వేషం వేస్తే తప్ప యితను ఆచారి కావడానికి వీల్లేదు" అన్నాడు జాన్.

"గుడ్....యూ ఆర్ రైట్."

లాల్ బూత్ లోంచి వచ్చి కారెక్కాడు.

కారు స్టార్టయి అవరణ దాటాక, దూరంగా ఆగివున్న మోటార్ సైకిల్ కదిలింది. దానిమీద లావాటి ఆకారం సిగరెట్ విసిరేసి, జేబులు తడుముకుంది. ఆ తర్వాత వేగం పెంచి వెంబడించసాగింది....

లాల్ తక్కువ వేగంతో డ్రైవ్ చేస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతని నోట్లో కాలుతున్న సిగరెట్ క్షణ క్షణానికీ నుసి క్రింద క్షీణిస్తోంది. ఎదురుగా డబల్ డెక్కర్ వుండటంవల్ల అప్రయత్నంగా లాల్ వేగం తగ్గింది. అన్యమనస్కంగా డ్రైవ్ వెయ్యటంతో, వెనుకనున్న వాహనాలు రొద పెట్టాయి.

లాల్ ఉలిక్కిపడి తేరుకొని వేగం పెంచి డబుల్ డెకర్ని ఓవర్ టేక్ చేయబోయాడు. కానీ—వెంబడిస్తోన్న మోటార్ బైక్ అతనికంటే వేగంగా దూసుకెళ్తూ గుళ్ళ వర్షం కురిపించింది. రివాల్వర్ షాట్స్ తో పరిసరాలు ప్రతిధ్వనించాయి. జనం కేకలు వెలువడ్డాయి. ఎక్కడి

వాళ్ళక్కడ స్థంభించిపోయారు. లాల్ చేతిలో స్టీరింగ్ అదుపు తప్పి, కారు బానెట్ డెకర్‌ను రాసుకుంటూ వెళ్ళి హెడ్‌లైట్ తునా తునకలైంది.

లాల్ బలంకొద్దీ బ్రేకు వేసి, రివర్స్ తీసి, తిరిగి ముందుకు దూకించాడు. ఏక్సిలేటర్‌ను బలంగా నొక్కిపట్టి, ట్రాఫిక్‌ను చాకచక్యంగా తప్పించుకుంటూ ముందుకు దాటిపోయాడు.

గన్ ఫౌండ్రీదగ్గర ట్రాఫిక్ పలచబడి దాడి జరిపిన మోటార్‌సైకిల్ తేలింది. లాల్ వేగం యింకా పెంచి రివాల్వర్ తీశాడు. బైక్ వందగజాల దూరంలో వుంది. లాల్ చెయ్యి రివాల్వర్‌తో బయిటికొచ్చి ట్రిగ్గర్ లాగింది. షాట్ ప్రేలి దాని శబ్దానికి బైక్ తడబడి అడ్డదిడ్డంగా వెళ్ళింది. లాల్ మరో షాట్ ప్రేల్చాడు. మళ్ళీ గురి తప్పింది. కానీ దూరం యింకా తగ్గడంతో బైక్ నెంబర్ స్పష్టంగా చూశాడు.

బైక్‌మీద మనిషి వెనుదిరిగి, వరుసగా మూడుసార్లు షూట్ చేసి మెరుపులా దూసుకుపోయాడు. మూడింట్లో రెండు బుల్లెట్స్ విండ్‌షీల్డ్‌నుంచి లోనికి వచ్చాయి. లాల్ బ్రేకువేసి కోపంగా స్టీరింగ్ మీద గుద్దాడు.

# 6

"డామిట్! ఆచారి మనల్ని ఎలా పసిగట్టాడు?" జాన్ అడిగాడు ఆందోళనగా, "నా మారువేషం వెల్లడయిందా? నే నెక్కడ పొరపాటు చేశాను? ఒకవేళ సోనియా కారు నెంబర్ ...."

"కాదు—" లాల్ అడ్డు తగిలాడు, "నువ్వు ఫోటో తీసినట్టు కిడ్నాపర్‌కు తర్వాత తట్టివుంటుంటుంది. ఆచారికి చెప్పాడు. అప్పుడతనేం చేస్తాడు? చెరువుదగ్గర నీ

షూటింగ్ వ్యవహారం ఏదో ట్రాప్ అయివుంటుందని అనుమానించి నిన్ను ట్రేస్ చేయడానికి పూనుకుంటాడు. నరేష్‌ని విడిచిపెట్టకుండా, క్లయింట్స్‌ని బెదిరించి వాళ్ళకు సహాయపడుతోం దెవరో తెలుసుకుంటాడు. అప్పుడు మనం తేలుతాం! అర్థమైందా? దట్సాల్."

"ఓహ్! నువ్వూ నీ వెధవ ప్లాను!" జాన్ అర్చాడు. "పథకం అమలుపర్చాక పొరపాట్లు వివరిస్తావా? నీ మెదడు పాడయింది! గాడ్! నువ్వు చావలేదు గనుక నేను బ్రతికిపోయాను! లేకపోతే ఆచారి ఇక్కడకొచ్చి—"

"మేసన్ ది జూనియర్ తల్లో షూట్ చేసేవాడు—అంతేనా?" లాల్ నవ్వాడు.

"వెల్, పార్ట్‌నర్. నే నిప్పుడు పొరపాట్లు వివరించడం లేదు. ఇమాజినేషన్—! వూహిస్తున్నాను, అంతే. క్లయింట్స్‌ని డబ్బు గురించి అడిగావా?"

"వెంటనే అడిగాను—మనం చెప్పిన ప్రకారమే చేశారట!"

"ఐసీ! నరేష్ తిరిగివచ్చాడా?"

"ఇంకా లేదు. ఎందుకొస్తాడు? సుమిత్ర ఏం చెప్పింది? కిడ్నాపర్స్ చేతిలో మన చావు తప్పింది. ఇప్పుడు నరేష్‌ని వదిలిపెట్టి పట్టుబడే ప్రమాదం ఎందుకు తెచ్చుకుంటారు? డెవిల్ కిల్ హిమ్. అండర్‌స్టాండ్? ఈ పాటికి చచ్చివుంటాడు!"

లాల్ కళ్ళు ఎర్రగా వున్నాయి. గ్లాసులో విస్కీ పోస్తూ ఆలోచిస్తున్నాడు....ఫోను మ్రోగింది.

జాన్ అలసటగా రిసీవర్ ఎత్తాడు: "ఎస్?"

కొన్ని క్షణాలయాక, "వాట్!" అనరిచాడు.

సుమిత్ర అంది: "అవును జాన్! హత్య జరిగిందట!

మీరు త్వరగా రండి! లేకపోతే హంతకుడు ఇక్కడికి వచ్చి—"

"వెంటనే వస్తున్నాం!" జాన్ ఫోన్ పెట్టేసి స్ప్రింగ్ లా లేచాడు.

"ఎక్కడికి?" లాల్ అడిగాడు.

"నరేష్ ఇంటికి! మర్డర్ జరిగింది, అతని ఫ్రెండ్ సుకుమార్ ని షూట్ చేశారు. నరేష్ ఇప్పుడే ఇంటికి తిరిగి వచ్చాడు. లెటజ్ రన్!"

నరేష్ ఏడుస్తున్న భార్యనూ, తల్లినీ చూస్తూ అసహనంగా గడుపుతున్నాడు. అతని ముఖం అలసిపోయింది. బట్టలు, జుత్తు ఎర్రటి పదార్థంతో తడిసి భయంకరంగా వున్నాయి.

"ఓహ్! ఎందుకేడుస్తారు? నాకేమీ కాలేదు! చూస్తున్నారా? నేను బాగానే వున్నాను.... నా ఒళ్ళు బాగానే వుంది!"

అదే క్షణంలో డిటెక్టివ్ లు ప్రవేశించారు. వాళ్ళని చూసి నరేష్ తల వంచుకున్నాడు. లాల్ అతన్ని ఎగాదిగా చూసి, "హత్య ఎక్కడ జరిగింది?" అన్నాడు.

"ఆ యింట్లోనే—హాయత్ నగర్ లో!"

"మీరు చూశారా?"

"చూశాను—సుకుమార్ గుండెలో బుల్లెట్ దూరింది! నేను పరుగెత్తి వచ్చేశాను!"

"శవం అక్కడే వుందా?"

"అక్కడే వుంది!"

"ఎవరు షూట్ చేశారు?"

"ఏమో—నాకు తెలియదు!"

జాన్ జేబులోంచి ఒక ఫోటో తీసి చూపించాడు.

"సుకుమార్! ఈ ఫోటో ఎక్కడిది?"

"నేను తీశాను," జాన్ నవ్వి సుమిత్ర వైపు తిరిగాడు, "మీ వారు రాకముందు యెవరైనా ఫోన్ చేసి బెదిరించారా?"

"ఏమని?"

"మీకు సహాయపడుతోం దెవరని—"

"లేదు—ఎవరూ బెదిరించలేదు!"

"ఓ.కే! కమాన్, నరేష్! మీ కథ దార్లో చెప్పండి! —ముందు హత్యాస్థలం చూడాలి. జాన్, నువ్విక్కడ వీళ్ళకి రక్షణగా వుండు. వెంటనే ఫోన్ చేసి పోలీసులకు హత్య గురించి చెప్పు!" లాల్ చెప్పాడు.

జాన్ నరేష్‌ని ఆ యింటి అడ్రసు అడిగి, "మీ ఒంటి మీద ఈ మరక లేమిటి?" అన్నాడు.

"ర—రక్తం!" నరేష్ తడబడ్డాడు.

జాన్ నవ్వాడు, "కె—కెచప్!"

నరేష్ ఉలికిపడి చూశాడు.

లాల్ అతని భుజం పట్టుకొని బయటికి నడిచాడు. కారెక్కి బయలుదేరాక గాద్గదిక స్వరంతో అన్నాడతను—

"మిస్టర్ లాల్, బుద్ధి గడ్డితిని నేనీ పని చేశాను...."

"ఏం చేశారు?"

"స్నేహితుల సహాయంతో ఆ యింట్లో దొంగని నాటకమాడాను."

లాల్ కళ్ళు విశాలంగా చేసి చూసి, "వెధవ పని!" అని కసిరాడు.

"అవును, నేను వెధవని! చవటని! గాడిదని! చిన్నప్పుడు నేనో పుస్తకం చదివాను: కిషన్ చందర్—తిరి

గొచ్చిన గాడిద. దానికీ నాకు భేదంలేదు! నాన్న నన్ను గారాబంగా పెంచి చెడగొట్టాడు! అందుకాయన్ని నిందించను! ఆయన నా కిచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగ పర్చాను!

"ఆయన పోయాక అమ్మ నాకు హద్దు లేర్పరచలేక పోయింది. నాకు బాధ్యతలు తెలియవు! డబ్బు విలువ తెలియదు! అలాంటి పరిసితిలో పెళ్ళి చేసింది. ఆమె తృప్తి కోసం చేసుకున్నానుగానీ, సుమిత్రలో నాకు ఇంట్రస్టు లేదు! నా దృష్టి యెప్పుడూ బయిటివాళ్ళమీదే.... యిప్పుడు ఆ యింట్రుస్టు కూడా పోయింది! కామినిని ప్రేమించాను. ఆమెనే ప్రేమిస్తాను! ఆమె నాక్కావాలి! మగవాడ్ని యెలా ఆకర్షించాలో ఆమెకు తెలుసు. సుమిత్రకు తెలియదు! గంపెడు సాంప్రదాయాల్నీ, సెంటిమెంట్స్‌నీ కొంగున కట్టుకొని వచ్చింది — స్టుపిడ్!—"

"ఆల్ రైట్, కామినితో యేం చెయ్యాలను కొన్నారు?"

"దూరంగా పారిపోవాలనుకొన్నాను. అంతే!అందుకే మిస్టర్ లాల్, నేనీ వెధవ పని చేశాను. నాకు యాభై వేలు కావాలి. అంత డబ్బు వూరికే ఎవరిస్తారు? కాబట్టి ఈ ఉపాయం ఆలోచించాను. అదిప్పుడు బెడిసికొట్టింది! నా కిప్పుడు డబ్బూ వద్దు, కామినీ వద్దు! ఈ గండంనుంచి నన్ను లాగి గట్టెక్కించండి చాలు! బుద్ధి గలిగి వుంటాను."

"అక్కడేం జరిగిందో వివరంగా చెప్పండి."

"డబ్బు కలెక్ట్ చెయ్యడానికి సుకుమార్‌ని పంపాం. వాడొక గాడిద! అతను వట్టి చేతులతో తిరిగి వచ్చాడు.

జాడీ మునిగిపోయిందని చెప్పాడు. ఎవరో ఇద్దరు హిప్పీలు అక్కడ అల్లరి చేశారని అన్నాడు. వెంటనే మేమిద్దరం సుకుమార్‌తో బయలుదేరాం. మరొకతను పాల్.

"రెండు గంటలు చెరువంతా ఈది గాలించాం. జాడీ దొరకలేదు! నా గుండె లవిసిపోయాయి. అంత డబ్బు! దాన్ని చెరువులో విసరమని కోరడం మా బుద్ధి తక్కువ! ఇక నిరాశపడి పథకం విరమించుకోవాలనుకోలేదు. నాకు డబ్బు అత్యవసరం! దానికోసం ఎలాంటి రిస్కయినా తీసుకోడానికి సిద్ధం!

కాని పాల్ ఒప్పుకోలేదు. డబ్బుకోసం మరో సారి బెదిరించడం మంచిది కాదన్నాడు. వాళ్ళు నిబంధనలు తప్పి డబుల్ క్రాస్ చేశారని ఆరోపించడమన్నాను. అయినా అతను ఒప్పుకోలేదు. పిరికివాడు! అలాగైతే గుడ్ బై కొట్టమన్నాను. సంతోషంగా వెళ్ళిపోయాడు."

"తర్వాత?"

"ఇక నేనూ సుకుమార్ మిగిలాం. చివరిసారిగా హెచ్చరించడానికి మరింత భయంకరంగా ఫోటోలు తీయాలనుకున్నాం. ఆ ఫోటోల్లోని రహస్యం గ్రహించేశారన్నమాట! కెచప్ గురించి అయిడియా నాకు పాల్ యిచ్చాడు. అతను మెడిసన్ చదువుతున్నాడు. సరిగ్గా పది గంటలకు నేను కెచప్ జల్లుకొని నేలమీద వెల్లకిలా పడుకున్నాను. ఫీలింగ్స్ ప్రదర్శించాను, సుకుమార్ ఫోటోలు తీశాడు.

"ఆ తర్వాత మూడో ఫోటో మరో భంగిమలో తీయడానికి సిద్ధమవుతున్నాం. సుకుమార్ యాంగిల్ చూసుకుంటున్నాడు. నేను కళ్ళు మూసుకొని పాట్‌కి

రెడీ అవుతున్నాను. ఇంతలో ఏదో చప్పుడైంది—ఛటుక్కున కళ్ళు తెరిచాను. తెరిచిన కళ్ళతో పైకే చూస్తూండిపోయాను! పైన—కప్పుమీద పెంకులు కదులుతున్నాయి. మొదట పిల్లి అనుకున్నాను. కానీ కాదు! సరిగ్గా నామీద వున్న పెంకు కదులుతూ జరగసాగింది. ....చూస్తూండగానే అది అమాంతం తొలగిపోయి రివాల్వర్‌తో ఒక చెయ్యి లోనికొచ్చింది!"

"ప్రొసీడ్!"

నరేష్ గుటకలు మింగాడు! "అది చూసి-అది చూసి-ఓహ్, నా భయం చెప్పలేను, మిస్టర్ లాల్! చచ్చినవాడిలా వుండిపోయాను! సుకుమార్‌ని హెచ్చరించే ధైర్యం చాల్లేదు! ఆ చెయ్యి రెండుసార్లు చిటికె వేసింది. అది విని సుకుమార్ పైకి చూశాడు. అంతే! రివాల్వర్ పేలింది! గుండు అతని గుండెలో దూరింది! గట్టిగా అర్చాడు! అప్పుడు నేను ప్రాణం వచ్చినవాడిలా లేచి పరిగెత్తాను. పరుగెత్తుకొంటూ హైవే మీద లిఫ్ట్ సంపాయించి యింటికొచ్చి పడ్డాను! హా—హమ్మయ్య! అంతే!"

"అంతేనా? అయితే ఈ బిజినెస్‌లో మీ కింకెవరు సహాయపడుతున్నారు?" అడిగాడు లాల్.

"ఇందులో మేం ముగ్గురమే వున్నాం—యింకెవరూ లేరు!"

"మరొకడున్నాడు—ఆచారి."

"ఆత నెవరు? నాకు తెలియదు."

లాల్ సూటిగా చూశాడు: "అబద్ధం చెప్పకండి, పోలీసుల కప్పగిస్తాను. మీరు కడపనుంచి ఆచారిని రప్పించి అతని సహాయం తీసుకున్నారు."

"ఆచారి యెవరో నాకు తెలియదు! అబద్ధం ఎందుకు చెప్పాలి?"

"మరి?"

"మిస్టర్ లాల్, మీకు మరొక విషయం చెప్పాలి. రెండు రోజులనుంచీ నన్నెవరో వెంటాడుతున్నట్టు అనుమానంగా వుంది. చాలాసార్లు నా కారువెనుక మోటార్ సైకిలు చూశాను. కానీ అతన్నెప్పుడూ స్పష్టంగా చూడలేదు. లావుగా వున్నాడు. అతనెవరో నన్ను గమనిస్తున్నా డనుకున్నాను. బహుశ అమ్మ అతన్ని నియమించిందేమో? అందువల్ల భయపడి ఈ పథకం కొన్నాళ్ళు వాయిదా వెయ్యాలనుకున్నాను. కానీ సుకుమార్ ఒప్పుకోలేదు—ఆ వెంటాడే వెధవ ముసలాడు, వాడికి భయపడే అవసరం లేదని బలవంతం చేశాడు. నాకు బెరుగ్గానే వుంది. ఏదో సందేహంగానే ఒప్పుకున్నాను....అనుకున్నట్టే అయింది!"

"సుకుమార్‌తో స్నేహం ఎప్పటి నుంచి?"

"రెండు నెలల నుంచి—అతనే పరిచయమయ్యాడు."

"యింత తక్కువ కాలంలోనే అంత బాగా నమ్మారా?"

"అతను వినయం గలవాడు—నిత్యమూ తిరుగుబోతుల్లో తిరిగేవాడ్ని, ఎవర్ని నమ్మాలో నాకు బాగా తెలుసు. నా అవసరం చెప్పాక ఈ పథకం సూచించింది అతనే!"

"పాల్?"

"అతను చాలా కాలంగా తెలుసు—కొన్నేళ్ళుగా."

"అయితే ఆ జాడీ యేమైందనుకొంటున్నారు?" అడిగాడు లాల్, కారును మలక్‌పేటవైపు త్రిప్పుతూ.

"అదే అంతుబట్టడంలేదు!"

"సుకుమార్ బుద్ధి ఎలాటిది?"

"అతనలా చెయ్యడు! అనవసరంగా అనుమానించకండి!"

"సరే, అతన్నెవరు షూట్ చేశారో అయిడియా వుందా?"

"నాకిప్పుడు ఏ అయిడియా లేదు! కాస్త కుదుటపడనివ్వండి!"

## 7

హయత్ నగర్‌లో, హైవేకు కుడివైపున, పూర్తిగా లోనికి వెళ్ళిపోయాక, విశాలమైన మైదానంలో, నిర్జనంగా వుండే ప్రదేశంలో ఒక చిన్న పెంకుటిల్లు వుంది. ఆ నగర శివార్లలోని పరిసరాలింకా అభివృద్ధి చెందలేదు.

పైన చంద్రుడు ప్రకాశిస్తున్నాడు-గాలి స్తంభించింది. స్మశాన నిశ్శబ్దం. అప్పటివరకూ అన్నీ నిర్జీవాకారాలతో, వెన్నెల్లో జలకాలాడుతోన్న ఆ పరిసరాలు లాల్, నరేష్‌ల రాకతో ప్రాణం పోసుకున్నాయి. కదలిక ప్రారంభమైంది.

లాల్ సిగరెట్ వెలిగించి నిలబడ్డాడు. నరేష్ భయం భయంగా చూస్తున్నాడు. ఒక్క చూపులో లాల్ యింటి స్థితిని గ్రహించి, నరేష్‌ని అక్కడే వుండమని చెప్పి మెట్లెక్కి వరండా చేరుకున్నాడు. ఇంటి తలుపు విశాలంగా తెరిచి వుంది. లోపల చిన్న స్టూలుమీద చిన్న లాంతరు వెలుగుతోంది.

లాంతర్ వెలుగులో నేల అస్తవ్యస్తంగా కనిపించింది. గది మధ్య ఒక కూజా, ఒక సీసా ఒలికిపోయి వున్నాయి. సీసాలోని ఎర్రటి ద్రవం కూజాలోని నీటితో

కలిసింది. విశాలమైన మడుగు ఏర్పడి, అందులోంచి అడుగుజాడలు ద్వారంవైపుకు వస్తూ కన్పించాయి.

లాల్ కళ్ళు విశాలంగా చేశాడు. లోనికెళ్ళి గదిని పరికించాడు. ఎవరూ లేరు. నేలమీద కూజా ఒలికిన చోటుకి కొంత దూరంలో—ద్వారం దిశలో—రెండు ఎర్రటి, చిక్కటి ద్రవంతో కూడిన చిన్న చిన్న మడుగులు, సుమారు ఒక అడుగు ఎడంగా ఒక దానిముందు ఒకటి వున్నాయి.

లాల్ తలెత్తి పైకి చూశాడు. పైన కప్పుమీద ఒక పెంకు తొలగి వుంది.

లాంతరు అందుకొని లాల్ అడుగుజాడల్ని అనుసరించాడు. అవి వరండాలోకొచ్చి మెట్ల దగ్గర అంతమయ్యాయి. లాల్ చూపుడు వేలితో వాటిని తాకి చూశాడు. పచ్చిగా వున్నాయి, ఇంకా ఆరలేదు.

నరేష్ గాభరాగా ముందుకొచ్చాడు.

"వెల్, మీ సుకుమార్ యిక్కడ లేడు" అన్నాడు లాల్.

"ఏమిటీ!" నరేష్ నోరు తెరిచాడు.

"ఇలా వెళ్ళిపోయాడు—చూస్తున్నారా? ఈ అడుగుజాడల్ని బట్టి చూస్తే అతను వెళ్ళి కొన్ని నిమిషాలు మాత్రమే అయింది...."

"ఏమిటి మీ రనేది? అతను చచ్చాడు!"

"ఆ దెబ్బ అతనికి సరిగా తాకి వుండకపోవచ్చు."

"ఆ దెబ్బ అతని గుండెలో తాకింది!" అన్నాడు నరేష్.

"సరిగా చూశారా? కుడివైపు ఛాతీలో తగల్లేదు కదా!"

"లేదు! నేను సరిగ్గా చూశాను! సందేహం లేదు—"

"అయితే అతను లేచి ఎలా వెళ్ళాడు?" లాల్ చుట్టూ చూశాడు. వెన్నెల్లో, కనుచూపు మేరలో కదిలి వెళ్తున్న ఆకారమేదీ కన్పించలేదు.

"అతను వెళ్ళి కొన్ని నిమిషాలే అవుతోంది—ఇంకా రోడ్డు చేరుకొని వుండడు! కమాన్, గాలిద్దాం!"

లాల్ డోర్ తెరిచి కారెక్కబోయి ఆగిపోయాడు. దూరంగా హెడ్ లైట్స్ వేగంగా సమీపిస్తూ కన్పిస్తున్నాయి.

"ఓహ్, పోలీస్!" అన్నాడు నరేష్.

లాల్ కాచుకున్నాడు.

మూడు నిమిషాలు గడిచాక ఒక పోలీస్ కారు, జీపు ఆంబులెన్స్ వచ్చి ఆగాయి.

కారులోంచి క్రైం ఇన్ స్పెక్టర్ గవాస్కర్, ఇద్దరు సబ్ ఇన్ స్పెక్టర్లు దిగారు.

జీపులోంచి నిపుణుల సిబ్బంది నలుగురు కానిస్టేబిల్స్ దిగాక, ఆంబులెన్స్‌లోంచి డాక్టర్ రఘునాథ్, ఇద్దరు స్ట్రెచర్ బేరర్లు దిగారు.

"హల్లో లాల్!" గవాస్కర్ కరచాలనం చేశాడు, "మీ పార్ట్‌నర్ పంపాడు."

"దటీజ్ రైట్, కానీ ఇక్కడ శవంలేదు" అన్నాడు లాల్.

"ఏమైంది?"

"అతను చావలేదు, లేచి వెళ్ళిపోయాడు...."

"ఎక్కడికి?"

"బహుశ యే హాస్పిటల్‌కో—" లాల్ మళ్ళీ అన్నాడు, "ఇన్ స్పెక్టర్, నడిచి రోడ్డు చేరుకోడానికి

మామూలు మనిషికి పావుగంట పడుతుంది. అతను గాయ పడ్డాడు గనుక అరగంట పట్టిందనుకొన్నా—నరేష్ యింటికి వచ్చి, తిరిగి నాతో యిక్కడికి రావడానికి గంటకు పైగానే పట్టింది. సుకుమార్ సిటీ చేరడానికీ సమయం చాలు. ఏమంటారు?

"లేదా అతనింకా రోడ్డుమీద లిఫ్ట్‌కోసం ఎదురు చూస్తుండవచ్చు. లేక దారిలోనే ఎక్కడైనా పడిపోయి వుండవచ్చు.... వెంటనే మీరు మనుషుల్ని పంపి వెతికించండి!"

గవాస్కర్ ఇద్దరు సబ్ ఇన్‌స్పెక్టర్లకి ఆదేశాలిచ్చాక మళ్ళీ అన్నాడు లాల్:

"ఒకర్ని సిటీకి పంపండి. హాయత్ నగర్ ఫిల్లింగ్ స్టేషన్ దగ్గర సిటీకి వచ్చే వాహనాల్ని చెక్ చేయమనండి. సుకుమార్ పొట్టిగా, లావుగా, తెల్ల షర్టు—గ్రేకలర్ ప్యాంటులో వుంటాడు. మెళ్ళో కెమెరా వుండవచ్చు. హెడ్ క్వార్టర్స్‌కి రేడియో మెసేజ్ పంపి, ఏ హాస్పిటల్ నుంచైనా బుల్లెట్ గాయం తగిలిన పేషంట్ గురించి ఏ పోలీస్ స్టేషన్‌కి రిపోర్టు అందినా, వెంటనే అతని స్టేట్‌మెంట్ తీసుకొని, తెలియజేయమనండి. క్విక్!"

గవాస్కర్ ఇన్‌స్పెక్టర్స్‌తో గబగబ మాట్లాడి, యిద్దరు కానిస్టేబిల్స్‌ని వాళ్ళతో పంపి, "డన్!" అన్నాడు.

"వెల్, ఇక లోనికెళ్దాం" అన్నాడు లాల్.

కానిస్టేబిల్స్ వెలిగించిన పెట్రోమాక్స్‌తో అందరూ యింట్లోకి నడిచారు. నరేష్‌ని బయటే నిలబెట్టారు. లోనికెళ్ళాక లాల్ సంఘటన జరిగిన పరిస్థితిని వివరించాడు. డాక్టర్ గది నంతటినీ కలయజూసి అన్నాడు:

"మీరు చెప్పిన సంఘటన జరిగిన పద్ధతినిబట్టి ఆలోచిస్తే బుల్లెట్ గుండెను తాకివుండదనిపిస్తోంది. అతను పైన రివాల్వర్‌ని చూసి, బెదిరి ప్రక్కకు తొలగి వుండాలి. నేలమీద రక్తం మడుగులు అతను జరిగిన దిశను సూచిస్తున్నాయి—పైన పేంకు తొలగిన భాగానికి ఎడమవైపు. అందుకే ఎడమవైపు గుండెకేసి గురిపెట్టి వున్న రివాల్వర్ షాట్, అతను జరగడంతో స్థానం మారి ఛాతీలో కుడివైపు తాగింది. ఇక నేలలో రక్తం మడుగులు చూడండి. వాటి మధ్య దూరం గమనించండి. సుమారు ఒక అడుగు లోపు. ఆ రెండు మడుగుల్లో ఒకటి ఛాతీనుంచి ప్రవహించిన రక్తం. రెండవది—జాగ్రత్తగా చూడండి—కడుపులోంచి, లేదా వీపులోంచి ప్రవహించిన రక్తం!"

"ఎలా చెప్తున్నారు? రెండూ ఒకే గాయం నుంచి ఎందుకు ప్రవహించకూడదు? అతను బాధ భరించలేక ఎందుకు దొర్లకూడదు?" అన్నాడు గవాస్కర్.

"ఆహ్, ఇన్‌స్పెక్టర్! సరిగా చెప్పారు. కానీ, అతను దొర్లినప్పుడు గాయంనుంచి స్రవిస్తున్న రక్తం అతని మార్గాన్ని ముగ్గు వేస్తుంది. అవునా? ఇక్కడలాంటిది లేదు. రెండు మడుగులు విడి విడిగా, స్పష్టంగా, ఒకదానితో ఒకటి కలిసిపోకుండా వున్నాయి" అన్నాడు డాక్టర్.

"వెరీ వెల్! అయితే మొదటిది పాయింట్ ఆఫ్ ఎంట్రీ, రెండవది పాయింటాఫ్ ఎక్సిట్. కాబట్టి బుల్లెట్ దేహం నుంచి బయటపడి గదిలో...." లాల్ యింకా మాటలు పూర్తిచేయకముందే, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్ కుర్చీ క్రిందనుంచి బుల్లెట్ తీసి అందరికీ చూపిం

చాడు.

"గుడ్!" అన్నాడు లాల్, "దాన్ని ఇన్‌స్పెక్టర్‌కివ్వండి. గవాస్కర్, నేను మీకో బుల్లెట్ పంపిస్తాను. ఆ రెండూ ఒకే రివాల్వర్‌నుంచి వెలువడ్డాయో లేదో కనుక్కోండి.

"మీ దగ్గర బుల్లెట్‌తో దీనికేం సంబంధం?"

"ఇందాక నామీద దాడి జరిగినప్పుడు ఆ బుల్లెట్ కార్లో దొరికింది. జాగ్రత్తగా దాచాను. నామీద దాడి జరిపిన మనిషే ఈ హత్యకు పూనుకున్నాడని—లేదా కనీసం అదే రివాల్వర్ (ఇక్కడ) ఉపయోగించబడిందేమోనని నా అనుమానం. దట్సాల్."

"ఆల్ రైట్, మిస్టర్ ఇస్కిందర్‌కు అప్పజెప్తాను" అన్నాడు గవాస్కర్.

లాల్ తలూపాడు, "ఇక ఈ అడుగుజాడలు—అతను క్రిందపడ్డాక నీళ్ళ కూజానూ, కెచప్ బాటిల్‌నీ తన్నేసి వుండాలి. ఆ రెండూ కలిసిన మిశ్రమంలో అతని కాళ్ళు తడిశాయి. ఆ తర్వాత లేచి వెళ్తున్నప్పుడు ఈ అడుగుజాడ లేర్పడ్డాయి. వీటిలో కొన్ని కాళ్ళు ఈడుస్తూ నడిచినట్లు సూచిస్తున్నాయి. కాబట్టి అతను తూలుతూ వెళ్ళాడు. కనుక ఆ తలుపుల్ని ఆధారంగా పట్టుకొని గడప దాటి వుంటాడు. వాటి మీద వేలి ముద్రలు తీయండి!"

"అలాగే సర్!" అన్నాడు వేలి ముద్రల మనిషి.

లాల్ ఆవులించి అన్నాడు, "ఇన్‌స్పెక్టర్, మిగిలిన పన్లు మీరే చూసుకోండి. ఈ రోజు నేను చాలా అలసిపోయాను, ఇంటికి కెళ్తాను."

గవాస్కర్ తలూపాడు.

"మీరొక పని చెయ్యాలి," మళ్ళీ అన్నాడు లాల్, "ఒక మోటార్ సైకిల్‌ను ట్రేస్ చెయ్యాలి."

"చెప్పండి."

లాల్ ఆచారి మోటార్ సైకిల్ నెంబర్ చెప్పాడు.

"ఈ పని మీరు వెంటనే చెయ్యాలి. ఇందులో మరొక అనుమానితుడున్నాడు. పేరు పాల్. సనత్‌నగర్‌లో వుంటాడు," అని అడ్రసు చెప్పి అన్నాడు లాల్, "అతన్ని వెంటనే కస్టడీలోకి తీసుకొని ఇంటరాగేట్ చెయ్యండి. బుల్లెట్ దెబ్బతిన్న సుకుమార్ గురించి ఆచూకీ తెలిస్తే నన్ను డిస్టర్బ్ చెయ్యడానికి సందేహించకండి!"

# 8

ఉదయం 9 గంటలు.

డిటెక్టివ్‌లు ఆఫీసుకు చేరుకున్నాక పది నిమిషాల తర్వాత గవాస్కర్ ఫోన్ చేశాడు.

"మిస్టర్ లాల్, అయాం సారీ! రాత్రినుంచీ బిజీగా వున్నాను. రాత్రంతా పాల్ కోసం గాలించాం. అతని జాడలేదు. ఇంటికి తాళం వుంది. ఇప్పుడు సార్జెంట్ అక్కడ నిఘా వున్నాడు. ఆ గొడవలో మీ మోటర్ సైకిల్‌ని ట్రేస్ చెయ్యలేకపోయాను. క్షమించండి, ఆ పనికి ఇప్పుడే పురమాయించాను.

"ఓకే, మిస్టర్ లాల్. ఇప్పుడు అసలు విషయం: చావు కబురు చల్లగా చెప్తున్నానని అరవకూడదు— యీ ఉదయం యేడు గంటలకి మేం సుకుమార్‌ని చూశాం."

లాల్ ముందుకి వంగాడు, "సజీవంగా?"

"నో, నిర్జీవంగా. సనత్‌నగర్ దగ్గర రైల్వే ట్రాక్

మీద. మిస్టర్ లాల్, అతను ట్రైను క్రింద పడి ముక్క లయ్యాడు! చేతులు, తల తెగిపోయాయి. వెంటనే శవాన్ని మార్చ్యురీకి పంపాం. త్వరలో పోస్టుమార్టమ్ ప్రారంభమవుతుంది—"

"అతను సుకుమారేనా?"

"ఎస్, మీరు చెప్పిన ఆనవాలే గాక, మెడలో కెమేరా కూడా వుంది. ఛాతీలో, కడుపులో, రెండు బుల్లెట్ రంధ్రాలున్నాయి. అతని జేబులో ఒక రివాల్వర్ వుంది—"

"రివాల్వరా?"

"ఎస్, అందులో నాలుగు బుల్లెట్స్ ప్రేల్చబడ్డాయి. ఆ రివాల్వర్ మీద హంతుని వేలిముద్రల కోసం పరీక్షిస్తున్నాం. అలాగే మీ రిచ్చిన బుల్లెట్స్‌నీ, హత్యాస్థలంలో దొరికిన బుల్లెట్ నీ, ఈ రివాల్వర్ తో టెస్టు బుల్లెట్స్ పరీక్షలు జరిపి పోల్చి చూస్తాం—

"ఇక మరో సంగతి వినండి: ఈ ఉదయం సుల్తాన్ బజార్ స్టేషన్‌నుంచి ఒక రిపోర్టు అందింది. నిన్న రాత్రి 11 గంటలకి ఒక కారతను స్టేషన్‌కొచ్చి రిపోర్టిచ్చాడట. అతను విజయవాడనుంచి వస్తోంటే రాత్రి హయత్ నగర్ ప్రాంతాల ఒక వ్యక్తి కారు ఆపి లిఫ్ట్ కావాలని అడిగాడట. అతని ఒళ్ళంతా రక్తం, మెడలో కెమేరా—కారతను భయపడి ఒప్పుకోలేదు.

ఆగంతకుడు రివాల్వర్ తీసి బెదిరించాడట. అర్జంటుగా సనత్ నగర్ కి చేర్చమన్నాడట. కారతను పూర్తిగా హడలిపోయి ఎక్కించుకున్నాడట. కానీ, ఆ గాయపడ్డ మనిషి మనసు మార్చుకొని కోఠిలోనే దిగి వెళ్ళిపోయా

డట. కారతను వెంటనే పోలీసుల్ని కలుసుకొని చెప్పాడు. కానీ ఆగంతకుడ్ని అలాటి పరిస్థితిలో ట్రేస్ చెయ్యడం సాధ్యం కాలేదు...."

"ఐ. సీ."

"మిస్టర్ లాల్, సుకుమార్ ఆ స్థితిలో కోతినుంచి పాల్ కోసం సనత్ నగర్ వెళ్ళి వుండాలి. కానీ, నీరసం కమ్మి పట్టాలమీద పడి తెలివి తప్పాడు—అతని మీద ట్రైను ఎక్కేసింది."

"కానీ, అతని జేబులో రివాల్వర్ కు ఎక్స్ప్లనేషన్ ఏమిటి?"

"ఆ రివాల్వర్ అతనిదే అయితే దానిమీద వేలి ముద్ర లుంటాయి. ఆ బుల్లెట్స్ దానితోనే షూట్ చేయ బడి వుంటే మాత్రం వ్యవహారం గజిబిజి అవుతుంది."

"వెల్, ఇన్స్పెక్టర్. ఆలస్యంగానైనా మీరు చాలా విషయాలు తెలియజేశారు. నేను చెప్పిన మిగతా పని కూడా చెయ్యండి."

లాల్ రిసీవర్ పెట్టేసి జాన్ కు వివరాలు చెప్పాడు.

జాన్ ఆసక్తిగా విని అన్నాడు, "సుకుమార్ కోతిలోనే ఎందుకు దిగిపోయాడు? ఒకవేళ ఉనికిని కాపాడు కోవడానికి దిగినా, అక్కడ నుంచి ఆటోలో సనత్ నగర్ వెళ్ళవచ్చుగా?"

"ఆటోలోనే వెళ్ళివుండాలి. దాన్ని సనత్ నగర్ సమీపంలో వదిలేసి అడ్డదారిన—కాలినడకన రైలుకట్ట మీదుగా వెళ్ళబోయాడు—"

"ఎందుకలా చేశాడు?"

"పాల్ ని ఆశ్చర్యపర్చడానికి. తన్ని షూట్ చేసింది అతనే అనుకొని వుండాలి—పాల్ వాళ్ళ ప్లానులకు

గుడ్ బై కొట్టి వెళ్ళిపోయాడు. అతను సుకుమార్ నికూడా బలవంతం చేసివుండాలి. కానీ సుకుమార్ ఒప్పుకోక పోవడంవల్ల, ఆ ఈర్ష్యతో షూట్ చేశాడని అక్కడి కెళ్ళాడు. హంతకుడు పై కప్పులోంచి షూట్ చేసినప్పుడు రివాల్వర్ జారి పడివుండాలి. సుకుమార్ దాన్ని తీసు కొని పొరపాటు అభిప్రాయంతో పాల్ ఇంటికి బయలు దేరి చావు తెచ్చుకున్నాడు."

"కానీ యే హంతకుడూ రివాల్వర్ ని హత్యాస్థలంలో వదలడు!"

"వదలక తప్పని పరిస్థితి ఏదో వచ్చి వుంటుంది. వెల్, ఈ వ్యవహారంలో ఒక అదృశ్య హస్తముందని సుకుమార్ కు తెలియదు: ఆచారి. ఆచారి కిరాయి హంత కుడు. అతన్ని వాడుకుంటున్న మనిషి యిక్కడెవరో వున్నాడు."

"ఎవరు? నరేష్?"

"ఏమో! ఆ జాడీని ట్రేస్ చేస్తే ఎవరైనదీ బయట పడుతుంది. నరేష్ స్నేహితులతో క్షుణ్ణంగా గాలించా నన్నాడు. దొరకలేదు. ఏమైనట్టు?"

"అతను అబద్ధమాడి వుండవచ్చు."

ఈ మాటలు లాల్ విన్నేను. అతని కళ్ళు ఒక్క సారిగా మెరిశాయి.

"జాన్! ఇప్పు డర్థమవుతోంది! ఆ చెరువుకి ఎక్క డైనా తూము వుందా?"

జాన్ తికమకగా చూశాడు.

"గుర్తులేదు. దేనికి? ఆ జాడీ అందులోంచి కొట్టుకు పోయిందా?"

లాల్ మాట్లాడలేదు. ఆలోచనల్లో పడ్డాడు. జాన్

యిక ఆ విషయం పట్టించుకోకుండా పత్రిక తిరగేయ సాగాడు.

అరగంట తర్వాత గవాస్కర్ ఫోన్ చేసి మోటార్ సైకిల్ వివరాలు చెప్పాడు. వాటి ప్రకారం దాని యజమాని రామస్వామి అనే మెకానిక్. రాం నగర్‌లో వుంటాడు.

"జాన్! ఈ మెకానిక్‌ను వెంటనే పట్టుకో!" అనర్చి నిట్టూర్చాడు లాల్.

జాన్ నిష్క్రమించాక తిరిగి ఆలోచనలో పడ్డాడు.

సరిగ్గా ఒంటిగంటా నలభై నిమిషాలకి గవాస్కర్ బ్రీఫ్ కేసు చేతబట్టి లోని కొచ్చాడు. లాల్‌ని విష్ చేసి కుర్చీలో కూలబడ్డాడు.

"వెల్?" లాల్ అన్నాడు.

"జెట్ స్పీడుతో పని పూర్తి చేయించాను! పోస్టు మార్టమ్ పూర్తయింది. ఇంకా రిపోర్టు తయారుకాలేదు. చావు బుల్లెట్ వల్ల సంభవించలేదు. విన్నారా? బుల్లెట్ మార్గం ఛాతీనుంచి వూపిరితిత్తిని రాసుకుంటూ క్రిందికి వెళ్ళి, పెద్దప్రేగును గాయపరుస్తూ, పొత్తికడుపునుంచి బయటకు వుంది. మరణకాలం ఇదమిద్ధంగా చెప్పడం సాధ్యం కాలేదు. రాత్రి 12 నుంచి తెల్లవారుఝామున 5 వరకు ఎప్పుడైనా కావచ్చు. గాయం తగిలిన స్థితిలో అతను చాలా దూరం శ్రమ తీసుకొని ప్రయాణించడంవల్ల నీరసం కమ్మి రైల్వే ట్రాక్ మీద పడిపోయాడు. మరిక లేవలేదు."

"వెల్, రివాల్వర్ గురించేమిటి?"

"దాని లైసెన్స్ వివరాలు మా దగ్గర లేవు. పర రాష్ట్రానికి చెందిందై వుండాలి. దానిమీద వేలిముద్రలు

హంతునివి కావు. అలాంటి వేలిముద్రలు ఈ కేసులో మా కెక్కడా లభించలేదు. ఆ రెండు బుల్లెట్స్ ఈ రివాల్వర్ లో నుంచే వెలువడ్డాయి."

గవాస్కర్ బ్రీఫ్ కేసులోంచి రెండు మైక్రో ఫోటో గ్రాఫ్స్ తీసి చూపించాడు.

లాల్ వాటిలో బుల్లెట్స్ సారూప్యతను గమనించి తలూపాడు.

గవాస్కర్ మరో రెండు ఫోటో లందించాడు.

"ఇవి హంతుని మెడలో కెమెరా లోనివి. అక్సిడెంట్ లో అది దెబ్బతినలేదు. కొత్త రోల్, రెండు స్నాప్స్ తీయబడ్డాయి."

ఆ ఫోటోల్లో నరేష్ వెల్లకిలా (కెచప్ జల్లుకొని) పడివున్నాడు.

గవాస్కర్ మరో ఫోటో అందించాడు.

"ఇది మేం ఆ యింట్లో నేలమీద దృశ్యాన్ని తీసిన ఫోటో."

అందులో కూజా, కెచప్ సీసా, రెండు రక్తపు మడుగులు మొదలైనవి వున్నాయి.

"దట్సాల్, మిస్టర్ లాల్" అన్నాడు గవాస్కర్, "గంట క్రితం పాల్ ఇంటికొచ్చాడు. పూర్తి అమాయకత్వాన్ని ప్రదర్శించాడు. అతని అమాయకత్వాన్ని రూఢీ చేసుకొని మరీ వదిలాం. ప్లాను నచ్చక, ఏదో కీడు నాశించడంవల్ల రాత్రంతా అతను అంబాసిడర్ హోటల్ లో గడిపాడు."

"బుద్ధిమంతుడు."

"ఇప్పుడేం చెయ్యాలి?"

"ఈ కేసు గురించి మర్చిపొండి!"

"మర్చిపోయి....?"

"మీ ఇతర కేసులు చూసుకోండి. ఈ కేసుకి పరిష్కారం మా దగ్గర వుంది. త్వరలో పరిష్కరించి, పువ్వుల్లో పెట్టి మీ కందిస్తాం" అన్నాడు లాల్.

"అలాగే. అయితే మరొక విషయం: మీరు చెప్పిన తలుపు మీదా, గడప మీదా సుకుమార్ వేలి ముద్రలు లేవు!"

# 9

మధ్యాహ్నం రెండుగంటలకు జాన్ తిరిగివచ్చాడు.

"ఏమి టింత ఆలస్యం?" లాల్ అడిగాడు అసహనంగా.

"ఆటంబాంబు! ఏమిటో చెప్పుకో చూద్దాం?"

"నెవర్ మైండ్! దాన్ని నా నెత్తికేసి కొట్టు!"

జాన్ కుడిచేతిని అరపిడికిలి బిగించి, బౌలింగ్ చేస్తున్నట్టు ముందుకు విసిరి అన్నాడు: "మిస్టర్ ఆచారికి రామస్వామి దగ్గర నందనరావ్ మోటార్ సైకిల్ అద్దెకి ఇప్పించాడు."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి, "నిజం?"

"నూరుపాళ్ళు! నందనరావ్ మిసెస్ నళిని బిజినెస్ మేనేజర్. ప్రస్తుతం అతను ఆఫీసులో ఫైలు చూస్తున్నాడు. ఆచారి జాడలేదు. మోటార్ సైకిల్ తిరిగి యిచ్చేశాడు."

"పార్ట్‌నర్! యింకా చూస్తా వేమిటి? మిలావో హాత్!"

జాన్ చెయ్యి అందించాడు. లాల్ అందుకొని నలిపేశాడు.

భూటాన్ విస్కీ బాటిల్ మూత ఎగిరిపడింది. ద్రవం

గ్లాసులో ఒలికింది. రెండు గ్లాసులు చప్పుడు చేశాయి:
"ఛీర్స్!"

"వెల్, లాల్! ఈ మహానుభావుడు ఇందులో ఎలా యిరికాడు?"

"అదే మనం తెలుసుకోబోతున్నాం. సుకుమార్‌ని ఆచారి షూట్ చేశాడు. ఎందుకు? మనమీద హత్యా ప్రయత్నం విఫలమైంది గనుక! ఇప్పుడు మోటివ్ అర్ధమవుతోందా?"

"అంటే—అతను సుకుమార్ నోరు నొక్కాలనుకున్నాడా?"

"దట్స్ రైట్. సుకుమార్ రావ్ మనిషి. నువ్వతని ఫోటో తీశావు. అతను పట్టుబడితే ఏమవుతుంది? అందుకే అతన్ని చంపారు."

ఆ తర్వాత గంటసేపు డిటెక్టివ్‌లు తర్కించుకున్నారు, వాదించుకున్నారు, మొదటినుంచీ కేసుని కూలంకషంగా చర్చించుకున్నారు. చివరికి ఒక తీర్మానాని కొచ్చి, తారెక్కి సరూర్‌నగర్ బయలుదేరారు.

సరూర్‌నగర్‌లో లాల్ చెరువుకట్ట వెంబడి నడుస్తోంటే, జాన్ నిన్నటి సంఘటన తిరిగి వర్ణించసాగాడు. లాల్ తలూపుతూ వింటున్నాడు. అయిదు నిమిషాల తర్వాత ఒకచోట ఆగిపోయి దూరంగా చూపించాడు:

"అటు చూడు! తూము! కన్పిస్తోందా?"

జాన్ చూశాడు, "అబ్సర్డ్! ఎలా వూహించావు?"

"కమాన్!" లాల్ పరుగులాంటి నడకతో ముందు కెళ్ళాడు. జాన్ వెంబడించాడు. మూడు నిమిషాల్లో యిద్దరూ తూర్పుదిక్కున తూము చేరుకొన్నారు. తూము లోంచి నీళ్ళు అవతల చిన్న కాలువలోకి పారడంలేదు.

తలుపు దించి వుంది. కానీ, కాలువలో ఇంకా ఇంకని రెండంగుళాల లోతు నీళ్ళు నిలిచివున్నాయి. ఇద్దరూ అవతలివైపుకు దిగి చూశారు. నేల మెత్తగా వుంది. కాలువ గట్టు వెంబడి కొన్ని అడుగుజాడలు గజిబిజిగా కన్పించాయి. జాన్ వాటిని ఫోటోలు తీశాడు.

"చూడు!, కాలువలో నీళ్ళున్నాయి!" అన్నాడు లాల్.

"ఇవి ఇటీవలే పారాయి! అంటే తలుపు తెరవబడిందన్నమాట!" అన్నాడు జాన్.

"దటీజ్ రైట్, కమాన్!"

"ఎక్కడికి?"

"హాయత్ నగర్!"

ఇద్దరూ కారెక్కి హాయత్ నగర్ యింటికి చేరుకున్నారు. అక్కడ అడుగుజాడలు ఆరిపోయి స్పష్టంగా అగుపిస్తున్నాయి. లోనికెళ్ళి గది నేలను పరిశీలించారు. గచ్చు ఒక్కచోటే పగిలి వుంది—గదిమధ్య.

తిరిగి బయటికొచ్చి మైదానంలో తేరిపార చూశారు. ఇంటి వెనుక దూరంగా చిన్న పాక కన్పిస్తోంది.

"అటు చూడు! అదే మన చివరి మజిలీ!"

ఇద్దరూ వేగంగా నడిచారు. కొంతదూరం వెళ్ళాక ఎర్ర నేల అంతమై, ఇసుక నేల ప్రారంభమైంది. అయిదు నిమిషాల్లో పాక చేరుకున్నారు. అది పశువులకొట్టంలా వుంది. దానిముందు ఇసుకలో టైర్ ప్రింట్స్ కన్పించాయి. రెండు సమాంతరంగా వెళ్తున్న ట్రాక్స్ మధ్య ఒకటి వంకర టింకరగా వున్న ట్రాక్.

"ఇక్కడ కారు వెనుక మోటార్ సైకిల్ వచ్చింది" అన్నాడు లాల్.

"లేదా-మోటార్ సైకిల్ వెనుక కారు వచ్చివుండాలి" అన్నాడు జాన్.

లాల్ యెగాదిగా చూశాడు: "సి తెలివి మండి పోను!"

జాన్ నవ్వి ట్రాక్స్‌నీ, పాకనూ స్నాప్స్ తీశాడు.

లాల్ లోనికి నడిచాడు, లోపల నేల గట్టిగా వుంది. .... పేడ వాసన వస్తోంది. నేలమీద చిందరవందరగా సిగరెట్ పీకలున్నాయి.

లాల్ ఒక్కో పీక కర్చీఫ్ లో వేస్తూ, "వీటి ప్రత్యేకత ఏమిటి?" అన్నాడు.

"అన్నీ ఒకే బ్రాండ్‌వి. సగం కాల్చినవి. మహానుభావుడు చాలా అసహనంగా పీల్చిపారేశాడు!" అన్నాడు జాన్.

లాల్ లేచి నిలబడ్డాడు, "వెల్, లెటజ్ గో!"

"ఇప్పుడెక్కడికి?"

"మహానుభావుడి దర్శనానికి!"

# 10

నందనరావు యెడతెగని ఆలోచనలతో ఫైళ్ళను పరధ్యానంగా చూస్తూ సిగరెట్ తాగుతున్నప్పుడు ఇంటర్‌కంలో సెక్రటరీ యిద్దరు డిటెక్టివ్‌లు వచ్చినట్లు ప్రకటించింది.

రావ్ ఉలిక్కిపడి, "వాళ్ళెవరు, సరళా డార్లింగ్?" అన్నాడు.

"లాల్ అండ్ జాన్ అంటున్నారు—"

రావ్ మరోసారి ఉలికిపడి, "ఇప్పుడు వీలుకాదని చెప్పు! నాకు తీరికలేదు! నాకిప్పుడు కుదరదు!" అనర్చి, గబగబ ఫైలు తిరగేయసాగాడు.

కొన్ని క్షణాల తర్వాత హఠాత్తుగా స్వింగ్ డోర్ తోసుకొని డిటెక్టివ్‌లు ప్రవేశించారు. వాళ్ళ వెనక సెక్రటరీ పరిగెత్తికొచ్చింది: "సర్ — సర్ —"

జాన్ ఆమెని వెనక్కి నెట్టాడు, "టేకిట్ ఈజీ, బేబీ! మీ బాస్ మమ్మల్నేమీ కరవడు!"

లాల్, రావ్ దగ్గరి కెళ్ళి నిలబడ్డాడు. రావ్ పూర్తిగా పాలిపోయిన ముఖంతో ప్రాణంలేనివాడిలా కన్పించాడు.

"మిస్టర్ రావ్, మీతో చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి."

"ఏం మాట్లాలి....?" రావ్ గొంతు బలహీనంగా వుంది.

లాల్ కూర్చొని జాన్‌ని చూశాడు. జాన్ కూడా కూర్చొని తలూపాడు.

లాల్ అన్నాడు: "సుకుమార్ ట్రాజెడీ గురించి. అతనెవరో మీకు తెలియదని చెప్పకండి! నరేష్ ఫ్రెండ్, పూర్ ఫెలో. రాత్రి రైలుక్రింద ముక్కలయ్యాడు. ఘోరమైన చావు!"

రావ్ సిగరెట్ వెలిగించి ధైర్యం పుంజుకున్నాడు.

"కానీ అతని చావుగురించి నాకెందుకు చెప్తున్నారో అరంగావటంలేదు!"

"ఎందుకంటే అతను మీ మనిషి కాబట్టి!"

"మీరు పొరబడ్డారు. అతనెవరో నాకు తెలియదు...."

"అవును, మీ రప్పుడే ఒప్పుకోరు. ముందు ఆచారి గురించి మాట్లాడుకుందామా? అతనెక్కడున్నాడిప్పుడు?"

రావ్ చేతిలో సిగరెట్ జారిపడింది. అవాక్కయి పోయాడు.

లాల్ నవ్వాడు. "అతను కూడా తెలియదంటారా? వెల్, వారం క్రితం అతన్ని పిలిపించి ఈ పథకం ఆలోచించారు. ఈ కంపెనీలో మీరు యెన్నో ఏళ్ళుగా మంచి హోదాలో వున్నా, మీకు తీరని డబ్బు దాహం వుంది. అదే మీ చేత ఇన్ని దారుణాలు చేయించింది....

"మిసెస్ నళిని భర్తకు మీరు నమ్మకస్తులుగా బాగా పేరు తెచ్చుకున్నారు. మీమీద ఆ విశ్వాసంతోనే ఆమె భర్త వ్యవహారాలు మీకు అప్పగించబడ్డాయి. ఆమె కుమారుడు ఆమెకో సమస్యగా పరిణమించాడు. వెల్, మీ రెంటో నమ్మకస్తులుగా పేరు తెచ్చుకున్నారు. కానీ, కాలంతోబాటు గుణాలూ మారుతాయి. గతంలో ఎన్ని కట్టుబాట్లను పాటించినా, ఈ కలియుగంలో పోటీ బ్రతుకును ఎదుర్కోవడానికి అవినీతినీ, అన్యాయాక్రమాల్నీ ఆయుధాలుగా చేపట్టక తప్పదు! ఎంత మడి గట్టుకున్నవాళ్ళైనా అధికారం, స్వేచ్ఛ, చేతికొస్తే సులువుగా వాటికి లొంగిపోతారు: మీ చేతికి అధికారం, స్వేచ్ఛ లభించాయి.

"నే నిప్పుడు కంపెనీ వ్యవహారాల్లో మీ అవకతవకల జోలికి పోవడంలేదు. అలాటివి జరుగుతున్నాయని కూడా మా కనుమానం లేదు. పైగా అది ఈ కేసుతో సంబంధం లేని విషయం. అయితే నరేష్ విశృంఖలత్వాన్ని ఆధారం చేసుకొని మీరు ప్రయోజనం సాధించాలనుకున్నారన్నది మాత్రం నిశ్చయం!

"నరేష్ విచ్చలవిడిగా తిరుగుతాడు. ఖర్చు చేస్తాడు. అలాటివాడు ఏవో చిక్కుల్లో ఇరుక్కోవడమో, లేక

కావాలని కల్పించుకోవడమో జరుగుతుంది. మొదటిది ప్రమాదంలోకి దారి తీస్తే, రెండవది ప్రయోజనం చూపించవచ్చు. ఏదైనా మీ ప్రయోజనాని కొకటే. అందుకే సుకుమార్‌ని నరేష్‌మీద గూఢచారత్వం నెరప డానికి నియమించారు. సుకుమార్ నరేష్‌కు చిరకాల మిత్రుడేమీ కాదు—రెండు నెలల క్రితం మామూలు పరిచయం గాఢ స్నేహంగా మారింది. అతను మీ మనిషి."

రావ్ నవ్వాడు. "బాగుంది, ఇంకా?"

"అతను నరేష్‌కు నీడలా వుంటూ కనిపెడుతున్నాడు. ఎప్పటికప్పుడు మీకు రిపోర్ట్సు యిస్తున్నాడు.... మీరు డబ్బు పారేస్తున్నారు. వెల్, పదిరోజుల క్రితం నరేష్ ఒక హోటల్ డాన్సర్‌తో స్నేహం చేసి క్రమంగా ప్రేమలో దిగాడు. ఆమె వ్యామోహంలో భార్యనూ, తల్లినీ త్యజించి దూరంగా వెళ్లిపోవా లనుకున్నాడు. డబ్బు అవసరం. చిన్న మొత్తాలో యివ్వడానికి తల్లి తిరస్కరించదు. ఆఫ్టాల్ అది పాకెట్ మనీ—కానీ దూరప్రాంతాలకు వెళ్లి కొత్తవాళ్ళ మధ్య వుండాలంటే ఒకేసారి యెక్కువ మొత్తం కావాలి. అంత మొత్తం తల్లి యివ్వదు. ఇంకెవరూ అతన్ని చూసి ఇవ్వరు. అందుకే డాన్సర్‌తో పారిపోవడానికి యాభైవేల రూపాయల కోసం సుకుమార్‌తో అతనీ పథకం వేశాడు: ఫేక్ కిడ్నాప్. అది మీకు తెలుసు.

"ఇన్నాళ్ళూ మీరు ఎదురుచూస్తున్న అవకాశం అదే. వెంటనే దాన్ని చిక్కించుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించారు: కడప నుంచి ఆచారి దిగాడు. మీ పథకం చాలా సింపుల్. నరేష్ డబ్బు కలెక్ట్ చేసుకోనే

సమయంలో ఆచారి గద్దలా వెళ్లి తన్నుకొస్తాడు. అయితే ఏ విధంగా తన్నుకొస్తాడో సుకుమార్‌కు తెలియనివ్వ లేదు!

"నిన్న సాయంత్రం అతను డబ్బు కలెక్ట్ చేసుకో డానికి చెరువు దగ్గరికి వెళ్ళినప్పుడు ఆచారి అక్కడే వున్నాడు—తూర్పు దిక్కున తూము దగ్గర—యెవరికీ కనిపించకుండా, సుమిత్ర జాడీని చెరువులోకి విసిరాక అది పడ్డ స్థలాన్ని జాగ్రత్తగా గమనించాడు—నీరు నిల కడగా వుంది.

"వెంటనే అతను తూములోంచి చెరువులోకి వెళ్ళి, జాడీ వున్న దిశలో 'నీటి లోపల' ఈదుతూ వెళ్ళాడు. అతను గజ ఈతగాడై వుండాలి. సుమిత్రవాళ్ళు కారెక్కి వెళ్ళిపోయాక, సుకుమార్ చెరువులోకి దూకడానికీ, జాడీని చేరుకోవడానికీ పది నిమిషాలు పట్టాయి. అంతకు ముందే ఆచారి దాన్నందుకున్నాడు.

"అదే క్షణంలో జాన్ రైఫిల్ ప్రేల్చాడు. ఆచారి దాన్ని క్రిందికి లాగేశాడు. దాన్ని పట్టుకొని వేగంగా తూముకేసి వెళ్ళిపోయాడు. నీటిలో బుల్లెట్స్ హాని చెయ్యవు."

లాల్ క్షణం ఆగి మళ్ళీ అన్నాడు: "ఇక్కడ జాడీ కన్పించక సుకుమార్ గాభరాపడ్డాడు. అఫ్‌కోర్స్ వాని అదృశ్యం జాన్‌కూ అర్థంగాలేదు. జాన్ సుకుమార్‌ని ఫొటో తీశాడు."

రావ్ నిటారుగా కూర్చొని వింటున్నాడు.

"మిస్టర్ రావ్. సుకుమార్‌ని ఫోటో తీసినట్టు ఆచారి చూశాడు. ఫోటో తీసింది డిటెక్టివ్ అని తెలుసు కున్నాడు. కాబట్టి—మేం సుకుమార్‌ని ట్రేస్ చేసి అతని

ద్వారా మీ గుట్టు కక్కించకుండా మమ్మల్ని చంపేయ మని ఆచారిని మీరు ఆదేశించారు."

"అబద్ధం!"

"ఇంకా వినండి! ఆచారి ఆ ప్రయత్నంలో విఫల మయ్యాడు. ఛస్తే ఒకే దెబ్బకు చావాలి—గురి తప్పిందా ఎదురుదెబ్బ తింటారు. అందుకే మమ్మల్ని చంపాలని అదే పనిగా ప్రయిత్నించకుండా, ఏకంగా సుకుమార్ నే అంత మొందిస్తే అసలు సమస్యే వుండదు! ఆ ఫోటో ప్రమాద కరం. అతనెప్పుడైనా పట్టుబడతాడు!

"పాపం—సుకుమార్ కు మీ వక్రబుద్ధులు తెలియవు. ప్లాను బెడిసికొట్టడంతో నరేష్ మరో ప్రపోజిషన్ కు ప్రయత్నాలు మొదలెట్టాడు. అలాంటి పరిస్థితిలో ఏ కిడ్నా పర్ ఆ పిచ్చిపని చెయ్యడు. కానీ—నరేష్ ద్విపాత్రాభి నయం చేస్తున్నాడు గనుక ఏ ప్రమాదమూ వుండదను కున్నాడు. కానీ పాల్ భయపడి సలాము కొట్టాడు.

"అప్పుడు రెండో ప్రపోజిషన్ కోసం సుకుమార్, నరేష్ రంగంలో దిగారు. నరేష్ ఒంటిమీద కెచప్ జల్లు కొని పడుకున్నాడు. సుకుమార్ రెండు భంగిమల్లో స్నాప్స్ తీశాడు. మూడో స్నాప్ కు సిద్ధమవుతున్నాడు- అప్పుడే మీరూ, ఆచారీ ఇంటి పైకప్పు చేరుకున్నారు. ఆచారి మమ్మల్ని చంపకపోవడంతో అతనిమీద నమ్మకం లేక, సుకుమార్ చావును మీరు స్వయంగా వీక్షించ డాని కక్కడ విచ్చేశారు. మీ రిద్దరూ మోటార్ సైకిల్ మీద అక్కడికెళ్ళారు. దాన్ని ఇంటికి దూరంగా ఆపి, కాలినడకన చేరుకొన్నారు.

"పెంకు తొలగించి ఆచారి షూట్ చేశాడు. కాని, దానికి ముందు చిటికె వేయడంతో సుకుమార్ బెదిరి

ప్రక్కకు తొలిగాడు. గురి తప్పింది. బుల్లెట్ ఛాతీలో దూరి కడుపులోంచి బయటపడింది.నరేష్ లేచి భయంతో పరిగెత్తాడు.

"మీరు క్రిందికి వెళ్ళి సుకుమార్‌ని చూశారు. అతని ంకా చావలేదు. తెలివి కోల్పోయాడు. కానీ మరో షాట్‌తో చంపాలనుకోలేదు. ఆచారి చాతుర్యం గురించి నేనో కామెంట్ విన్నాను: 'చిమ్మచీకట్లో చావుదెబ్బ— పోలీసు లెవర్ని పట్టుకుంటారు?' ఇక్కడ కూడా అతను తెలివి ప్రదర్శించాడు. ఏం చేశాడని అడగండి—"

"ఏం చేశాడు?"

"మీ రిద్దరూ చేశారు. సుకుమార్ చావు అక్సిడెంట్‌లా వుంటే కొన్ని అనర్థాలు తప్పుతాయని ఆచారి చెప్పాడు. నిజానికా బుల్లెట్ గాయమతనికి ప్రాణాంతకం కాదు. ఆ గాయం తిని అతను ప్రాణభయంతో వురికి, రైల్వే ట్రాక్ మీద పడిపోయి తెలివి తప్పితే యెలా వుంటుంది?"

రావ్ ముఖంలో రక్తం వేగంగా ప్రసరించింది.

"తెల్లారి అతని ముక్కలైన శరీరాన్ని పోలీసులు చూసి ఆక్సిడెంట్ అనుకొంటారు. ఆటోప్సీలో బుల్లెట్ వల్ల మరణించలేదని తేలుతుంది— తేలింది కూడా! కాబట్టి మీకు పెద్ద గండం తప్పింది కదూ? ఈ కేసులో మీ రెంత అనుమానితులైనా నేరం మీ మీద రుజువు కావడానికి ఆధారమేమీ లేదు! అవునా?

"ఈ ఆలోచనతో మీ రిద్దరూ తక్షణం రంగంలో దూకారు. సుకుమార్ పారిపోయినట్టు సూచించాలి గనుక అక్కడ అడుగుజాడ లుండాలనుకున్నారు. బాటిల్‌లోని కెచప్‌ని నేలమీద ఒలకబోసి, నీళ్ళు గుమ్మరించారు. ఆ

మిశ్రమంలో సుకుమార్ కాళ్ళు తడిపి, చెరో రెక్క పుచ్చుకొని నడిపించి అడుగుజాడలు సృష్టించారు."

రావ్ రాయిలా వుండిపోయి వింటున్నాడు.

"....అతన్ని యింట్లోంచి తరలించారు. అయితే సిటీకి చేర్చడం ఒక సమస్య. స్వంత వాహనం తప్ప ఏదైనా అపాయకరమే. అందువల్ల అతన్ని ఇంటి వెనుక దూరంగా వున్న పశువులపాకలో చేర్చారు. అక్కడ ఆచారి ఇంకా లోతుగా ఆలోచించాడు.

"కేవలం అడుగుజాడలే గాక సుకుమార్ పలాయనాన్ని ప్రత్యక్షంగా చూసిన సాక్షిని కూడా సృష్టించాలనుకున్నాడు. వెంటనే సుకుమార్ దుస్తులు తీసి తను తొడుక్కున్నాడు. సుకుమార్ మెడలోని కెమేరా తను వేసుకున్నాడు—బట్టతల మినహాయిస్తే అతని ఒడ్డూ పొడుగూ సుకుమార్‌తో సరిపోతాయి. బట్టతలని మరుగు పరచడం సమస్యకాదు. రక్తం దుస్తుల్లో చీకట్లో అతన్ని చూసి యెవరైనా హడలిపోయి ఆనవాల్ని గుర్తు పెట్టుకోలేరు. అలాటి స్థితిలో బట్టతలను కూడా గమనించలేరు!

"కాస్సేపట్లో ఆ ప్రాంతం పోలీసులతో నిండుతుంది. రోడ్డుదగ్గర వున్న మోటార్ సైకిల్‌ని అతను కొట్టందగ్గరికి చేర్చాడు. తిరిగి రోడ్డు చేరుకొని సుకుమార్ వేషంలో లిఫ్ట్‌కోసం కాచుకున్నాడు. అతనికి ఒక కారులో లిఫ్ట్ దొరికింది—రివాల్వర్‌తో బెదిరించిన ఫలితంగా, ఆ విధంగా ఆ కారతను సాక్షి అవుతాడని మీకు తెలుసు.

"అయితే ఆచారి సనత్‌నగర్‌లో గాక కోఠిలోనే దిగిపోయాడు. అక్కడనుంచి మీ యింటికి వురికి మీ కారు తీసుకొని తిరిగొచ్చాడు. అప్పటికింకా పోలీసులు

రాలేదు.

"పోలీసులు వచ్చి తతంగం ముగించుకొని వెళ్ళిపోయాక మీరు కార్లో సుకుమార్‌తో బయలుదేరారు. ఆచారి తిరిగి తన దుస్తుల్లో మిమ్మల్ని వెంబడించాడు. ఇద్దరూ కలిసి గుట్టుగా, జాగ్రత్తగా, సుకుమార్ శరీరాన్ని సనత్ నగర్ రైల్వే ట్రాక్ మీద పడుకోబెట్టి చేతులు దులుపుకున్నారు...."

రావ్ తేరుకొని అదోలా నవ్వాడు.

"మిస్టర్ లాల్, మీ కథ విన సొంపుగా వుంది. కానీ రుజువు?"

"మీరు మర్యాదగా అడగడం చాలా బావుంది!" అన్నాడు జాన్. జేబులోంచి చిన్న పుస్తకంతీసి, రెండు నిమిషాలు గబగబ చదివి విన్పించాడు.

"అవీ ఆధారాలు!" అన్నాడు లాల్, "మీ ప్రతి కదలికకు ఆధారం వుంది! ఆచారికి మీ పూచీకత్తు మీద అద్దె మోటార్ సైకిల్ ఇప్పించారు.

"ఇక, మరో రుజువు—హత్యాయుధం. ఎంత చాకచక్యంగలవాడైనా పప్పులో కాలెయ్యక తప్పదని ఆచారి తన రివాల్వర్‌ని సుకుమార్ దుస్తులు ధరించినప్పుడు జేబులో వేసుకొని, తర్వాత అలాగే మర్చిపోవడంద్వారా నిరూపించాడు! ఐ పిటీహిమ్ వెరీమచ్. దానిమీద అతని వేలిముద్రలు చెడిపోలేదు.

"ఆ తర్వాత—సుకుమార్ దేహంతో మీరు పశువుల శాలలో గడిపినప్పుడు విపరీతంగా తాగిపారేసిన సిగరెట్ పీకల గురించి: వాటిని ఈ మధ్యాహ్నం మేం వెళ్ళి కలెక్ట్ చేసుకున్నాం. మీ రిప్పుడు తాగుతూన్న బ్రాండ్ కూడా

అదే! ఆ పీకలమీద మీ వేలిముద్రలుంటాయని మరవకండి!

"దట్సాల్ మిస్టర్ రావ్. ఇకెలాంటి ఎత్తులూ పారవు. మీ రిప్పుడు చేయవలసిందల్లా రెండే రెండు! ఆచారి జాడ తెలియజేయడం. ఆ డబ్బును వెలికియ్యడం. ఆ డబ్బెక్కడ పెట్టారు?"

రావ్ అకస్మాత్తుగా తేరుకున్నాడు. అతని ముఖం ఒక్కసారిగా వెలిగింది.

"ఎంత కావాలి? చెప్పండి—ఎంత కావాలి?"

ఇంతలో ఛటుక్కున స్వింగ్ డోర్ తీసి ఒక మనిషి లోనికొచ్చాడు.

"రావ్ గారూ! బండికి వేళయింది, నేనిక వెడుతున్నానండి" అన్నాడతను.

రావ్ అతన్ని చూసి కొయ్యబారిపోయాడు.

డిటెక్టివ్‌లు చివాల్న వెనక్కి తిరిగిచూశారు. అతను ఆచారి.

"స్టావ్ దేర్, యూ ఓల్డ్ మామా!" జాన్ మెరుపులా లేచి వెళ్ళి అతని దవడ క్రింద గుద్ది, రెండు చేతుల్లో బంధించాడు.

* * *

ఆ రాత్రి డాన్సర్ కామిని తన గదిలో కిటికీలూ, తలుపులు బిడాయించుకొని; నిలువుటద్దం ముందు తన సుందర శరీరాన్ని చివరిసారిగా వీక్షిస్తూ, జాలిగా నవ్వుకుంటూ; కుడిచేతిలో వున్న గుప్పెడు మాత్రల్ని తృప్తిగా మింగి కళ్ళు మూసుకుంది.

మర్నాడు ఉదయం నరేష్‌కుమార్ రెండు కన్నీటి బొట్లు రాల్చి, భార్య చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

—:ఐపోయింది:—

# మరణ వాఙ్మూలం!

వాణిశ్రీ

అది అమావాస్య రాత్రి.

చందమామని ఎవరో మింగేసినట్టుగా బోసిగా, వెలితిగా వెలవెలబోతూ వుంది ఆకాశం.

కారుమబ్బులు క్రమ్ముకుని లోకం చీకట్లో మ్రుంగి పోయినట్లుంది.

అక్కడక్కడా ఒకటీ అరా చుక్కలు కనిపిస్తున్నాయి.

విశాలమైన ఆవరణలో తురాయి, వేప, మర్రిచెట్ల మధ్యలో నియాన్ లైట్ల వెలుగులో తెల్లగా వెన్నముద్దలా మెరుస్తోంది జాన్స్ హాస్పటల్.

వార్డులో నర్సు కుర్చీలో కూర్చుని ఏదో నవల చదువుకుంటూ కాలక్షేపం చేస్తోంది.

సుమతి, తల్లి బెడ్ ప్రక్కన స్టూలుమీద కూర్చుని ఏదో వారపత్రిక తిరగేస్తోంది. కాని ఆమెకు చదవ బుద్ధి పుట్టడంలేదు.

గోడగడియారం పదిగంటలు కొట్టింది.

ఉలిక్కిపడింది సుమతి.

పత్రిక మూసేసి స్టూలుమీద పడేసి లేచి నిల్చుంది. విసుగ్గా అటూ ఇటూ పచార్లు చేస్తోంది.

వార్డులో పేషెంట్లందరూ దాదాపు అంతా నిద్రలో మునిగారు.

సుమతి, తల్లి బెడ్ దగ్గర ఆగింది.

ప్రశాంతంగా నిద్రపోతోంది సీతమ్మ.

'వీడింకా రాలేదేం' అనుకుంటూ బైటకు చూసింది సుమతి.

సుమతి తమ్ముడి రాకకోసం ఎదురుచూస్తోంది.

రోజూ ఎనిమిది గంటలకల్లా వచ్చేవాడు. ఈ రోజు సినిమా చూసి వస్తానన్నాడు.

ఇంకా రాలేదు.

ఆమెకు నిద్ర వస్తోంది.

గట్టిగా ఆవలించి చిటికలు వేసింది.

"మీ తమ్ముడు యింకా రాలేదా?" నవ్వుతూ ప్రశ్నించింది నర్స్.

రాలేదన్నట్లు తల వూపింది సుమతి.

అంతలో అడుగుల చప్పుడు వినిపించింది.

"నీకు నూరేళ్ళ ఆయుష్షు చంద్రా!" అంది నర్సు.

"నూరేళ్ళే? ఎందుకూ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు చంద్రశేఖర్.

"ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాం" అంది.

"ఓ....అదా!" నవ్వాడు అర్ధమైనట్లుగా.

"అన్నం తిన్నావా....?" ప్రేమగా ప్రశ్నించింది సుమతి.

తల వూపాడు చంద్రశేఖర్.

"సినిమా బాగుందా?" అంది నర్సు.

"ఓ!....బ్రహ్మాండం...." మెరుస్తున్న కళ్ళతో అన్నాడు.

"ఫైటింగ్‌లు వుంటే చాలు మా వాడికి" నవ్వింది సుమతి.

బెడ్ ప్రక్కనే చాప పరచుకొన్నాడు చంద్రశేఖర్.

"జాగ్రత్త! నేను వెళ్ళొస్తాను" అంది తమ్ముడితో.

తల వూపాడు.

"గుడ్ నైట్ సిస్టర్!" అంది.

గుడ్ నైట్ చెప్పింది నర్స్.

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ హాస్పటల్ ఆవరణ దాటింది.

కొంతదూరం పోయాక విశాలమైన మైదానం. అన్నీ సర్కారు తుమ్మపొదలు. స్ట్రీట్ లైట్లు వెలుగుతున్నా భయంగా వుంది సుమతికి. రోడ్డుమీద జనసంచారం లేదు. రోజూ ఎనిమిదింటికే ఆమె వెళ్ళిపోయేది. అప్పుడంత భయం వుండేది కాదు. జనం వస్తూ పోతూ వుండేవారు. అప్పుడప్పుడూ రిక్షాలు, కార్లు తిరుగుతూ వుండేవి. కాని ఈ రోజు పదిన్నర దాటింది.

మైదానం సగందూరం వచ్చింది సుమతి.

తెల్లటి లాల్చీ పైజామా వేసుకున్న అతను యెదురు వచ్చాడు.

ఆమెను చూసి ఆగాడు ఆమె కోసమే ఎదురుచూస్తున్నట్లుగా.

ఆమె అతన్ని చూసింది కళ్ళెత్తి. మరుక్షణం ఆమె

ముఖం గంభీర ముద్ర దాల్చింది. చర చరా అడుగులు వేసింది.

"ఆగు" అన్నాడు అతను.

ఆమె ఆగలేదు.

ఇంతలో కరెంటు పోయింది.

లోకం చీకట్లో మునిగిపోయింది. కన్ను పొడుచుకున్నా కనిపించడంలేదు.

"సుమతీ! నేను చెప్పినట్లు విను. అనవసరంగా నాకు కోపం తెప్పించకు. కోపం వస్తే నేను మనిషిని కాను" అన్నాడు.

"కోపం రాకపోయినా నువ్వు మనిషివి కావు" కోపంగా అంది సుమతి.

"ఏమన్నావ్?" అంటూ లాగి సుమతి చెంపమీద కొట్టాడు.

"అయితే నా దారికి రావన్నమాట."

"ఈ జన్మలో జరగదు" దృఢంగా అంది సుమతి.

"అయితే నీకు ఈ జన్మనే లేకుండా చేస్తా."

"చంపుతావా చంపు...."

"చంపక వదులా ననుకున్నావా! నాకు దక్కని సుఖం యెవడికీ దక్కడానికి వీల్లేదు. నిన్ను చంపి నా కసి తీర్చుకుంటాను...." అంటూ అతను ఆమె నోరు నొక్కుతూ మైదానంలోకి ఈడ్చుకుంటూ వెళ్ళాడు.

ఆమె కేకలు పెడులోంది.

తుమ్మచెట్ల పొద ప్రక్కకు లాక్కెళ్ళి గుండెల్లో ఒక పోటు పొడిచాడు కత్తితో. కత్తిని లాగాడు. మరో పోటు పొడవాలనుకుంటుండే లోపల కారు లైటు పడింది పొదలోంచి.

కత్తి చేతో పట్టుకుని భయంతో పారిపోయాడు.

ఆమె చావుకేక విని కారులో పోతున్న జగపతిరావు "ఆపు...." అన్నాడు డ్రైవర్‌తో.

"డాష్‌బోర్డులో బ్యాట్రీ లైటు తీసివ్వు" అన్నాడు కారు దిగుతూ.

డ్రైవర్ రామ్‌సింగ్ బ్యాట్రీస్విచ్ వేసి జగపతిరావు చేతికి అందించాడు.

లైటు వెలుగులో దూరంగా తెల్లటి బట్టల్లో పారి పోతున్న అతను కనిపించాడు.

మైదానంలో ముళ్ళపొదల మధ్య విల విల కొట్టు కుంటూ రక్తపుమడుగులో సుమతిని చూసి జగపతిరావు చలించిపోయాడు. కళ్ళు బైర్లు క్రమ్మాయి ఆ దారుణ దృశ్యం చూసి. అతని జీవితంలో అటువంటి రక్తపాతం యెన్నడూ ప్రత్యక్షంగా చూడలేదు. గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. ఏం చేయాలో పాలుపోక ఒక్క క్షణం రాతిబొమ్మలా నిల్చుండిపోయాడు.

రామ్‌సింగ్, సుమతిని ఆ పరిస్థితిని చూసి వణికిపోతు న్నాడు.

"రామ్‌సింగ్ నువ్వు ఆమె కాళ్ళు పట్టు" అంటూ రెండు భుజాలు పట్టుకుని లేపాడు.

ఇద్దరూ కలసి వెనుకసీట్లో ఆమెను పడుకోబెట్టారు.

కారు జనరల్ హాస్పటల్ వైపు రివ్వున దూసుకు పోయింది.

క్యాజువాల్టీలో బెడ్ మీద పడుకోబెట్టారు. డ్యూటీ డాక్టర్ ప్రసన్నకుమార్ వెంటనే వచ్చాడు.

"ఎవరో ఆమెను పొడిచి పారిపోయాడు సార్!" వణుకుతున్న స్వరంతో అన్నాడు జగపతిరావు.

"ఎవరు ఆమె?"

"ఏమో! నేను కారులో వస్తున్నాను. అప్పుడు కరెంట్ లేదు. కేకలు వినిపించి కారు ఆపాను. ఆ మైదానంలో ముళ్ళపొదల మధ్య వుంది ఈమె. బ్రతుకుతుందేమోనని ఆశతో తీసుకొచ్చాను" అన్నాడు జగపతిరావు.

డాక్టర్ ప్రసన్నకుమార్ ఆమెను థియేటర్‌కి తీసుకెళ్ళమని చెప్పాడు. స్ట్రెచర్ బేరర్ ఆమెను థియేటర్‌కి తీసుకెళ్ళాడు.

డాక్టర్ ఫోను ఎత్తి హాస్పటల్ సూపర్నెంట్‌తో విషయమంతా చెప్పి వెంటనే రమ్మని రిక్వెస్ట్ చేశాడు.

"మీరు కూర్చోండి. మా సూపర్నెంట్ గారు ఇప్పుడే వస్తారు" అని థియేటర్ వైపు హడావుడిగా వెళ్ళాడు డాక్టర్ ప్రసన్నకుమార్.

జగపతిరావు క్యాజువాల్టీలో బల్లమీద కూర్చున్నాడు కొంచెం సేపు.

తర్వాత వచ్చాడు సూపర్నెంట్. జగపతిరావుతో ఏమీ మాట్లాడకుండానే థియేటర్ వైపు వెళ్ళాడు.

క్షణాలు గంటలుగా గడుస్తున్నాయి జగపతిరావుకి.

సుమతి రక్తంలో కొట్టుకుంటున్న దృశ్యం మరుపు రావడం లేదు. అతని హృదయం ద్రవించిపోతోంది గుర్తొచ్చినకొద్దీ.

ఆమె ఎవరో?

ఆమెను హత్య చేసినవాడు ఎవరో?

ఎందుకు హత్య చేశాడో?

ఎంత తప్పుచేసినా సాటి మనిషిని హత్య చెయ్యడమంత ఘోరం మరొకటి వుందా?

దుర్మార్గుడు నిండు ప్రాణం తియ్యాలనుకున్నాడు.

ఆలోచిస్తూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు జగపతిరావు.

వార్డుబాయ్ కాబోలు వచ్చి "సార్! మిమ్మల్ని డాక్టర్ గారు పిల్చుకురమ్మన్నారు" అన్నాడు.

డాక్టర్ ప్రసన్న థియేటర్ ముందు నిల్చుని వున్నాడు.

"మీరు పోలీసులకు రిపోర్టు చేశారా?" ప్రశ్నించాడు డాక్టర్.

"లేదు. ఆ కంగారులో తోచలేదు. సరాసరి ఇక్కడికే తీసుకొచ్చాను" అన్నాడు జగపతిరావు.

"వెంటనే వెళ్ళి రిపోర్టు ఇచ్చిరండి. ఆమె కండిషన్ బాగోలేదు. బ్లడ్ చాల పోయింది. షీ మే నాట్ లివ్" అన్నాడు డాక్టర్.

"అలాగే రిపోర్టు చేస్తాను. డాక్టర్ మీరు ఎలాగైనా ఆమెను బ్రతికించండి. ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. ఆమెను హత్యచేసిన వాడిని పట్టుకుని వురికంబం ఎక్కించాలి" ఆవేశంతో అన్నాడు.

"ఆమె గ్రూప్ బ్లడ్ లక్కీగా మా బ్లడ్ బ్యాంక్ లోనే వుంది. మేము ట్రైచేస్తాం బ్రతికించడానికే" అన్నాడు డాక్టర్.

తర్వాత థియేటర్ లోకి వెళ్ళిపోయాడు.

జగపతిరావు వడివడిగా అడుగులు వేసుకుంటూ పోర్టికోలో ఆగివున్న కారు దగ్గరికి వెళ్ళాడు.

దూరంగా బీడీ కాల్చుకుంటున్న డ్రైవర్ రామ్‌సింగ్ జగపతిరావుని చూసి బీడీ ఆర్పి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"పోలీస్ స్టేషన్ కి పోనివ్వు" అన్నాడు.

"ఏ పోలీస్ స్టేషన్ కి సార్?"

"టూ టౌన్ స్టేషన్ కి పోనీ."

కారు చీకటిని చీల్చుకుంటూ కాంతి వేగంతో రోడ్డు మీద పరిగెత్తింది.

పోలీస్ స్టేషన్లో సెంట్రీ తప్ప ఎవరూ లేరు. అతను అంతా విని సి.ఐ. గారు ఇంట్లోనే వున్నారు సార్. ఫోన్ చెయ్యడంకంటే వెళ్ళడమే మంచిది సార్ అన్నాడు.

అదే మంచిది అనుకున్నాడు జగపతిరావు. సర్కిల్ కృష్ణమూర్తి బాగా తెలిసినవాడే కావడంవల్ల ఇంటికే వెళ్ళదల్చుకున్నాడు.

## 2

"సార్! ఆమెకు తెలివి వచ్చింది" నర్సు వచ్చి చెప్పింది.

హాస్పటల్ సూపర్నెంట్, సర్కిల్ కృష్ణమూర్తి, జగపతిరావు ఆమెను అనుసరించారు.

సుమతి ప్రక్కనే నిల్చున్నాడు డాక్టర్ ప్రసన్న కుమార్.

"మెజిస్ట్రేట్ గారు వచ్చారా?" ప్రశ్నించాడు డాక్టర్.

"వస్తున్నారు" అన్నాడు కృష్ణమూర్తి.

సుమతి కళ్ళు తెరచి చూస్తోంది. వెంటనే మూతలు పడుతున్నాయి. ఇంకా పూర్తిగా స్పృహలోకి రాలేదు.

కాసేపటికి మేజిస్ట్రేట్ రామనాథం హడావుడిగా వచ్చాడు అక్కడికి.

అంతా విష్ చేశారు.

మరణ వాఙ్మూలం తీసుకోవడానికి సిద్ధపడ్డాడు మేజిస్ట్రేట్ రామనాథం.

"ఆమె స్పృహలో వుందా డాక్టర్?" ప్రశ్నించాడు

రామనాథం.

"ఇప్పుడిప్పుడే వస్తోంది" అన్నాడు.

"ఆమె పూర్తి స్పృహలో వుందో లేదో తెలుసుకోవాలి నేను" అన్నాడు మేజిస్ట్రేట్.

డాక్టర్ ఏమీ మాట్లాడలేదు.

కాసేపటికి ఆమె మూలిగింది. కళ్ళు తెరిచి గ్రుడ్లు త్రిప్పింది.

మెజిస్ట్రేట్ ఆమె ప్రక్కనే స్టూలుమీద కూర్చున్నాడు.

"అమ్మా! నేనెవరో తెలుసా నీకు?" అన్నాడు మెజిస్ట్రేట్ రామనాథం.

సుమతి బాధగా కళ్ళు మూసుకుని తల త్రిప్పింది తెలియదన్నట్లుగా.

"నా పేరు రామనాథం. మెజిస్ట్రేట్ ని" అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. కళ్ళు తెరిచి అందర్నీ పరికిస్తూ వుంది.

"నీ పేరు ఏమిటమ్మా?" ప్రశ్నించాడు.

"సుమతి" గొంతు సన్నగా వుంది.

"మీ నాన్న పేరు?"

"నాకు నాన్న లేడు" సుమతి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి,

"మీ అమ్మ పేరు?"

"సీతమ్మ."

"నీ భర్త పేరు?"

"నారాయణరావు."

డాక్టర్లవంక సంతృప్తిగా చూశాడు మెజిస్ట్రేట్.

"అమ్మా నిన్ను ఎవరో కత్తితో పొడిచి పారిపోతూ

వుంటే జగపతిరావుగారు నిన్ను రక్షించి తీసుకొచ్చారు."

సుమతి, జగపతిరావు వంక చూసింది.

"నీకేం ఫరవాలేదు" అన్నాడు.

"ఇప్పుడు చెప్పు అతను ఎవరు? నిన్ను ఎందుకు చంపాలనుకున్నాడు? కారణం ఏమిటి?" ప్రశ్నించాడు మెజిస్ట్రేట్.

ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"మా అమ్మను, తమ్ముడిని చూడాలి...." ఆమె పెదవులు కంపిస్తున్నాయి.

"అలాగే! మీ ఇల్లు ఎక్కడుందో చెప్పు?"

"వాళ్ళు ఇంట్లో లేరు."

"మరి ఎక్కడున్నారు?"

"జాన్స్ హాస్పటల్లో వున్నారు. మా అమ్మకు లుకేమియా!" నీరసంగా అంది సుమతి.

"నేను వాళ్ళని పిలిపిస్తాను. ఇప్పుడే జీప్ పంపిస్తాను" అంటూ సర్కిల్ కృష్ణమూర్తి వెళ్ళి, జీప్ జాన్స్ హాస్పటల్ కి పంపి తిరిగి వచ్చాడు.

"అమ్మాయి సుమతీ. చెప్పమ్మా! నీ ఈ దుస్థితికి కారణం ఎవరు?" ప్రశ్నించాడు రామనాథం.

"నేను అర్జునరావు ప్రేమించుకున్నాం. కాని....నన్ను పెళ్ళి చేసుకుంటానని మోసం చేశాడు. నేను నారాయణరావుని పెళ్ళి చేసుకున్నాను...." సుమతికి ఆయాసం వచ్చింది.

డాక్టర్స్ ఆదుర్దాగా చూస్తున్నారు ఆమెవంక.

"అర్జునరావు ఎవరమ్మా?"

"రామా టాకీసు...." సుమతి శ్వాస భారంగా పీలుస్తోంది.

"అతనే....ఆ అర్జునరావే నా జీవితం నాశనం...."
సుమతి గొంతు ఆగిపోయింది.

ఆ తర్వాత ఏదో చెప్పబోయినట్లుగా పెదవులు కదిలాయి. కాని శబ్దం రాలేదు.

కళ్ళు తెరుచుకుని వుండిపోయాయి. కళ్ళల్లోని కాంతి ఎగిరిపోయింది. శ్వాస ఆగిపోయింది. ఆమె గొంతు మూగబోయింది.

సూపరెన్టెంట్ ఆమె చేతిని పట్టుకుని చూశాడు. చల్లగా మంచులా తగిలింది. పల్స్ అందలేదు.

"షీ ఇస్ డెడ్" అన్నాడు.

మెజిస్ట్రేట్ రామనాథం జాలిగా చూశాడు సుమతి శవం వంక.

జగపతిరావు ముఖం కళావిహీనమైపోయింది. ప్రాణం పోయిన వాడిలా గోడకు ఆతక్కుని పోయాడు. అతని అంతరంగంలో తుఫాన్ చెలరేగింది.

అతను అలా ఐపోవడానికి కారణం ఏమిటో సర్కిల్ ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి గ్రహించగలిగాడు.

రామా టాకీసు ప్రొప్రయిటర్ అర్జునరావు, జగపతిరావు చిన్న కొడుకు.

## 3

బంగారు పట్నంలో జగపతిరావు పేరు ప్రఖ్యాతులు గలవాడు. కొన్నాళ్ళు మున్సిపల్ ఛైర్మన్ చేశాడు. తర్వాత హైదరాబాద్‌లో ఇంజనీరింగ్ కంపెనీ పెట్టి అక్కడే వుండిపోయాడు.

ఆయనకు ముగ్గురు కొడుకులు. పెద్దకొడుకు డాక్టర్. అమెరికాలో సెటిలైపోయాడు.

రెండో కొడుకు ఇంజనీరై ఫరమ్ నడుపుతున్నాడు.

చిన్నకొడుకు అర్జునరావు. ఇంటర్లోనే డింకీలుకొట్టి చదువురాదని తేల్చుకున్నాడు.

రామా టాకీసు అమ్మకానికి వచ్చింది. దాన్ని కొంటే తను నడుపుతానని తండ్రి ప్రాణంతీసి కొనిపించాడు. తర్వాత తండ్రి అదుపు తప్పిపోయాడు.

కొడుకు చెడిపోతున్నాడని తెలుసుకుని బలవంతంచేసి ఆర్నెల్ల క్రితమే పెళ్ళిచేశాడు జగపతిరావు. అప్పుడప్పుడూ హైదరాబాద్‌నుంచి బంగారుపట్నం వచ్చి కొడుకుమీద అజమాయిషీ చేసి పోతుంటాడు.

జగపతిరావు కాలింగ్ బెల్ కొట్టాడు.

కోడలు విజయ తలుపులుతీసి మామగారిని చూసి చిరు నవ్వు నవ్వింది.

ఆయన ముఖం గంభీరంగా వుంది. ఆమె చిరునవ్వుకి రెస్పాన్సు ఇవ్వలేదు. పైగా ఇంత రాత్రి రావడం ఆమెకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. మధ్యలో కారు చెడిపోతే ఇంత ఆలస్యం చేసివుంటారు అనుకుంది.

జగపతిరావు హాల్లోని సోఫాలో కూలబడ్డాడు భారంగా.

"వాడేడి?" ప్రశ్నించాడు.

"నిద్రపోతున్నారు మావయ్యా!" అంది.

"అత్తయ్య వాళ్ళు కులాసా!...." అంటూ కుశల ప్రశ్నలు వేస్తుంటే అవేమీ వింటున్నట్లు లేదు.

"రాత్రి ఎన్నింటికి వచ్చాడు వాడు?"

"పన్నెండు దాటింది మావయ్యా!" అంది.

తల వూపి గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని పడు కున్నాడు. కాని నిద్రపట్టలేదు. సుమతిర క్తపు మడుగులో కొట్టుకుంటున్న దృశ్యం కళ్ళల్లో మెదుల్తోంది. ఆ హత్య

చేసినవాడిని వురికంబం ఎక్కించాలనుకున్నాడు. కాని వాడు....ఆ దుర్మార్గుడు తన కన్నకొడుకే అయ్యాడు.

కర్తవ్యం ఏమిటి?

వాడికి వురిశిక్ష వేస్తారా?

పెళ్ళయి ఆర్నెల్లు కాలేదు. అప్పుడే ఆ పిల్ల నుదుటి కుంకుమ చెరిపేస్తారా?.

లక్షరూపాయల కట్నం తీసుకుని, ఎంత ఆశతో వచ్చింది కాపురానికి.

తెల్లటి చీర కట్టుకుని బోసి మెడతో, గాజులులేని చేతులతో కళావిహీనమైన ముఖంతో విజయ ఆయన మనో నేత్రంపై ప్రత్యక్ష్యమైంది.

వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు.

జగపతిరావులో అంతరంగ సంఘర్షణ జరుగుతూ వుంది.

తెల్లవారినా పడకమీదనుంచి లేవలేదు. కళ్ళు తెరిచి పిచ్చివాడిలా చూస్తూ వుండిపోయాడు.

పనిమనిషి తెచ్చిన బెడ్ కాఫీ టీపాయ్‌మీదే చల్లారి పోయి వుంది.

పోలీస్ వ్యాన్ ఇంటిముందు ఆగడం, టక....టక.... బూట్ల శబ్దం వినిపిస్తూనే వున్నాయి.

హాల్లో కలకలం చెలరేగింది.

అర్జునరావు గట్టిగా కేకలు వేస్తున్నాడు.

జగపతిరావు కోడలు విజయ ఒక్క పరుగున మామగారి గదిలోకి వచ్చిపడింది.

"మావయ్యా!...." ఆయాసపడుతూ వుంది.

జగపతిరావు బెడ్ మీదనుంచి లేచి కూర్చున్నాడు. ఆయన కళ్ళలో ఎర్రటి జీరలు కనిపిస్తున్నాయి. ముఖం

నల్లగా వికారంగా ముడతలుపడి వుంది.

"ఆయన్ని పోలీసులు అరెస్టు చేస్తున్నారు. ఏదో హత్యానేరం అంటున్నారు" అంది ఆవేదనతో.

జగపతిరావు తల వంచుకుని "నాకు తెలుసమ్మా ఆ సంగతి" అన్నాడు.

విజయ కొంచెంసేపు నివ్వెరపోయి చూసింది.

"మీకు తెలుసా?"

"నాకు రాత్రే తెలుసు. సుమతి అని ఒకమ్మాయిని హత్యచేశాడు వీడు. ఆ అమ్మాయి చచ్చిపోతూ నన్ను చంపింది వీడే అని చెప్పింది. ఆ సమయంలో నేను అక్కడే వున్నాను" అన్నాడు.

విజయకి ఏడుపు ముంచుకొచ్చింది మామగారి మాటలు వింటూనే.

"మామయ్యా! ఇప్పుడెలా?...." ఏడుస్తూ అంది విజయ.

"వాడి తలరాత అలా వుంది. వీడు హత్యలు చేసేంత దుర్మార్గుడయ్యాడని తెలిసి నాకు సిగ్గువేస్తోంది. వీధిలో తలెత్తుకుని ఎలా తిరగాలో అర్థం కావడంలేదు. నేను చిన్నతనం నుంచి సంపాదించుకున్న పరువు ప్రతిష్ఠ నాశనం చేశాడు" బాధగా అంటూ వుంటే కళ్ళలోంచి నీళ్ళు కారాయి.

"ఆయన్ని ఎలాగైనా విడిపించండి."

"వాడిని ఎవరూ రక్షించలేరమ్మా!" అన్నాడు జగపతిరావు.

విజయ ఏడుపు ఎక్కువైంది.

చేజేతులా విజయ జీవితాన్ని నాశనం చేశానుగదా అని లోలోపలే ఏడుస్తున్నాడు జగపతిరావు.

# 4

జగపతిరావు లాయర్ శ్రీకాంత్ ఆఫీస్ రూమ్‌లో కూర్చున్నాడు.

అర్జునరావు ఖిన్నుడై తండ్రి పక్కనే వున్నాడు.

అంతకుముందే బెయిలుమీద విడిపించుకుని వచ్చారు అర్జునరావుని.

"చాలా విచిత్రంగా వుంది యీ కేసు" అన్నాడు శ్రీకాంత్.

"నాకు వీడి మాటలు నమ్మ బుద్ధికావడంలేదు లాయర్ గారూ! నేను చెవులారా ఆమె మాటలు విన్నాను" అన్నాడు జగపతిరావు.

"అమ్మమీద ప్రమాణంచేసి చెప్తున్నాను నాన్నా! నేను సుమతిని చంపుతానా? నాకు ఆ మాత్రం తెలియదా?" బాధగా అన్నాడు.

జగపతిరావు కొడుకు మాటలు వినీ విననట్లు కూర్చున్నాడు. ఇటువంటి ప్రమాణాలు ఆయన నమ్మడు. అదంతా ఆత్మవంచన అనుకున్నాడు.

"లాయర్ గారి ముందు మనం ఏ రహస్యమూ దాచకూడదు. అన్నీ వివరంగా చెప్పాలి. ఆయనకు అన్నీ తెలిసివుండాలి. అప్పుడే ఏదైనా సహాయం చెయ్యగలరు" జగపతిరావు కొడుకు వంక చూస్తూ తీవ్రంగా అన్నాడు.

లాయరుగారు మెచ్చుకోలుగా జగపతిరావు వంక చూశాడు.

"నేను ఏ విషయం దాచడంలేదు నాన్నా! నేను సుమతిని ప్రేమించిన మాట నిజమే. పెళ్ళి చేసుకుంటా

నని అన్న మాటా నిజమే. కాని కొంతకాలం ఆగమని అన్నాను. కాని ఆమె నన్ను అనుమానించి వేరే అతన్ని పెళ్ళి చేసుకుంది.''

శ్రీకాంత్ తల వూపుతూ "వూఁ" కొడుతున్నాడు.

"ఆ పాత కథంతా యెందుకూ?" విసుగ్గా అన్నాడు జగపతిరావు.

"నిన్నరాత్రి ఫస్టు షో బుక్కింగ్ క్లోజయ్యాక నేను చలనచిత్ర డిస్ట్రిబ్యూటర్స్ కంపెనీ మేనేజర్ సుందర్రావుతో కారవాన్ హోటల్లో వున్నాను. పన్నెండింటి వరకూ అక్కడే వున్నాను. తర్వాత యింటికి వచ్చాను. అంతే సార్! ఈ హత్యతో నాకేం సంబంధం లేదు. కావాలంటే సుందర్రావు నాకు సాక్ష్యం ఇస్తాడు. ఇంకా హోటల్ బేరర్స్ గూడా...."

శ్రీకాంత్ మధ్యలో కల్పించుకుని "చూడు బాబూ! నీవు చెప్పేది నాకు అర్థమైంది. పదే పదే చెప్పనవసరం లేదు. సుమతి మరణవాఙ్మూలం అలా ఎందుకు ఇచ్చింది? కారణం చెప్పు?" అన్నాడు.

"నేను ఆమెను పెళ్ళి చేసుకోకుండా మోసం చేశాననే కోపంతో చనిపోతూ కసి తీర్చుకోవడానికి చెప్పి వుండవచ్చును" అన్నాడు అర్జునరావు.

"మరణ వాఙ్మూలానికి చాలా విలువ ఇస్తుంది కోర్టు. ఎందుకో తెలుసా? ఆఖరి క్షణాలలో యెవరూ అబద్ధం చెప్పరనే ఒక నమ్మకంవల్ల. చనిపోతూవున్న సమయంలో కసి, పగ తీర్చుకోవాలనే ఆలోచన రావడం అసహజం. తనని హత్య చేసింది ఒకరైతే మరొకరి పేరు చెప్పడం అసహజం" అన్నాడు లాయరుగారు.

"సుమతికి నాపై యింత కోపం వుందని నేను

యెప్పుడూ అనుకోలేదు!" బాధగా అన్నాడు అర్జునరావు.

"ఆమెను నువ్వు మోసం చేసింది ఏముంది? పెళ్ళికి కొంతకాలం ఆగమన్నావు. ఆమె అనుమానించి, తొందరపడి వేరే యెవర్నో పెళ్ళి చేసుకుంది. అందులో నీ తప్పు ఏ మాత్రం లేదు. మరి నీ మీద కోపం వుంచుకోవలసిన కారణం?" ప్రశ్నించాడు లాయర్.

"అదే సార్! నాకు అర్థం కావడంలేదు" అన్నాడు అర్జునరావు.

"అయితే ఆమెను నువ్వు హత్య చెయ్యలేదని మమ్మల్ని మనస్ఫూర్తిగా నమ్మమంటావా?" అన్నాడు లాయర్.

"నమ్మండి సార్! నేను సుమతిని హత్య చెయ్యవలసిన అవసరంలేదు. ఒకవేళ చెయ్యదల్చుకుంటే స్వయంగా చేస్తానా? అందుకు డబ్బిచ్చి యెవరితోనో చేయించేవాడిని గదా? నాకా మాత్రం తెలివితేటలు లేవా?" అన్నాడు అర్జునరావు.

జగపతిరావు ఆశగా చూశాడు కొడుకు వంక.

"నిజం నాన్నా! నన్ను నమ్ము. సుమతిని నేను హత్య చెయ్యలేదు" అన్నాడు.

"కాని కేసు చాలా బలంగా వుంది జగపతిరావుగారూ! నేనైతే గ్యారంటీ యివ్వలేను. మీరు నాకు పాత క్లయింట్ గనుక టేకప్ చేస్తాను. ఆ తర్వాత అంతా మీ అదృష్టం!" అన్నాడు లాయర్ శ్రీకాంత్.

జగపతిరావులో కొత్త ఆశ చిగురించింది. 'నిజంగా వీడు చెప్పేది నిజమేనేమో! చీకట్లో సుమతి పొరపడిందేమో!' అనుకున్నాడు.

"థాంక్స్ శ్రీకాంత్ గారూ! నేనొక పని చేస్తాను. ఈ రోజు హైదరాబాద్ వెళుతున్నాను. ఈ కేసులో మీకు సహాయంగా ఒక ప్రైవేట్ డిటెక్టివ్ని పంపిస్తాను" అన్నాడు జగపతిరావు.

అలాగే అన్నట్లు తల వూపాడు లాయరు.

## 5

"రాయప్పగారూ, మీరు అనవసరంగా వృధా శ్రమ తీసుకుంటున్నారేమోనని అనుకుంటున్నాను. మీకు అర్జునరావు సంగతి తెలియదు. ఎస్టాబ్లిష్డ్ రోగ్. అతనికి స్త్రీ వ్యసనం ఎక్కువ. వీధికొక ముండ వుంది ఈ వూళ్ళో. ఎంతకైనా తగును. దొరక్క దొరక్క ఈ కేసులో ఇరుక్కున్నాడు. అతను శిక్ష నుంచి తప్పించుకోలేడు" సర్కిల్ ఇన్స్పెక్టర్ కృష్ణమూర్తి అన్నాడు.

రాయప్ప చిన్నగా నవ్వాడు.

"అతను ఈ హత్య చేసి వుంటే శిక్ష నుంచి తప్పుకోలేడు. నేను నేరస్థులకు సహాయపడడానికి రాలేదు. నిజానిజాలు తెలుసుకోవడానికే వచ్చాను. అందుకు మీ సహాయ సహకారాలు కావాలి. అఫ్ కోర్స్, మీ డిపార్టుమెంట్ పర్మిషన్ తీసుకున్నాననుకోండి."

"అలాగే....అలాగే.... నాకు తోచింది చెప్పాను."

"అర్జునరావు హత్య చేసివుంటే శిక్షార్హుడే. కాని అతను వాదిస్తున్నట్లుగా అతను ఈ నేరం చేసి వుండకుండా శిక్షించబడితే అన్యాయం కదా!" అన్నాడు రాయప్ప.

"అవుననుకోండి. నేరం చేసినవాడెవడూ చేశానని ఒప్పుకోడు. డబ్బున్నవాళ్ళు మర్డరు చేసి గూడా, వంద మందితో ఎలిబీ ఇప్పిస్తారు."

"అఫ్‌కోర్స్."

జవాన్ కాఫీ తెచ్చి ముందు పెట్టాడు.

"ప్లీజ్ టేకిట్."

"థాంక్స్...." అంటూ కప్పు చేతిలోకి తీసుకుని కాఫీ సిప్ చేస్తూ "హంతురాలు ఇచ్చిన మరణవాఙ్మూలం తప్ప అర్జునరావు హత్య చేసినట్లు వేరే ఆధారాలు లేవు గదా!" అన్నాడు రాయప్ప.

"లేవు."

"హత్యా స్థలం మీరు చూశారా?"

"మర్నాడు ఉదయం వెళ్ళాను. సర్కార్ ముళ్ళ పొదలమధ్య జరిగింది హత్య. కంట్రోల్డు ఎర్త్, బ్లడ్ స్టెయిన్డ్ ఎర్త్ కలెక్టు చేశాను."

"అక్కడ హత్య చేసిన వెపన్ యేదైనా దొరికిందా?"

"లేదు."

"పోనీ హంతకుడి కాలి ముద్రలు....యేవైనా కని పెట్టారా?"

"లేదు. అప్పటికే ఆ మైదానంకి చాలామంది వచ్చి పోవడం జరిగింది. విశాలంగా పొదలు చాటుగా వుండడం వల్ల అది మరుగుదొడ్డిగా ఉపయోగించుకుంటున్నారు జనం. గేదెలు, ఆవులు, పందులు విచ్చలవిడిగా తిరుగు తున్నాయి అక్కడ."

"ఐ....సీ...." అని తల వూపాడు రాయప్ప.

"మీరు పెట్టిన కేసు, మరణవాఙ్మూలం క్షుణ్ణంగా చూశాను."

తల వూపాడు కృష్ణమూర్తి.

"సుమతి మరణవాఙ్మూలం అసంపూర్ణంగా వుంది" అన్నాడు రాయప్ప.

"కావచ్చు."

"ఆమె చెప్పదల్చుకున్నది పూర్తిగా చెప్పలేకపోయిందని నా వుద్దేశ్యం."

తల వూపాడు.

"అర్జునరావు తనని పెళ్ళి చేసుకుంటానని చేసుకోకుండా మోసం చేశాడనీ, తన జీవితం నాశనం కావడానికి కారణం అతను అని చెప్పింది."

"అది చాలదా?" ప్రశ్నించాడు కృష్ణమూర్తి.

"నో....ఎలా సరిపోతుంది? అర్జునరావు తనను మోసం చేశాడని చెప్పిందిగాని తనను హత్య చేశాడని చెప్పలేదు గదా!" అన్నాడు రాయప్ప.

కృష్ణమూర్తి నవ్వాడు.

"మీరు పొరపాటున ప్రైవేట్ డిటెక్టివ్ ప్రాక్టీసు పెట్టారుగాని లాయర్ అవ్వాల్సింది" అన్నాడు.

"నన్ను లాయర్‌తో పోల్చకండి. ప్లీజ్" అన్నాడు డిటెక్టివ్ రాయప్ప నవ్వుతూ.

"సరదాగా అన్నాను లెండి. మీరు లాయర్‌లా పాయింట్ లేవదీశారు."

"మీరూ సీరియస్‌గా ఆలోచించండి. సుమతి తన కథంతా చెప్పాలని ప్రయత్నించింది. కాని చెప్పలేకపోయింది. అందువల్ల అర్జునరావు ముద్దాయిగా రంగంలో వున్నాడు. ఇందులో మరో వ్యక్తి వుండి వుండాలి."

"వుంటే లాగండి" అన్నాడు కృష్ణమూర్తి.

"తప్పకుండా!" అన్నాడు డిటెక్టివ్ రాయప్ప.

"నేను గూడా యెంతోకాలం బ్రతకను బాబూ! నా దిగులు అంతా వీడి గురించే" కొడుకు తలమీద చెయ్యి పెట్టి ఏడుస్తూ అంది సీతమ్మ.

"ఏడవకమ్మా! ధైర్యంగా వుండండి" వూరడింపుగా అన్నాడు రాయప్ప.

"అది పోయాక నేనూ చచ్చినదానితో సమానమే. దాన్ని చంపినోడు నన్నూ ఒక్కపోటు పొడిస్తే సరి పోయేది. యమయాతన పడుతున్నాను. దిక్కులేని పక్షు లను చేసింది బాబూ మమ్మల్ని" సీతమ్మ గోడు గోడున ఏడుస్తోంది.

తల్లి ఏడుస్తుంటే చంద్రశేఖర్ గూడ వెక్కి వెక్కి ఏడవసాగాడు.

సీతమ్మ వూరడిల్లడానికి చాలాసేపు పట్టింది.

"కుర్రవాడి గురించి నువ్వేమీ దిగులుపడకమ్మా! మీ అమ్మాయి గవర్నమెంట్ ఉద్యోగం చేస్తున్నది గదా! పదివేలు వస్తాయి. ఇంకా ఇన్సూరెన్స్, ప్రావిడెంట్ ఫండూ కొంత వస్తుంది—దాంతో బాగా చదువుకుని మంచి వుద్యోగం సంపాదించుకుంటాడు."

"ఆ డబ్బు మాకు ఎలా వస్తుంది బాబూ?" దిగులుగా అంది సీతమ్మ.

"ఏం? ఎందుకు రాదు?"

"అవన్నీ అల్లుడికే వస్తాయంటున్నారు."

"ఎందుకు వస్తాయి? మీ అమ్మాయి అతనూ వేరుగా వుంటున్నారు గదా? ఇద్దరికీ సంబంధం లేదన్నారు గదా? అదంతా నిజం కాదా?"

"నిజమే బాబూ! కొన్నాళ్ళు బాగానే వున్నారు. తర్వాత కీచులాటలు మొదలయ్యాయి. తాగి వచ్చి కొట్టే వాడట. మాకు డబ్బు యివ్వడానికి వీల్లేదని పట్టు పట్టే వాడట. అందుకే అమ్మాయి అతన్ని వదిలి వచ్చేసింది."

"మరింకేం? విడాకులు తీసుకోలేదా?"

"లేదు. కాగితాలన్నీ అతని పేరుతోనే వున్నాయట" అంది సీతమ్మ.

దీర్ఘంగా నిట్టూర్చాడు రాయప్ప.

"మీ అల్లుడికి అమ్మాయికీ మీ గురించి మనస్పర్ధలు వచ్చాయి. అంతేనా?"

"అంతేనని అమ్మాయి అనేది."

"అదికాక వేరే కారణం వుందని మీరు అనుమానిస్తున్నారా?"

"ఇంకా వేరే ఏముంటుంది బాబూ?"

రాయప్ప మాట్లాడలేదు. మళ్ళీ కలుసుకుంటానని ఆ ఇంట్లోనుంచి వచ్చేశాడు.

సాయంకాలం ఆరుదాటింది.

రామాటాకీస్‌కి వెళ్ళాడు.

అర్జునరావు సాదరంగా ఆహ్వానించి తన పర్సనల్ రూమ్‌లో కూర్చోబెట్టి, కూల్ డ్రింక్స్ తెప్పించాడు.

"ఏమైనా ఆధారం దొరికిందా?" ఆశగా ప్రశ్నించాడు అర్జునరావు.

"మీరు మనసు విప్పి ఏ విషయమూ చెప్పడంలేదు. నాకు ఏ ఆధారం దొరుకుతుంది?"

"నేను మనసు విప్పి చెప్పడం లేదా? భలేవారు సార్?" అదోలా నవ్వాడు.

"అవును. మీ మనసులో ఏదో వుంది. అది దాస్తు

న్నారు. సుమతిని మీరు హత్య చేసి వుండకపోవచ్చును. కాని ఆమె మిమ్మల్ని శిక్షించాలని కోరుకోవడం చూస్తే ఏదో బలమైన కారణం వుందని అనుమానిస్తున్నాను" అన్నాడు రాయప్ప.

అర్జునరావు తెల్లబోయి చూశాడు.

"మీరు నన్నొక స్నేహితునిగా భావించి చెప్పండి. లేకపోతే నేనేం చెయ్యలేను." అన్నాడు.

అర్జునరావు నిట్టూర్చాడు.

"సుమతి గవర్నమెంట్ హైస్కూల్లో టీచర్‌గా పనిచేస్తూ వుంది. ఆమె అందం నన్ను ఆకర్షించింది. ఇదంతా రెండేళ్ళ క్రితం జరిగింది. నా అంతస్థు, హోదా వల్ల యెన్నో ప్రయత్నాల తర్వాత సుమతి నన్ను ప్రేమించేటట్లు చేసుకున్నాను.

ఆమెకు ఈ వూళ్ళో యెవరూ లేరు. తల్లి, తమ్ముడు మాత్రం వున్నారు. అందువల్ల నేను అండగా వుంటానని ఆమె ఆశపడింది. నిజానికి ఆమెను నేను పెళ్ళి చేసుకోవాలని యెప్పుడూ అనుకోలేదు. పెళ్ళి చేసుకుంటానని నమ్మిస్తేగాని ఆమె నాతో శారీరక సంబంధం పెట్టుకోలేదు. నిజానికి ఆమెను పెళ్ళి చేసుకోవడానికి మా ఫాదర్ ఒప్పుకోడు. మా అంతస్థుకు తగిన సంబంధం కానేకాదు. ఇంట్లో గొడవ జరుగుతుంది—అదంతా నాకు తెలుసు.

సుమతి గూడా అనేక అనుమానాలు వ్యక్తం చేసేది. నేను ప్రేమ మత్తు ఎక్కించాను ఆమెకు. అందుకే నేను చెప్పినవన్నీ గుడ్డిగా నమ్మేది. నమ్మి నాతో షికార్లకు వచ్చేది. నాకు తన సర్వస్వం అప్పగించింది. భార్యా, భర్తలలాగే వ్యవహరించాం. ఎప్పటికప్పుడు పెళ్ళి సంగతి ఎత్తుతున్నా పెళ్ళయితే ప్రేమ తరిగిపోతుందని మాయ

మాటలు చెప్తూవుండేవాడిని.

ఒక రోజు పెళ్ళి చేసుకోవాల్సిందేనని పట్టుపట్టింది. కారణం ఏమిటంటే ఆమె గర్భం ధరించింది. పెళ్ళికి అది సమయం కాదని మా ఫాదర్ బిజినెస్ గొడవల్లో ఎంతో చికాకుల్లో వున్నాడనీ, కనీసం ఆర్నెల్లయినా ఆగాల్సిన పరిస్థితుల్లో వున్నాననీ నమ్మించాలని విశ్వప్రయత్నం చేశాను. ప్రస్తుతానికి అబార్షన్ చేయించుకోమని అన్నాను.

ఎంత గుట్టుగా అబార్షన్ చేయించుకున్నా గుట్టు రచ్చకెక్కుతుందని వాదించింది సుమతి. తనొక టీచర్ గా పని చేస్తున్నాననీ, అలా జరిగితే గౌరవం కోల్పోతాననీ ఒప్పుకోలేదు. నేను పెళ్ళికి ఒప్పుకోలేదు. సుమతి ఏడుస్తూ వెళ్ళిపోయింది.

సంవత్సరంపాటు సుమతి అందాన్ని అనుభవిస్తున్నా నాకు యింకా ఆమె మీద మోజు పోలేదు. ఆమె అందం అటువంటిది. చాలా చేర్ గా వుంటారు అటువంటి అందగత్తెలు. సుమతి గుండె నిబ్బరం గల మనిషి. ఆత్మహత్య చేసుకునేంత పిరికిది కాదు.

ఆమె అబార్షన్ చేసుకోవడానికి ఒప్పుకోవడం లేదంటే మరి ఏం చేస్తుంది? అని ఆలోచించాను. ఆమె గౌరవంగా బ్రతకాలంటే ఎవర్నో ఒకర్ని పెళ్ళి చేసుకుంటుంది. తన సమస్యని పరిష్కరించుకుంటుంది అని వూహించాను.

సుమతి నా చేతుల్లోంచి జారిపోతుందనుకుంటే నేను ఓర్చుకోలేకపోయాను. ఆమె అందం నా స్వంతం కావాలంటే ఏం చెయ్యాలని తీవ్రంగా ఆలోచించాను.

అప్పుడు నా దృష్టిలో నారాయణరావు మెదిలాడు.

వాడు నా క్లాస్ మేట్. నమ్మిన బంటు. చదువుకునే రోజుల్లో నా వుప్పు తిని బ్రతికినవాడు. నేను నిప్పుల్లో దూకమన్నా సందేహించకుండా దూకుతాడు.

వాడికి త్రాగుడు వ్యసనం వుంది. అందుకే పిల్లనివ్వ డానికి బంధువులు వెనకాడుతున్నారు. నేనే వాడికి ఒక ప్రైవేట్ కంపెనీలో సేల్స్‌మాన్ వుద్యోగం ఇప్పించాను. డ్యూటీలో మాత్రం తాగవద్దని బుద్ధి చెప్పాను. వాడు చూడడానికి అందంగా వుంటాడుగూడా.

నారాయణరావుని పిలిపించాను. అంతా చెప్పాను. సుమతిది వాళ్ళ కులమే. కనక సమస్యలేదు. ఎలాగైనా పెళ్ళి చేసుకోమని చెప్పాను. పెళ్ళయిన తర్వాత పెళ్ళికి ముందే గర్భవతివయ్యావనే సాకుతో గొడవపెట్టుకో మన్నాను. తర్వాత విడాకులు యివ్వమన్నాను. ఇదంతా నా స్వార్థమే. విడాకులు యివ్వడం ఇష్టంలేకపోతే అప్పు డప్పుడూ నాతో వుండడానికి ఒప్పించమన్నాను. అడిగి నంత డబ్బు ఇస్తానని ఆశపెట్టాను.

నేను చెప్పినట్టే చేశాడు నారాయణరావు. ఇద్దరూ విడిగానే వుంటున్నారు ఇప్పుడు.

కాని నేను అనుకున్నట్లు జరగలేదు.

సుమతి నాతో అబద్ధం చెప్పింది. ఆమె అసలు గర్భం ధరించలేదు. నన్ను పరీక్షించడానికి అలా నాటకం ఆడింది.

పెళ్ళయిన తర్వాత ఆ మిషతో గొడవ పెట్టుకోవ డానికి కుదర్లేదు నారాయణరావుకి.

ఆర్నెల్ల తర్వాత నాకు లొంగిపొమ్మని సుమతిని బల వంతం చేశాడు. కాని సుమతి ఒప్పుకోలేదు. పైపెచ్చు వాడిని వదిలేసి తల్లితో వుంటూ వచ్చింది."

"మనం అతన్ని అనుమానించవచ్చునా?" ప్రశ్నించాడు రాయప్ప.

ఏం చెప్పాలో తోచక చూస్తూ వుండిపోయాడు అర్జునరావు.

# 7

"వీరు డిటెక్టివ్ రాయప్పగారు!" అంటూ పరిచయం చేశాడు అర్జునరావు.

నమస్కారం చేశాడు నారాయణరావు.

"సుమతిని నువ్వే మర్డర్ చేశావని నేను అంటున్నాను" అన్నాడు రాయప్ప.

అదిరిపడ్డాడు నారాయణరావు.

సన్నగా పొడుగ్గా, ఎర్రగా వున్నాడు నారాయణరావు. అతిగా తాగడంవల్ల కాబోలు కళ్ళక్రింద నల్లగా చారలు ఏర్పడ్డాయి.

"నేనా? లేదుసార్! నేను సుమతిని మర్డర్ చెయ్యలేదు" వణుకుతున్న స్వరంతో అన్నాడు నారాయణరావు.

"నువ్వే చేశావు. ఆమె ఫ్యామిలీ బెనిఫిట్ స్కీమ్ లోను, ప్రావిడెంట్ ఫండుకీ, ఇన్సూరున్సుకీ నిన్నే నామినేట్ చేసింది. ఆ డబ్బు వస్తుందని ఆశపడి నువ్వు హత్యచేశావు" గట్టిగా అన్నాడు రాయప్ప.

"నో....సార్! నేను డబ్బుకోసం హత్యలు చేసేంత నీచుడిని కాదు."

"కాని డబ్బుకోసం కడుపొచ్చినదాన్ని చేసుకునేంత, డబ్బుకోసం పెళ్ళాన్ని పరాయి మగవాడి దగ్గరికి వెళ్ళమని బలవంతం చేసేంత నీచుడివా?" ఆవేశంగా అన్నాడు రాయప్ప.

అర్జునరావు కంగారుపడ్డాడు డిటెక్టివ్ స్వోరణి చూసి.

"సార్! మీరు...." అంటూ అడ్డురాబోయాడు.

"మీరు మాట్లాడకండి" అన్నాడు అర్జునరావుతో.

నారాయణరావు వుక్కిరి బిక్కిరై పోతున్నాడు రాయప్ప మాటలు వినేసరికి.

"నాకు తెలుసు. నేను వూహించగలను. డబ్బుకోసం నువ్వు హత్య చేశావు" గంభీరంగా పలికింది రాయప్ప కంఠం.

"సార్! మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారు. నాకు రక్తమంటేనే భయం. నేను అందులో నా భార్యను చంపుతానా?"

"ఆ ప్రశ్నకు నువ్వే సమాధానం చెప్పుకోవాల్సి వుంటుంది. ఆమెతో కాపురం చేసినంత కాలం జీతంలో కొంత తల్లికి యిచ్చి మిగిలినది నీ దోసిట్లో పోసేది నీ భార్య. నువ్వు అంతటితో తృప్తిచెందక ఆమెను నీ ఫ్రెండ్ అర్జునరావుకి తార్చి డబ్బు సంపాదించాలనుకున్నావు. కాని ఆమె ఒప్పుకోలేదు. నీ నీచత్వం గ్రహించి, నీతో తెగతెంపులు చేసుకుంది. ఇటు అర్జునరావు గూడా నీకు డబ్బు యివ్వడం లేదు. అటు పాడికుండలా వచ్చే డబ్బు ఆగిపోయింది. అందుకే డబ్బు పిచ్చితో ఆమె పోతే వచ్చే డబ్బు కోసం హత్య చేశావు."

నారాయణరావు చెవులు మూసుకున్నాడు బాధగా. అర్జునరావువంక చూశాడు యిదంతా ఆయనకు ఎలా తెల్సు అన్నట్లుగా.

అర్జునరావు బాధగా తల వంచుకున్నాడు. తలంతా భారంగా వున్నట్లయింది.

"నేను డబ్బుకోసం హత్య చేశానంటున్నారు గదా!

సుమతి ద్వారా వచ్చేదంతా ఆమె తల్లికి తమ్ముడికి ఇచ్చేస్తాను ఏమంటారు?" అన్నాడు నారాయణరావు.

"ఏమంటాను. హత్య చేశాక నీలో మానసిన పరివర్తన కలిగిందంటాను. అందువల్ల నువ్వు చేసిన నేరాన్ని కప్పిపుచ్చుకోవడానికిగాని, పాపపరిహారంగాగానీ ఈ మాత్రం త్యాగంలాటిది చేస్తున్నావంటాను. కాని హత్య చేసిన పాపం పోదు. శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు రాయప్ప.

"మీరు అన్నంతమాత్రాన నేను హంతకుడినై పోను" అన్నాడు నారాయణరావు.

# 8

మైదానం ప్రక్కనే రిక్షా దిగాడు రాయప్ప.

ఉదయం పదిగంటలు దాటింది.

ఎండ అప్పుడప్పుడే తీవ్రమౌతోంది.

ఆ మైదానం చాలా విశాలంగా వుంది. అక్కడక్కడా సర్కార్ తుమ్మపొదలు పెరిగివున్నాయి. కొంచెం గడ్డికూడా వుంది. చెట్లనీడల్లో గేదెలు, ఆవులు, వగైరా నెమరేస్తూ పడుకొన్నాయి. పందులు స్వేచ్ఛా విహారం చేస్తున్నాయి.

అంతకు ముందురోజే ఇనస్పెక్టర్ కృష్ణమూర్తితో హత్యాస్థలాన్ని చూసివెళ్ళాడు. కాని నిశితంగా పరీక్షించలేదు.

ఏదైనా ఆధారం దొరుకుతుందేమోనని ఆశ.

సుమతి భర్త నారాయణరావు త్రాగుడికి బానిస. అర్జునరావుకు నమ్మినబంటు. డబ్బుకోసం భార్యని తార్చడానికి ఒప్పుకున్నాడు. తన భార్యను అంతకుముందే అర్జునరావుతో సంబంధం వుందని తెలిసే చేసుకున్నాడు.

కనుక అర్జునరావుతో గడపడానికి ఆమె తిరస్కరిస్తుందని వూహించలేకపోయాడు.

కాని సుమతి అర్జునరావు తనని జన్మలో పెళ్ళి చేసుకోడని ఆలస్యంగా గ్రహించింది. నారాయణరావుని పెళ్ళి చేసుకున్నాక మనస్ఫూర్తిగా కాపురం చేసింది.

నారాయణరావు నిజస్వరూపం తెలుసుకుని అసహ్యించుకుంది. అతన్ని వదిలి వచ్చేసింది. దురదృష్టవశాత్తు ఆమె తల్లికి లుకేమియా జబ్బు చేసింది. నారాయణరావుతో కోర్టుద్వారా తెగతెంపులు చేసుకునే అవకాశం వచ్చివుండకపోవచ్చును. భార్యాభర్తల మధ్య వచ్చిన కలతలు కలకాలం వుండవనీ మళ్ళీ ఇద్దరూ కలుసుకోవడానికి అవకాశం కలగవచ్చనే ఆశతో ఆమె తల్లి విడాకుల ప్రసక్తి ఖండించి వుండవచ్చును.

మైదానంలో తిరుగుతూ ఆలోచిస్తున్నాడు రాయప్ప.

అక్కడక్కడ దుర్వాసన ముక్కులను బ్రద్దలు చేస్తోంది.

మైదానం మధ్యలో పాడుబడిన మండపం వంటిది ఒకటి వుంది. పూర్తిగా రాళ్ళతో కట్టారు. ఎప్పుడో సత్రంలాంటిదై వుంటుంది. ఎత్తుగా వుంది. పైనమాత్రం ఇటుకలలో, సున్నం కలిపి రూఫ్ వేశారు. గోడలన్నీ శిథిలావస్థలో వున్నాయి.

దాని చుట్టూ తిరిగి చూశాడు. లోపలంతా మట్టి, చిన్నచిన్న రాళ్ళూ వున్నాయి. కర్రతో తడిమి తడిమి చూశాడు. రాళ్ళను తొలగించాడు. ఏదైనా క్రొత్తగా త్రవ్వి పూడ్చిపెట్టిన గుంటలాంటిది కనిపిస్తుందేమోనని. ఏమీ ప్రయోజనం లేకపోయింది.

నెమ్మదిగా మండపం ఎక్కి నిల్చున్నాడు.

ఒకప్పుడు ఆ మైదానం వూరి చివర వుంది. ఇప్పుడు వూరు పెరిగింది. మైదానానికి ఆనుకుని వుంది.

కుడిప్రక్కన పొడుగ్గా తారురోడ్డు వూళ్ళోకి పోతూ వుంది. రెండు ప్రక్కలా ఇళ్ళు దగ్గర్లోనే వున్నాయి. మూడో ప్రక్కన ఇళ్ళు లేవు. నాలుగైదు అడుగుల ఎత్తు ప్రహరీగోడలో వున్న స్మశానం వుంది. అది క్రైస్తవుల బరియల్ గ్రౌండ్. అన్నీ శిలువలు కనిపిస్తున్నాయి.

మండపం దిగి స్మశానం వైపు వెళ్ళాడు. చుట్టూ తిరిగాడు. ఇనుప గేటు తాళం వేసివుంది. లోపలకి తొంగి చూశాడు. ఎవరూ వున్నట్లు లేదు.

గోడదూకి లోపలకు ప్రవేశించాడు.

హత్య చేసిన వ్యక్తి జగపతిరావు కారు ఆపి రాగానే పారిపోయాడు. అంటే అతను ఈ స్మశానంలోనే దాక్కుని వుండొచ్చు. కారు వెళ్ళిపోయాక వెళ్ళిపోయి వుంటాడు.

హత్యచేసిన కత్తి ఈ స్మశానంలోనే ఎక్కడో పాతి పెట్టి వుంటాడు.

ఆమెను కత్తితో పొడిచినప్పుడు అతని బట్టలమీద నెత్తురు చిందివుండవచ్చును. ఆ బట్టలు ఏం చేశాడు.

రాయప్ప ఆలోచిస్తూనే ప్రతి సమాధిని పరీక్షగా చూస్తున్నాడు. చూసి చూసి విసుగుపుట్టింది. ఎండలో చాలా సేపటి నుంచి తిరగడంవల్ల చెమట పట్టింది ముఖమంతా.

ఒక మూలనవున్న వేపచెట్టు నీడలో నిల్చున్నాడు కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ.

కళ్ళమీద ఏదో వెలుతురు పడింది. కొంత దూరంలో ఏదో మెరుస్తోంది. సూర్యుడి కిరణాలుపడి రిఫ్లెక్షన్ అతని

కళ్ళమీద పడుతోంది.

కళ్ళు పెద్దవిచేసి చూశాడు రాయప్ప.

చాలా పురాతనమైన సమాధి క్రింద ఏదో మెరుస్తోంది. దగ్గరికి వెళ్ళి చూశాడు రాయప్ప.

అదొక చిన్నకన్నం. ఎలుకకన్నంలాంటిది. దాంట్లో నుంచి కొంచెంబైటికి వచ్చిన గుడ్డలో నుంచి వస్తోంది మెరుపు. అది కత్తిపిడి. కర్చీఫ్‌తో లాగాడు. గుడ్డలో చుట్టిన కత్తి. అది స్టెయిన్‌లెస్ స్టీల్ కత్తి. నెత్తురు అంటుకున్న కత్తి. దానికి రెండువైపులా పదునువుంది. ఆ గుడ్డ హంతుడి లాల్చి.

రాయప్ప ముఖం సంతోషంతో వికసించింది.

## 9

"రండి సార్! రాయప్పగారూ. ఎంతవరకూ వచ్చింది మీ పరిశోధన?" నవ్వుతూ ఆహ్వానించాడు ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి.

రాయప్ప నవ్వుతూ హేండ్‌బేగ్ టేబిల్‌మీద పెట్టాడు.

"ఏమిటిది?"

"అందులో హత్యచేసిన కత్తి హంతుడి లాల్చి వున్నాయి" తాపీగా అన్నాడు రాయప్ప.

సంచీ తల్లక్రిందులుగా బోర్లించాడు. కత్తి, లాల్చి క్రిందపడ్డాయి.

ఆశ్చర్యంగా చూశాడు కృష్ణమూర్తి.

"మొత్తానికి సాధించారు" మెచ్చుకోలుగా అన్నాడు.

"ఆ కత్తిమీద వేలిముద్రలు ఏవైనా దొరుకుతాయేమో చూడండి. తర్వాత లాల్చి మెడమీద యస్.ఆర్. టైలర్స

అనే లేబుల్ వుంది. ఆ టైలర్‌ని పిలిపించండి" అన్నాడు రాయప్ప.

టైలర్‌ని పిల్చుకురావడానికి హెడ్‌ని పంపించాడు కృష్ణమూర్తి.

"అతను వస్తే ఆ లాల్చీ ఎవరికి కుట్టాడో అడగండి. నేనీలోపల కొంచెం పని చూసుకుని వస్తాను" అన్నాడు రాయప్ప.

అలాగేనని తల వూపాడు కృష్ణమూర్తి.

రాయప్ప నేరుగా సుమతి ఇంటికి వెళ్ళాడు.

ఇంట్లో ఆమె తల్లి మంచంమీద పడుకునివుంది. ఆమె తమ్ముడు ఇంట్లో లేడు.

"ఎలా వుంది మీ ఆరోగ్యం?" ప్రశ్నిస్తూ కుర్చీ దగ్గరికి జరుపుకున్నాడు.

"ఇంకేం ఆరోగ్యం నాయనా?.... నా పని అంతా ఐపోయింది" నీరసంగా అంది సీతమ్మ.

"దిగులుపడకండి. మీ అల్లుడు మీ అమ్మాయి ద్వారా వచ్చే డబ్బంతా మీకు ఇచ్చెయ్యడానికి ఒప్పుకున్నాడు" అన్నాడు.

ఆ మాట విని సీతమ్మ సంతోషించినట్లు కన్పించింది.

"అంతా భగవంతుడి దయ!" చేతులెత్తి కనిపించని దేవుడికి నమస్కారం చేసింది.

"నా దిగులంతా చంద్రం గురించే. నేనుగూడా పోతే వాడు దిక్కులేని పక్షి ఐపోతాడు."

"బాధ పడకండి. చంద్రానికి ఏ యిబ్బందీ లేదు. మీరేమీ అనుకోనంటే ఒక్కమాట అడుగుతాను" ఇబ్బందిగా అన్నాడు.

"అడుగు బాబూ!"

"మీ అమ్మాయి భర్తని వదిలేసి మీ దగ్గరికి వచ్చే సింది గదా! మరి విడాకులు ఇచ్చి వేరే ఎవర్నయినా పెళ్ళి చేసుకోవాలని అనుకుందా? అటువంటి ఉద్దేశ్యం వున్నట్లు మీ కేమైనా అనిపించిందా?"

సీతమ్మ దిక్కులు చూస్తూ "ఆ సినిమాహాలోడు పడ నిచ్చాడా నాయనా. నిండు ప్రాణాన్ని తీశాడుగా. లేక పోతే మళ్ళీ పెళ్ళి చేసేదాన్నే" అంది.

"మీరు చేసేవారు సరే. నారాయణరావుతో తెగ తెంపులు చేసుకుంటే సరిపోయేది గదా! ఎందుకు విడా కులు తీసుకోలేదు?"

"ఎక్కడ బాబూ! నా రోగం రొంత. వాడేమో అప్పుడప్పుడూ వచ్చి బ్రతిమాలుతూ వుండేవాడు. పోనీ ఎప్పటికైనా దాని సంసారం చక్కబడుతుందేమోనని అనిపించేది. కాని అమ్మాయి మాత్రం యిక కాపురం చెయ్యనని మొండికేసేది."

"అయితే అతన్ని వదిలిపెట్టదల్చుకుంది గాని వేరే ఎవర్నయినా పెళ్ళి చేసుకునే వుద్దేశ్యం వున్నట్లు మీకు అనిపించలేదా?"

"దాని మనసులో ఏముందో? నాకు మాత్రం ఏమీ చెప్పేది కాదు బాబూ! సంపాదించి తెచ్చి పోషిస్తోంది నా మాట ఎప్పుడు మాత్రం విన్నది బాబూ! ఆ సినిమా వాడిని నమ్ముకోవద్దని పోరుపెడితే విన్నదా? ఏదో వుద్ధరిస్తాడని ఆశపడింది. బాగా మోసం చేశాడు. పెళ్ళి చేశాను ఎలాగో. కాని అదీ అట్లా తగలబడింది. చూడు బాబూ అన్యాయం. దాని తిప్పలు అది పడుతుంటే చూశావా ఆ సినిమావాడు పగబట్టి పొడిచి చంపాడు" సీతమ్మ ఏడుపు మొదలుపెట్టింది.

తనకు పనికివచ్చే సమాచారం ఆమెనుంచి రాదని గ్రహించి, ఆమెను వూరడించి బైటపడ్డాడు.

తర్వాత ఇంద్రభవన్‌లో భోజనంచేసి సుమతి పని చేసిన హైస్కూలుకి వెళ్ళాడు. అది గరల్స్ హైస్కూలు.

హెడ్‌మిస్ట్రెస్ వేదవతిని పరిచయం చేసుకున్నాడు.

"చెప్పండి మీకు ఏం కావాలో?" అంది.

"సుమతి క్లోజ్ ఫ్రెండ్ ఎవరైనా మీ స్టాఫ్‌లో వుంటే కావాలి. కొంత సమాచారం కావాలి నాకు" అన్నాడు.

"సుమతి ఫ్రెండ్ మిస్ రేచల్‌కుమారి. పిలిపించ మంటారా?"

తల వూపాడు రాయప్ప.

హెచ్.ఎం. బెల్‌కొట్టి అటెండర్ రాగానే రేచల్ కుమారిని పిల్చుకొని రమ్మంది.

కాసేపటికి మిస్ రేచల్‌కుమారి వచ్చింది.

చామనఛాయలో, పొట్టిగా వుంది. పొతికేళ్ళు పైనే వుంటాయి ఆమెకు. ముఖంమీద స్ఫోటకం మచ్చలు-ఏమంత ఆకర్షణగాలేదు.

వేదవతి డిటెక్టివ్ రాయప్పను పరిచయం చేసింది ఆమెకు.

విష్ చేసి కూర్చుంది.

"సుమతి మీకు క్లోజ్ ఫ్రెండని తెలిసింది. ఆమె మర్డర్ కేస్ డీల్ చేస్తున్నాను. మీకు తెలిసిన వివరాలు దాచకుండా చెప్పండి. ఆమె మీతో స్వవిషయాలు చెప్పుకునేవారా?"

తల వూపింది.

"పర్సనల్ మేటర్స్ చర్చించేదా?"

"అదేం లేదుగాని దాచకుండా అన్నీ నాతో చెప్పు కునేది. అదొక తృప్తి అనుకుంటాను."

"అర్జునరావుతో ఆమెకున్న సంబంధం మీకు తెలుసా?"

తెలుసునన్నట్లు తల వూపింది.

"నారాయణరావుతో తనకు వివాదం యెందుకు వచ్చిందో చెప్పిందా?"

"అంతా చెప్పింది."

"అతన్నుంచి విడాకులు తీసుకోవాలని అనుకునేదా?"

"అవును. ఇక అతనితో సంసారం చేసే ప్రసక్తి లేదని చెప్పేది. అతన్ని తీవ్రంగా అసహ్యించుకునేది. అతన్ని పెళ్ళిచేసుకున్నందుకు ఎంతో బాధపడేది. అదొక పీడకల అనేది."

రాయప్ప తల వూపుతూ "ఆమె మరెవరినైనా పెళ్ళి చేసుకోవాలనే ఆలోచనలో వుందా?"

"ఆఁ..పీటర్ పాల్ అని మా కజిన్. ఆర్ట్సు కాలేజీలో లెక్చరర్‌గా వున్నాడు. అతను చాలా మంచివాడు. వుమెన్ లిబ్ పట్ల సానుభూతి వుంది. అతనికి సుమతితో పరిచయం నా ద్వారానే జరిగింది. ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారని నాకు చెప్పారు. ఆమె తల్లి పరిసితి బాగాలేదు. ఎక్కువ రోజులు బ్రతకదు. ఆమె చని పోయాక నారాయణరావుకి విడాకులు ఇచ్చి, పాల్‌ని పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకుంది."

"దట్సాల్ మిస్. థాంక్స్" మెరుస్తున్న కళ్ళతో అన్నాడు రాయప్ప.

జవాన్ ట్రేలో కాఫీ తెచ్చి ముగ్గురికీ ఇచ్చాడు.

"ప్లీజ్ టేకిట్" అంది వేదవతి.

కాఫీ సిప్ చేస్తూ వుంటే అతని మనసులో ఆలోచనా తరంగాలు వువ్వెత్తున లేచి పడుతున్నాయి.

ఇద్దరినుంచీ సెలవు తీసుకుని పోలీస్ స్టేషన్ వైపు దారి తీశాడు.

# 10

"మిస్టర్ నారాయణరావ్! సుమతి యిక నీకు దక్కదనీ, ఆమెనుంచి నీకు ఆదాయం రాదనీ తెలుసుకున్నావు. సుమతి పీటర్ పాల్ ని పెళ్ళి చేసుకోబోతుందని తెలిశాక పిచ్చికుక్కవయ్యావు. ఆ కోపంతో ఆమెను మైదానంలో మర్డర్ చేశావు."

నారాయణరావు ముఖం తెల్లగా పాలిపోయింది.

"మనుషుల్ని తక్కువ అంచనా వెయ్యకు. నువ్వు నేరం చేసినట్లు అదుగో ఆధారం. నెత్తురు చుక్కలున్న లాల్చీ. నువ్వు పొడిచిన కత్తి. దానిమీద నీ వేలిముద్రలు" రాయప్ప గొంతు ఖంగున మ్రోగుతోంది.

"థాంక్స్ మిస్టర్ రాయప్పగారూ!" సంతోషం పట్టలేక అర్జునరావు రాయప్ప చేతులు ప్రేమపూర్వకంగా పట్టుకున్నాడు.

"నో మెన్షన్. కాని జీవితాలతో చెలగాట లాడుకోవడం మానుకోవాలి మీరు. మీ బలహీనతే మిమ్మల్ని ఎప్పుడో కబళించివేస్తుంది. ఈ సారికి పులినోట్లో పడి అదృష్టవశాత్తు తప్పించుకున్నారు. అయినా సుమతి జీవితం అంతం కావడానికి మీరే కారణం" అన్నాడు రాయప్ప.

అర్జునరావు తల అవమానభారంతో వాలిపోయింది.

ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి, రాయప్ప వైపు అభిమానంగా చూశాడు.

—: ఐపోయింది :—

# మేడలో దెయ్యం

ప్రతాప రవిశంకర్

"కూర్చోండి" అన్నాను. నా ఎదురుగా టేబిల్‌కు అవతల నున్న కుర్చీలో కూర్చున్నాడాయన.

టేబిల్ మీద సిగరెట్టు ప్యాకెట్టును అందుకున్నాను. ఆయన నన్నే చూస్తున్నాడు. ఓ సిగరెట్టును నా పెదవుల మధ్య పెట్టుకుని ఇంకో సిగరెట్టు ఆయనకు ఇచ్చాను.

"థాంక్స్" అన్నాడు. దాన్ని తన దగ్గరవున్న లైటర్‌తో వెలిగించి పొగ పీల్చి "నా పేరు మహేంద్ర. ఆయిల్ ఎక్స్‌పోర్టింగ్ బిజినెస్ చేస్తున్నాను" అని చెప్పాడు.

తల పూపాను పొగ బయటకు వదులుతూ.

"మీ సహాయం కోసం వచ్చాను" అన్నాడు.

"చెప్పండి" అన్నాను.

ఆయన వయస్సు యాభై అయిదుకీ అరవైకీ మధ్య వుంటుంది. కాని అంత వయసున్నవాడిలా అనిపించటం లేదు.

"ఈ మధ్య నేనొక మేడను చాలా చౌకగా కొన్నాను. సుమారు ఆ మేడ మూడులక్షల పైనే చేస్తుంది. కాని నేను దాన్ని ఎనభైవేలకు కొన్నాను" అని ఆగాడాయన.

"అంత చీప్ గా ఎలా వచ్చింది? అమ్మిన వాళ్ళకు ఎస్సెట్ వాల్యూ ఎస్టిమేట్ వెయ్యటం తెలీలేదా?" అడిగాను నవ్వుతూ.

"కాదు. అన్నీ తెలిసే దాన్ని ఆ ఖరీదుకు అమ్మేశారు. అసలు ఆ మేడను కొనటానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. నేనే ధైర్యంచేసి కొన్నాను."

"అర్థమయింది. అదేదో దయ్యాలమేడ అయి వుంటుంది" అన్నాను.

మహేంద్ర "సరిగ్గా వూహించారు. అదే కారణం. అందరూ దాన్ని దయ్యాలమేడ అనే అంటారు. అందుకే దాన్ని కొనటానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. దాన్ని అమ్మచూపుతూ నాలుగు నెలల క్రితం పేపర్లో పడింది. నేను సంప్రదించాను ఆ ఇంటి ఓనర్ని.

ఆయనే అది దయ్యాలమేడ అనే విషయం చెప్పాడు. నేను ఆశ్చర్యపోయాను. అయితే ఆ మేడ ఆయనది కూడా కాదుట. ముప్పయ్యేళ్ళక్రితం దాన్ని యెవరిదగ్గరో కొన్నాడుట చవగ్గా. కొన్న నెల రోజుల్లోనే దాన్ని ఖాళీచేసి వేరే చోటుకి వెళ్ళిపోయాడుట. కారణం అందులో దయ్యం తిరుగుతుందని చెప్పాడు. నేను నమ్మలేదు.

అయినా అంత పెద్దమేడ ఎనభయివేలకి వస్తోంది. అందుకే వూరుకోలేక కొనేశాను.... దాన్ని పూర్తిగా బాగుచేయించాను. కాని ఇంతవరకు సంసారాన్ని ఆ మేడ లోకి మార్చలేక పోయాను."

"ఎందుకు?" అడిగాను.

"నా భార్య ఒప్పుకోటంలేదు. ఆమెకు దయ్యాలన్నా భూతాలన్నా చెప్పలేని భయం. అందుకే తను ఆ మేడ కొంటానంటే ఒప్పుకోలేదు. కాని దాన్ని ఎవరికయినా అద్దెకిస్తానని చెప్పి దాన్ని కొన్నాను. బాగు చేయించిన తర్వాత అందులోకి ఎవ్వరూ అద్దెకు కాదుగదా పూరికే వచ్చి వుండమన్నా రారని తెలిసిపోయింది. ఆ మేడ గురించి అందరికి తెలుసుట.

దాన్ని ఖాళీగా వుంచటం ఇష్టంలేక నా ఫామిలీని ఆ మేడలోకి మారుస్తానన్నాను. కాని నా భార్య తను ఆ మేడలోకి రానంటోంది. మిగిలినవాళ్ళు—అంటే నా ఇద్దరు కూతుళ్ళూ, కొడుకూ ఒప్పుకున్నారు. వాళ్ళకు నాలాగే దయ్యాలంటే నమ్మకం లేదు. దయ్యం యెలా వుంటుందో చూడాలనే క్యూరియాసిటీతో వున్నారు. కాని నా భార్యే ఆ మేడలోకి రానంటోంది...." చెప్పాడాయన....

సిగరెట్టును యాష్ ట్రేలో కుక్కి "ఇంతకీ నా సహాయము మీకు ఏ విధంగా కావాలో చెప్పలేదు" అన్నాను.

"చెబుతాను. ముందు నాకు ఈ విషయం చెప్పండి. మీకు దయ్యాలమీద నమ్మకం వుందా? దయ్యాలున్నాయంటే నమ్ముతారా?" అనడిగాడు మహేంద్ర.

"దయ్యాలున్నాయి" అన్నాను నవ్వుతూ.

మహేంద్ర ఆశ్చర్యపోయాడు.

"మీరు డిటెక్టివ్‌లు. డిటెక్టివ్‌లుకూడా దయ్యాలున్నాయంటే నమ్ముతారా?" అన్నాడు.

"డిటెక్టివ్ అయినంత మాత్రాన దయ్యాలున్నాయని

నమ్మకూడదని ఎక్కడా లేదు. నా నమ్మకం నాది. కొంత మంది మేధావులే దయ్యాలున్నాయని ఒప్పుకున్నారు. మానవాతీతమయిన శక్తులు తప్పకుండా వున్నాయి. వాటినే మనం దయ్యాలనుకోవచ్చు. ఇంకేమయినా అను కోవచ్చు."

ఆయన ఒక్కక్షణం ఏదో ఆలోచించి "ఆల్ రైట్, మీ నమ్మకంతో నాకు పనిలేదు. నేను దయ్యాలున్నా యంటే నమ్మను. నేనేకాదు నా యింట్లో నా భార్య తప్పించి ఎవ్వరూ నమ్మరు. ఇప్పుడు నేను మీ దగ్గరకు వచ్చింది నా భార్యనుకూడ ఆ మేడలోకి తీసుకువెళ్ళే ప్రయత్నం గురించే. మీరు నాకు ఏ విధంగా సహాయ పడాలో చెబుతాను" అని యింకో సిగరెట్టు ముట్టించాడు మహేంద్ర.

నిజంగా ఇది నాకు కొత్తకేసే. ఇలా నా దగ్గరకు వచ్చేవాళ్ళకు దయ్యాలంటే నమ్మకం ఉంటుంది. కాని మహేంద్రకు లేదు.

నేనుకూడా సిగరెట్టు వెలిగించి "చెప్పండి"అన్నాను.

"మీ పరిశోధనల గురించి నా భార్యకు బాగా తెలుసు. మీరు మంచి డిటెక్టివ్ అనే అభిప్రాయం మా ఇంట్లో అందరికీ వుంది. అందువల్ల మీరు నాతో మా యింటికి రండి. నా భార్యతో మాట్లాడండి. దయ్యాలనేవి లేవనీ కేవలం మనుషుల భయంవల్లనే అటువంటి భ్రమ కలుగు తుందనీ ఆమెతో చెప్పండి. ఆమెకు దయ్యాలమీద వున్న నమ్మకాన్ని పోగొట్టండి. ఎలాగయినా ఆమె మాతో పాటు ఆ కొత్తమేడలోకి వచ్చేలా చెయ్యండి" అన్నాడు మహేంద్ర.

నవ్వాను....మహేంద్ర బాగా తెలివయిన మనిషిలా

అనిపించాడు. నా నమ్మకం గురించి ఆయనకు చెప్పినా కూడా తన భార్యను ఒప్పించటం కోసం నన్ను అబద్ధాలు చెప్పమని అడుగుతున్నాడు.

"క్షమించండి. దయ్యాల నేవి లేవని నేను మీ భార్యకు చెప్పలేను. ఎందుకంటే నా దృష్టిలో దయ్యాలున్నాయి. అయినా అసలు దయ్యాలు వున్నాయా? లేవా? అని మీ భార్యకు చెప్పటం అంత ముఖ్యం కాదు అనుకుంటాను. ఆ మేడలో దయ్యాలు వున్నాయో లేవో తెలుసుకోవటం ముఖ్యం.

ఎక్కడో దయ్యాలు వుంటే ఎవరికీ నష్టం లేదు. కాని ఆ మేడలో అందరూ అనుకుంటున్నట్టుగా దయ్యాల నేవి వుంటే మీకు నష్టం.... కాబట్టి ఆ మేడలో దయ్యాలు వున్నాయో లేవో తేల్చి చెప్పమంటే చెబుతాను" సిగరెట్టు పొడి రాల్చుతూ అన్నాను.

మహేంద్ర వెంటనే మాట్లాడలేదు. చాలా సేపు ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఆల్ రైట్.... మీరు చెప్పింది నాకు సరయినదిగానే అనిపిస్తోంది. ఆ మేడలో దయ్యాలున్నాయనే నమ్మకం నాకు లేదు. నా భార్యకు వుంది. నా భార్య భయం పోగొట్టటం నాకు ముఖ్యం. కాబట్టి మీరు మాతో పాటు ఆ మేడలోకి రండి. మాతో వుండి ఆ మేడలో దయ్యాలున్నాయో లేవో పరిశోధించి చెప్పండి. నిజంగా దయ్యాలుంటే ఆ మేడను వదిలేస్తాం.... లేకపోతే నేను యెంతో సంతోషిస్తాను.... ఏమంటారు?" అన్నాడు.

"మీ ఇష్టం. మీరు ఆ కొత్త మేడలోకి యెప్పుడు ప్రవేశిస్తారో చెప్పండి. నేనుకూడా వస్తాను."

"అలాగే. ఈరోజు సాయంత్రం ఓసారి మా ఇంటికి

రండి. నా భార్యతో మాట్లాడండి. మీరుకూడా మాతో వస్తున్నారంటే ఆమె సంతోషిస్తుంది. తర్వాత మీ పరిశోధన ప్రారభించవచ్చు."

సరే నన్నాను.

"థాంక్స్ జగదీష్‌గారూ .... ఇక నే వెళతాను. సాయంత్రం తప్పకుండా ఆరుగంటలకు మా యింటికి రండి. మీకోసం ఎదురుచూస్తూ వుంటాం...." అని తన ఎడ్రసువున్న కార్డుయిచ్చి వెళ్ళిపోయాడు మహేంద్ర.

మేడలో దయ్యం గురించి ఆలోచనలో పడిపోయేను.

## 2

సాయంత్రం ఆరుగంటలయింది.

స్కూటర్‌ని మహేంద్ర ఇంటిముందుకు పోనిచ్చి ఆపాను. గేటు తెరిచే వుంది. లోపలకు వెళ్ళి ఆపాను.

బయటకు వచ్చిన మహేంద్ర నన్ను నవ్వుతూ విష్‌చేసి "రండి" అంటూ లోపలకు తీసుకువెళ్ళాడు.

బయటకంటే కూడా మహేంద్ర ఇల్లు లోపల బావుంది. చిన్న మేడ అయినా నీట్‌గా వుంది.

హాలులో కూర్చున్నాము.

తన వాళ్ళందరినీ పరిచయం చేశాడు మహేంద్ర.

ఆయన భార్య రంజితకు నలభయి అయిదేళ్ళు పయినే వుంటాయి. అయినా ఆమె అంత వయసువున్న మనిషిలా కనిపించలేదు. ఆమె అలంకరణే అందుకు కారణమనుకుంటాను. వంటినిండా నగలు వున్నాయి. మంచి ఖరీదయిన చీర కట్టుకుంది. జుట్టును ఫాషన్‌గా ముడివేసుకుంది. చెవులకు ఎర్రరాతి దుద్దులు. పెదవులకు లిప్‌స్టిక్. లావుగా పొడుగ్గా వుంది.

మహేంద్ర ఇద్దరు అమ్మాయిలుకూడ అందంగానే

వున్నారు. ఆయన పెద్దకూతురు అరవింద, తన చెల్లెలు సుకన్యకంటే అందంగా వుంది. ఆరవిందకు పాతికేళ్ళ వరకూ వుంటాయి. మాచింగ్ డ్రెస్ వేసుకుంది. సింపుల్ గా అలంకరించుకుంది. మెళ్ళో ఓ గోల్డుచెయిన్ వుంది. చెవులకు రింగులు. రెండు చేతులకూ ఒక్కో గాజు. నవ్వు మొహం.

సుకన్య కొంచెం సన్నగా, పొడవుగా వుంది. కోల మొహం. ప్యాంటు, షర్టు వేసుకుంది. ఎడమ చేతికి వాచీ, చెవులకు రింగులు. రిజర్వ్‌డుగా వుండే మనిషిలా అనిపించింది చూడగానే.

మహేంద్ర ఒకే ఒక్క కొడుకు సురేష్‌కు పదిహేను ఏళ్ళున్నాయి. ఎర్రగా, బొద్దుగా వున్నాడు. మంచి యాక్టివ్ మనిషిలా అగుపించాడు.

"మీరయినా ఈయనకు చెప్పండి జగదీష్‌గారూ.... ఇప్పుడు ఆ దెయ్యాల మేడలోకి వెళ్ళకపోతే ఏమయ్యింది? నాకు దయ్యాలున్నాయంటే నమ్మకంతోపాటు అవంటే బాగా భయంకూడా వుంది. నేను అందుకే ఆ మేడలోకి రానని అంటున్నాను. కాని నా మాటను ఎవ్వరూ వినడము లేదు. నాకు తప్పించి యీ యింట్లో యెవ్వరికీ దయ్యాలంటే నమ్మకం లేదు. అది నా దురదృష్టం.... మీరయినా నా బాధను అర్థం చేసుకొని వీళ్ళకు నచ్చ చెప్పండి" అన్నది మహేంద్ర భార్య రంజిత.

అందరం హార్లిక్స్ తాగుతున్నాం.

భార్య మాటలకు భర్త ఆమె కూతుళ్ళు — కొడుకూ నవ్వారు.

"నువ్వు ఇంత పిరికిదానవేం మమ్మీ. అసలు దయ్యమంటే ఎలా వుంటుంది? చెప్పు...." అన్నది అరవింద.

"దాని అంతు చూస్తాను" అన్నాడు సురేష్.

"ఇదీ జగదీష్‌గారూ వీళ్ళ వరస. ఇలా నన్ను వేధిస్తున్నారు" అన్నదామె నాతో.

ఆమె మాటలకు నవ్వి...."మీరు భయపడ వలసిన అవసరం ఏ మాత్రంలేదు రంజితగారూ — నేనుగూడా మీతో ఆ దెయ్యాల మేడలోకి వస్తాను. దెయ్యాలు ఆ మేడలో వున్నాయో లేవో తేలేవరకూ మీతోనే కలసి వుంటాను. నామీద మీకు ఏ మాత్రం నమ్మకం వున్నా ఆ మేడలో తిరుగుతున్న దెయ్యాల గురించి భయపడకండి. మీరు మీ ఇంట్లో మిగిలిన మనుషుల్లా నిశ్చింతగా వుండండి" అన్నాను.

"నేను ఆ ధైర్యంతోనే ఆ మేడలోకి వీళ్ళతో రావటానికి ఒప్పుకున్నాను. ఈయన ఉదయం మిమ్మల్ని కలుసుకున్నట్టు మీరు మాతో ఆ మేడలోకి వస్తున్నట్టు చెప్పారు. అప్పుడు నాకు ధయిర్యం వచ్చింది. చూద్దాం, యెవరి నమ్మకం గెలుస్తుందో" అన్నది రంజిత.

"నువ్వే ఒప్పుకోంటావు మమ్మీ దయ్యాలు, భూతాలు అనేవి లేవని. తప్పకుండా నువ్వే ఓడిపోతావు. ఎవరో పిరికివాళ్ళు సృష్టించినవి ఈ దయ్యాలు, పిశాచాలు...." అన్నాడు సురేష్ నవ్వుతూ.

"ఒరేయ్....అలా అనకు" అన్నది రంజిత.

వాళ్ళందరూ కలిసి రంజితను పెడుతున్న అవస్థను చూస్తే నాకు నవ్వొచ్చింది. పాపం.... ఈ దెయ్యాల గొడవలో ఆమెకు సపోర్టులేదు. ఒంటరిదయిపోయింది.

"మరి నే వెళ్ళొస్తాను. మీరు ఎప్పుడు ఆ మేడలోకి ప్రవేశిస్తారో చెప్పండి. నేను సిద్ధంగా వుంటాను...." అన్నాను లేచి నిలబడి మహేంద్రతో.

ఆయన తల వూపాడు.

"థాంక్స్ జగదీష్ గారూ....మీతో కొన్ని రోజులు గడిపే అదృష్టాన్ని పొందుతున్నందుకు సంతోషంగా వుంది" అన్నది అరవింద.

"థాంక్స్" అన్నాను.

వాళ్ళందరి వద్దా సెలవు తీసుకొని బయటకొచ్చాను.

దీపాలు అంతటా ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

"గుడ్ నైట్" అన్నది అరవింద.

"గుడ్ నైట్" అని స్కూటర్ స్టార్టు చేశాను.

రివ్వున దూసుకుపోతోంది స్కూటరు. నా కళ్ళ ముందు అరవింద రూపం కదులుతోంది.

# 3

"ఇతనెవరు?" అడిగాను మహేంద్రను. ఆయన ఇంట్లో నాకు ఓ అపరిచిత వ్యక్తి కనిపించాడు.

"హి ఈజ్ మిస్టర్ చంద్రం. నా చెల్లెలి కొడుకు. నిన్న సాయంత్రమే పూర్తిచేసి వచ్చాడు" అని నన్ను అతనికి పరిచయం చేశాడు మహేంద్ర.

"వెరీ గ్లాడ్ టు మీట్ యూ" అని కరచాలనం చేశాడు చంద్రం.

కొంచెం లావుగా పొడుగ్గా వున్నాడతను. ఆకర్షణీయమైన మొహం. వైట్ ప్యాంటు, స్కయ్ కలర్ షర్టు వేసుకున్నాడు. మీసాలు లేవు. పక్కకు దువ్విన క్రాఫు. చిన్న కళ్ళు.

"మీ పరిశోధనల గురించి ఇంతకుముందు చదివాను. ఇప్పుడు స్వయంగా చూడబోతున్నాను" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"మీరు ఇప్పుడేం చేస్తున్నారు?" అడిగాను.

"ఎమ్మే ఎగ్జామ్స్ రాశాను."

"మీరు వుండటం ఎక్కడ?"

"రాజమండ్రి."

ఆ తర్వాత అతను ఆ దయ్యాల మేడ గురించి మాట్లాటడం మొదలు పెట్టాడు.

"ఇందకీ మీకు దయ్యాలమీద నమ్మకం వుందా?" అడిగాను చంద్రంని నవ్వుతూ.

"దయ్యాలా"అని పెద్దగా నవ్వాడు.తర్వాత "వాటిని చూపించండి సార్. పట్టుకుని ఆడిస్తాను" అన్నాడు.

"మొత్తానికి ధైర్యవంతులే" అన్నాను.

"ధయిర్యం కాదు జగదీష్‌గారూ. దయ్యాల నేవి లేవనే గట్టి నమ్మకం. అంతకంటే ఏమీ లేదు. మనం సైన్సు దృష్ట్యా ఎంతో ముందుకు వెళుతున్నాం. కాని ఈ దయ్యాలు, భూతాలు అనే భయాలనుండి, భ్రాంతులనుండి బయట పడలేకపోతున్నాం. మీ లాంటి డిటెక్టివ్‌లు కూడా దయ్యాలున్నాయని నమ్మటం నాకు వింతగా వుంది" అన్నాడు అతను.

అతని మాటలకు నవ్వకుండా ఉండలేకపోయాను. నవ్వి "మనకంటే మేధావులే దయ్యాలు ఉన్నాయని ఒప్పుకున్నారు. మీ కంటికి కనిపించనంత మాత్రాన ఏదీ లేదని అనటం అంత న్యాయం కాదు. గాలి మనకు కనిపించదు. కాని దాని ఫలితాన్ని మనం అనుభవించ గలుగుతున్నాం. అలాగే దయ్యం కూడా. అది మనకు కనిపించకపోవచ్చు. దాని రిజల్టు మనకు కనిపించవచ్చు. అప్పుడు దాన్ని నమ్మక తప్పదు. నిజంగా ఆ మేడలోనే దయ్యం వుంటే ఈ విషయాలను మీరే ఒప్పుకుంటారు" అన్నాను.

"చూద్దాం....ఎప్పటినించో నాకు ఈ దయ్యాల గొడవ తేల్చుకోవాలనే ఆలోచన వుంది. అది ఈ రోజున నెరవేరబోతోంది" అన్నాడు.

ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకు మేమందరం ఆ కొత్త మేడలోకి ప్రవేశించాము.

బయల్దేరేముందు కూడా మహేంద్ర భార్య రంజిత "మీరు వున్నారనే ధైర్యంతోనే వస్తున్నాము జగదీష్ గారూ. లేకపోతే వీళ్ళు నన్ను బతకనివ్వరు" అన్నది నవ్వుతూ.

నిజమే. ఆమెకు సపోర్టు నేనొక్కడినే. చివరికి ఆ ఇంట్లో వంటవాడికీ, నౌకరుకి కూడా దయ్యాలున్నాయంటే నమ్మకంలేదు.

ఆ మేడలో నిజంగా దయ్యం ఉందో లేదోగానీ ఒకవేళ ఏ దయ్యమూ ఆ మేడలో లేకపోతే మహేంద్ర అదృష్టవంతుడే. ఎందుకంటే ఆ మేడ లక్షల విలువ చేస్తుంది. అంత పెద్ద మేడ అది. ఎన్నో విశాలమైన గదులు ఉన్నాయి.

ఆ మేడ కొన్నాళ్ళు పాడుబడిపోయి వుందనీ, ఆ తోట కొన్నాళ్ళు ఆలనాపాలనా లేకుండా ఉన్నదంటే ఎవ్వరూ నమ్మరు. దానిని మహేంద్ర పూర్తిగా మార్చేశాడు. దాన్ని బాగుచేయించడానికి ఆయన చాలా డబ్బు ఖర్చు చేశాడని తెలుస్తోంది.

ఆ మేడలో అన్ని వసతులూ వున్నాయి. రెండు మూడు గదులకు కలిపి ఓ బాత్‌రూం వుంది. మేడకు రెండువైపులా మెట్లు. విశాలమైన హాలు. పెద్దపెద్ద తలుపులు. ముందు ఎంతో ఖాళీ ప్రదేశం. ఓ పక్కగా

తోట. తోటలో పెద్ద పెద్ద చెట్లు వున్నాయి. చుట్టూ కుండీల్లో రకరకాల పూల మొక్కలు.

"బ్యూటీఫుల్. ఈ మేడలో నా దయ్యాలు వుండేది?" అని పెద్దగా నవ్వాడు చంద్రం.

"అవును జగదీష్‌గారూ. ఈ మేడను చూశారు గదా. మీ కేమని అనిపిస్తుంది? ఈ మేడలో దయ్యాలు వుండొచ్చు అనిపిస్తోందా?" అని అడిగాడు మహేంద్ర.

అందరం హాలులో వున్న సోఫాల్లో కూర్చున్నాము.

వంటవాడు అందరికీ కాఫీ తీసుకువచ్చి ఇచ్చాడు.

తాగుతున్నాము.

"అంటే మీ ఉద్దేశం ఏమిటి? అందంగా ఉండే మేడల్లో దయ్యాలు వుండకూడదనే రూలు ఏదయినా వుందా?" అడిగాను కప్పును టీపాయ్ మీద వుంచి.

"కరెక్టు. అలా అడగండి" అన్నది రంజిత భర్తను చూపిస్తూ.

"నా ఉద్దేశం అదే. దెయ్యాలు, భూతాలు, స్మశానాల్లో వుంటాయిగానీ ఇళ్ళలో వుండవు" అన్నాడు మహేంద్ర కొడుకు సురేష్.

"అంటే అసలు దయ్యాలనేవి వున్నాయని ఒప్పుకుంటున్నట్లేగా" అన్నాను అతన్ని.

"సారీ. నలుగురూ అనుకునేదాని గురించి చెప్పాను. నాకు దెయ్యాలమీద నమ్మకంలేదు" అన్నాడతను వెంటనే.

"అన్ని గదులూ చూశారా జగదీష్‌గారూ" అడిగింది అరవింద వక్కపొడి నములుతూ.

"ఇంకా కొన్ని గదులు చూడలేదు" అన్నాను.

"ఇంతకీ మీకు ఏ గది కావాలో సెలక్టు చేసు

కున్నారా?"

"ఇంకా లేదు. మీ గదుల సెలక్షన్ అయిపోయిందా?"

"ఆ. నేను మేడమీద మెట్లవయిపు నుంచి రెండో గదిని తీసుకున్నాను. నా గది పక్కనున్న గది ఖాళీగానే వుంది. ఆ తర్వాత గదులను వరుసగా సుకన్య, చంద్రం, సురేష్, డాడీ మమ్మీ తీసుకున్నారు. మరి మీకు ఏ గది కావాలో నిర్ణయించుకోండి" అన్నది నవ్వి.

"క్రింద గదుల్లో ఎవరు వుంటారు?" అడిగాను.

"వంటవాడు-నౌకరు" అన్నది రంజిత.

"నేను కూడా కింద ఓ గది తీసుకుంటాను" అన్నాను.

"క్రింద గదా! వద్దండీ! అసలే నేను భయంతో చస్తున్నాను. మీరు పైనే ఓ గదిలో వుండండి ఈ గొడవేదో తేలేవరకు. నాకు కొంచెం ధైర్యం వుంటుంది" అన్నది రంజిత.

"నువ్వు మరీ చిన్నదానిలా బిహేవ్ చేస్తున్నావ్ రంజితా. నేను లేనా? ఎందుకంత భయం?" అన్నాడు మహేంద్ర కొంచెం ఫీలయ్యి.

"మీరున్నారుగదా అంటారా. ఏం లాభం. నిజంగా ఏ దయ్యమో కనిపించి కేకపెడితే నిద్రకూడా లేవరు" అన్నది నవ్వుతూ.

రంజిత జోక్కి అందరూ నవ్వారు.

"సరే. అలాగే. నేను అరవింద గది పక్కనున్న గదిలో వుంటాను. అంటే మెట్లపక్కనే వున్న గది" అన్నాను.

"థాంక్ గాడ్ అయితే నాకు ఇక ఏ భయమూ లేదు" అన్నది అరవింద.

"దొరికిపోయారు. అయితే మీరు ఈ మేడలో

ఉన్నాయనుకుంటున్న దయ్యాల గురించి భయపడుతున్నా రన్నమాట" అన్నాను.

"నమ్మకం లేకపోయినా సహజంగా కొంత భయం ఉంటుంది గదండీ డిటెక్టివ్ గారూ" అన్నది అరవింద.

నవ్వుతూ సిగరెట్టు వెలిగించాను.

మహేంద్ర మా మాటలను వింటున్నాడు.

అరవింద మాట్లాడుతుంటే ఎంత సేపయినా వినాలని అనిపిస్తోంది. ఆమెనే చూడాలని అనిపిస్తోంది. అరవింద నన్ను ఆకర్షించటానికి ప్రయత్నిస్తున్నదా అనిపించింది.

ఆమె కళ్ళలోకి చూశాను. ఎటువంటి భావమూ కనిపించ లేదు.

ఉన్నట్టుండి సుకన్య, సురేష్ లేచి నిలబడ్డారు.

"ఎక్కడికి?" అడిగింది అరవింద.

"తోటలోకి" అన్నాడు సురేష్.

"నేను కూడా వస్తాను" అన్నాడు చంద్రం లేచి నిలబడుతూ.

"పదండి. అందరం కొంచెం సేపు తోటలో తిరిగి వద్దాం" అని లేచాడు మహేంద్ర.

బయటకు వచ్చాము.

నౌకరు గదులలోకి సామాన్లు సర్దుతున్నాడు. వంట వాడు కిచెన్‌లో వున్నాడు.

మేము దయ్యాల గురించి మాట్లాడుకుంటూ తోటలో తిరుగుతున్నాము.

అందరూ మాట్లాడుతున్నారు. కాని సుకన్య మౌనంగా నడుస్తోంది.

సుకన్య మనసు తెలుసుకోవడం కష్టమనపించింది.

చంద్రం ఇష్టం వచ్చినట్టు వాగుతున్నాడు. అరవిందను

ఏవో ప్రశ్నలు అడుగుతున్నాడు. అరవింద అతని ప్రశ్నలకు జవాబులు చెప్పకుండా నన్ను ఏవేవో అడగటం మొదలుపెట్టింది. ఆమెకు అతనితో స్నేహాన్ని పెంచుకోవటం ఇష్టంలేదనే విషయాన్ని గ్రహించాను.

తోటలో తిరుగుతూండగానే చీకట పడింది.

దీపాలు వెలిగాయి.

## 4

భోజనాలయ్యేసరికి రాత్రి తొమ్మిది గంటలయ్యింది. అందరికీ వక్కపొడి అందించింది అరవింద.

వంటకాలన్నీ బాగా రుచిగా వుండటంవల్ల నేను కొంచెం ఎక్కువగానే తిన్నాను. అందువల్లనే యాక్టివ్‌నెస్ కొంచెం తగ్గినట్లనిపించింది.

వక్కపొడి నములుతూ సిగరెట్టు వెలిగించాము నేను-మహేంద్ర.

"మీరు సిగరెట్లు కాల్చరా?" చంద్రంను అడిగాను.

"కాలుస్తాను. కాని రోజుకు ఒకే ఒక్క సిగరెట్టు కాలుస్తాను. ఇవాల్టి సిగరెట్టు వుదయమే కాల్చేశాను" అన్నాడు.

"గుడ్ కంట్రోల్" అన్నాను నవ్వుతూ.

"ఈ రాత్రి నాకు నిద్రపట్టదు" అన్నది రంజిత మా ఎదురుగా వచ్చి కూర్చుంటూ.

"పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోవద్దు రంజితా. ఏమీ ఆలోచించకుండా నిద్రపోవటానికి ప్రయత్నించు" కసిరాడు మహేంద్ర భార్యను.

ఆయనకు భార్య ప్రతినిముషం ఆ మేడలోవున్న దయ్యం గురించి భయపడటం నచ్చలేదు. ఆమె అలా అనుక్షణం భయపడటం సిల్లీగా అనిపిస్తోంది. కాని ఇటువంటి విష

యాలను నమ్మినప్పుడు సహజంగానే అలా ప్రతిక్షణం భయపడుతూ వుంటారని ఆయనకు తెలీదు.

నేనూ ఈ విషయంలో కలిగించుకుని "మీ కేలాంటి భయమూ లేదు రంజితగారూ. నేను వున్నాను కదా. కావాలంటే నేను మీ గదిముందే ఈ రాత్రి కాపలా కూర్చుంటాను. సరేనా?" అన్నాను.

"థాంక్స్ జగదీష్‌గారూ. మీరు మా గదిముందు కాపలా వున్నారంటే హాయిగా నిద్రపోతాను" అన్నది.

"మమ్మీ దయ్యాలకు కాపలాలు ఇలాంటివి పని చెయ్యవే. అవి ఎన్ని గడియలు పెట్టుకున్నా లోపలకు రాగలవంటారు" అన్నాడు సురేష్ తల్లిని మరింత భయపెట్టటానికి.

"యూ షటప్. సురేష్ వెళ్ళిపడుకో" కోపంగా అన్నాడు మహేంద్ర.

వెంటనే అక్కడినించి వెళ్ళిపోయాడు సురేష్.

అరవింద, చంద్రం నవ్వారు అతనలా తల వంచుకుని వెళుతుంటే.

"వీడు నన్ను మరీ భయపెడుతాడు జగదేష్‌గారూ" అన్నడి రంజిత.

"నాకూ నిద్ర వస్తోంది. ఇవాళ పగలు కూడా నిద్ర పోలేదు" అని అక్కడినించి లేచాడు చంద్రం.

"సుకన్య ఎక్కడ?" అడిగింది రంజిత.

"భోజనం చెయ్యగానే అది దాని గదికి వెళ్ళి పోయింది" చెప్పింది అరవింద.

"మీరు ఎన్ని గంటలవరకు మెలకువతో వుంటారు?" అడిగాడు మహేంద్ర నన్ను.

"ఈ రాత్రంతా మెలకువగానే వుంటాను. ఇది ఈ

మేడలో మొదటి రాత్రి. నిజంగా ఈ మేడలో దయ్యాలనేవి వుంటే అవి ఈ రాత్రి బయటకు రాకుండా వుండవు" అన్నాను.

"మీకు నిద్రరాకుండా టీ ఏర్పాటు చేస్తాను" అన్నది రంజిత.

"నో థాంక్స్. అలాంటివేమీ అవసరంలేదు. నా దగ్గర సిగరెట్లు చాలా వున్నాయి. అవి వుంటే నిద్ర రాత్రల్లా రాదు" అన్నాను నవ్వుతూ.

పది గంటలయ్యింది.

"ఇక మేము పడుకుంటాం" అన్నాడు మహేంద్ర వాచీ చూసుకుని.

తల వూపాను.

"నీకు నిద్ర రావటం లేదా?" అరవిందను అడిగింది రంజిత.

"నాకు పన్నెండు గంటలయితేగానీ నిద్రరాదు మమ్మీ" అన్నది.

"అయితే నువ్వు అప్పటివరకు డిటెక్టివ్ గారికి కంపెనీ ఇవ్వు. గుడ్ నైట్" అని భర్తతో కదిలింది రంజిత.

"గుడ్ నైట్" అన్నాను నేను మరో సిగరెట్టు వెలిగించబోతూ.

ఆమె రెండడుగులు వేసి వెనక్కు తిరిగి "మీరు మా గదిముందే కాపలా వుంటారు కదూ" అనడిగింది.

"అవును" అన్నాను నవ్వుతూ.

"థాంక్ యూ" అన్నదామె.

"మా మమ్మీకి మరీ భయం ఎక్కువ" అన్నది అరవింద నవ్వి.

"మీకు ధయిర్యం ఎక్కువనుకుంటాను."

"అంత ఎక్కువ కాదు. మమ్మీ్మకంటే నయం."

అందరూ ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఒక్కసారి అలా తోటలో తిరిగివద్దామా?" అన్నాను అరవిందతో.

"పదండి. తోటలో విహరిద్దాం" అన్నది అరవింద లేచి నిలబడి.

ఇద్దరం మేడలోనించి బయటకు నడిచాము.

బయట చీకటిగా వుంది.

తోటలో చెట్లు గాలికి అటూ ఇటూ కదులుతున్నాయి.

ఆ ప్రాంతంలో ఎక్కడా జనసంచారం లేకపోవటం వల్ల అంతా నిశ్శబ్దంగా వుంది.

మేడలో అక్కడక్కడ వెలుగుతున్న దీపాలకాంతి తోటలో చెట్లమీద పడుతోంది.

"ఈ వాతావరణానికి నేనొక్కదాన్నే అయితే భయపడతాను" అన్నది అరవింద.

"ఎందుకు? చీకటిగా వుందనా?"

"అవును. అంతే కాకుండా దయ్యాల్లా ఈ కదులుతున్న చెట్లు."

"అయితే దయ్యాలు చెట్లలా ఉంటాయంటారా?"

"ఏమో. అలా అనిపిస్తోంది."

చిన్నగా నడుస్తున్నాము. నా పక్కనే అరవింద అడుగులు వేస్తోంది. మొక్కల మధ్య అడుగులు వేస్తున్నాము.

అరవింద భుజాలు నాకు రాసుకుంటున్నాయి. గిలిగింతగా వుంది. ఆమె రాసుకున్న ఇంటిమేట్ సెంటు వాసన నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

పెద్దచెట్టు కిందకు వచ్చాము.

ఉన్నట్టుండి ఆ చెట్టుమీద నించి ఓ పక్షి రెక్కలు పెద్దగా చప్పుడు చేసుకుంటూ ఎగిరిపోయింది చీకట్లోకి.

చిన్న కేకతో — భయపడి అరవింద గబుక్కున నన్ను చుట్టుకుపోయింది.

షాక్....ఏదో విద్యుత్తు నాలోకి ప్రవేశించినట్లు అనిపించింది. అదురుతున్న ఆమె గుండెలు నాకు మెత్తగా తగిలాయి.

"భయపడకండి....అది పక్షి" అన్నాను నవ్వుతూ.

"సారీ...." అన్నదామె నన్ను వదలి.

"ఎందుకు సారీ....మీరు నన్ను నొప్పించలేదు. ఎనీ హౌ థాంక్స్" అన్నాను నవ్వి.

అరవింద సిగ్గుపడింది.

వాచీకేసి చూసుకొన్నాను.

పదకొండు గంటలుకు ఇరవై నిముషాలు తక్కువ.

"ఇక మీరు పడుకొంటారా?" అడిగానామెను.

"నాకు అప్పుడే నిద్రరాదు. కనీసం పన్నెండైనా కావాలి. ఇలాగే తిరుగుతూ మాట్లాడుకొందాం."

"ఎక్కడైనా కూర్చుందాం కొంచెంసేపు" అన్నాను.

సరేనన్నది.

తోటలోనుంచి బైటకొచ్చి మేడలోకి నడిచాము. బాల్కనీలో కూర్చున్నాము.

"అందరూ గాఢనిద్రలో వున్నారు" అన్నది అరవింద.

"ఈ మేడలోవున్న దయ్యం గురించి మరచిపోయినట్టు ఉన్నారు" అన్నాను.

"నిజంగా ఈ మేడలో దయ్యం వుందంటే మీరు నమ్ముతారా?" అడిగింది అరవింద.

"ఈ మేడలో వుందో లేదో తెలీదుగాని దయ్యాలు

అనేవి ఉన్నాయి. ఇది నిజం."

"ఏవైనా దయ్యం కేసులను మీరు పరిశోధించారా?"

"దయ్యం కేసులను పరిశోధించలేదు. కాని దయ్యాల పేరుతో మనుషులు నాటకమాడిన కేసులను పరిశోధించాను."

"ఈ మేడలోగూడా అలాగే జరుగుతున్నదేమో."

"తెలుస్తుంది కదా" అన్నాను సిగరెట్టు వెలిగిస్తూ.

అరవింద నా పరిశోధనల గురించి, హంతకుల మన స్తత్వం గురించి అడుగుతోంది.

చెబుతున్నాను.

ఒక్కసారి వాచీకేసి చూసుకొంటే పన్నెండు గంటలయింది.

"ఇక మీరు వెళ్ళి పడుకోండి....పన్నెండు దాటింది. నేను ఒకసారి మేడంతా తిరిగి వస్తాను" అన్నాను.

అరవింద అయిష్టంగానే నిలబడింది.

ఇద్దరం ఆమె గది దగ్గరకు నడుస్తున్నాము.

నాలుగడుగులు వేసేసరికి ఆ మేడ పెద్ద పొలికేకతో ప్రతిధ్వనించింది.

ఉలిక్కిపడింది అరవింద.

"ఎవరా కేక పెట్టింది? సుకన్యా?" భయంగా అడిగింది అరవింద.

"కాదు....మీ అమ్మ రంజిత" అని ముందుకు పరుగు తీశాను.

## 5

రంజిత—మహేంద్ర పడుకొని వున్న గది తలుపుమీద దబదబా బాదాను.

భళ్ళున తలుపులు తెరచుకున్నాయి.

ఎదురుగా మహేంద్ర నిలబడి వున్నాడు. ఆయన జుట్టంతా రేగివుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి.

"ఏమిటి? ఏమయ్యింది? రంజితగారు యెందుకలా కేక పెట్టారు?" గబగబా అడిగాను.

"ఏమో! నాకు తెలీదు?" అన్నాడు మహేంద్ర.

గదిలోకి నడిచాను. నా వెనుకే అందరూ వచ్చారు. చంద్రం—సుకన్య—సురేష్ — అరవింద — వంటవాడు— నౌకరు.

బెడ్ మీద కూర్చుని ఏడుస్తోంది రంజిత.

ఆమె గుండెలు అదురుతున్నాయి. ఆమె వీపు యెగిరి పడుతోంది.

"రంజితగారూ! ఏమయ్యింది? ఎందుకలా కేక పెట్టారు?" అడిగాను అనునయంగా.

ఆమె మాట్లాడలేదు....ఏడుస్తూనే వుంది.

అందరూ ఆమెను వింతగా చూస్తోన్నారు.

అసలు జరిగిందేమిటి?

ఎందుకు యేడుస్తోంది? మహేంద్రకు ఏమీ తెలీదా? ఇద్దరూ ఒకే గదిలో పడుకున్నారు.

"ఏమయ్యింది మమ్మీ...." అడిగింది అరవింద తల్లి భుజంమీద చెయ్యివేసి.

ఆమె మాట్లాడలేదు.

పమిటతో కన్నీళ్ళు తుడుచుకుంది.

"చెప్పండి....మీకు దయ్యం కనిపించిందా?" అడిగేను.

"కనుపించలేదు" అన్నది రంజిత చిన్నగా. ఆమె గొంతు పూడుకుపోయినట్లు అనిపించింది.

"మరెందుకలా కేక పెట్టారు?"

"సారీ.... చెప్పలేను."

"అది మీ పర్సనల్ విషయమా? అలాంటప్పుడు కేక పెట్టవలసిని ఆవసరం యెందుకు కలిగింది? మీ కేక భయంతో అరిచినట్టుగా అనిపించింది. నిజమేనంటారా?"

"అవును."

"చెప్పండి....ఎందుకు భయం? మీరెందుకు భయపడ్డారు? మీకేదయినా కల వచ్చిందా?"

"అవును."

"ఆ కలలో ఏం జరిగింది?"

"గుర్తులేదు" అన్నదామె మామూలుగా అయిపోయి.

ఆశ్చర్యంగా అనిపించింది ఆమె ప్రవర్తన. రంజిత ఏదో విషయాన్ని దాస్తున్నట్టుగా అనిపించింది. నిజానికి ఆమెకి కల రాలేదు. కలవచ్చి భయపడి అరచినట్లయితే ఆ విషయాన్ని అడగ్గానే చెప్పేది. ఇంత ఆలస్యం చేసేది కాదు. ఆలోచించి అబద్ధం చెబుతోంది. రంజితకు కల రాలేదు. మరి ఏమయ్యింది?

ఇక ఆమెను ప్రశ్నించ దలచుకోలేదు.

"ఆల్ రైట్ .... ఎవరి గదులకు వాళ్ళు వెళ్ళండి. ఎవ్వరూ ఈ మేడలో దయ్యం వుందనే విషయాన్ని గురించి ఆలోచించ వద్దు. ఆలోచిస్తే ఇలాంటి కలలే వస్తాయి. రంజితగారూ! మీరు నిశ్చింతగా పడుకోండి. నేను మీ గది ఎదుటే కుర్చీవేసుకుని కూర్చుంటాను తెల్లవార్లూ" అన్నాను.

"వద్దు జగదీష్‌గారూ. నేను ఈ గదిలో పడుకోను. అరవింద గదిలో పడుకుంటాను. ఈగది నాకు కలసి రాలేదు" అన్నదామె.

"మీ యిష్టం" అన్నాను.

అందరూ మౌనంగా ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్ళి

పోయారు.

రంజిత—అరవింద గదిలోకి వెళ్ళింది.

ఆ గదిలో మహేంద్ర ఒక్కడే నిలబడిపోయాడు. ఆయన మొహం అదోలా వుంది. ఎందుకో ఆయన్ను మాట్లాడించాలనిపించలేదు. మొత్తానికి ఆ గదిలో యేదో జరిగింది.

దాన్ని భార్యా భర్తలిద్దరూ దాస్తున్నారు.

ఐదు నిముషాల తర్వాత మహేంద్ర గది తలుపులను మూశాడు.

నిముషం సేపు ఆ గది దగ్గరే నిలబడి నా పహారా మొదలు పెట్టాను. సిగరెట్టు కాలుస్తూ నడుస్తున్నాను.

అరవింద గది దగ్గరకు వచ్చేసరికి రంజిత యేడుపు వినిపించింది.

క్షణం సేపు అక్కడే నిలబడ్డాను.

ఆమె ఆగి ఆగి యేడుస్తోంది.

రంజిత ఎందుకు ఏడుస్తోంది? ఆమె అలా యెందుకు వెర్రిగా కేక పెట్టింది.

## 6

బయట అంతా వెలుగు. సూర్యుడి కిరణాలు కిటికీ అద్దాలమీద పడి మెరుస్తున్నాయి.

నిద్ర లేచేసరికి ఉదయం పదిగంటలు కావస్తోంది. రాత్రంతా నిద్రలేక పోవటంవల్ల అంత సేపు నిద్ర పోయాను.

కళ్ళు తెరిచేసరికి నా గదిలోవున్న కుర్చీలో అరవింద కనిపించింది.

"గుడ్ మార్నింగ్ డిటెక్టివ్" అన్నది నవ్వుతూ.

ఆమె చేతిలో ఏదో నవల వుంది.

ఆశ్చర్యపోయాను.

"ఎంత సేపయ్యింది మీరు నా గదిలోకి వచ్చి?" అడిగాను.

"ఎన్నిగంటలని అడగండి. ఎనిమిదిన్నరకు వచ్చాను. అప్పటినించీ మీరు నిద్రపోవటాన్ని చూస్తున్నాను. చాలా గాఢమయిన కునుకు తీశారు" అన్నది నవ్వుతూ.

"మంచి అబ్జర్వేషన్.... థాంక్స్ ఫరిట్. ఇక్కడే కూర్చోండి. పదినిముషాల్లో స్నానంచేసి వస్తాను" అని ఆ గదిలోనించి బయటపడ్డాను.

పావుగంట తర్వాత నా గదిలో అడుగుపెట్టాను.

లోపలకు వచ్చేసరికి అరవింద కాఫీ-టిఫిన్‌ను నా టేబిలుమీద వుంచింది.

"థాంక్స్. మీరు నా పట్ల తీసుకుంటున్న ఇంట్రెస్టుకు?" అన్నాను టిఫిన్ ప్లేటు అందుకుంటూ.

"అలా అనకండి. మీరు మా అతిథి...." అన్నది నవ్వుతూ.

టిఫిన్ తింటూ అరవింద అందాన్ని పరిశీలనగా చూశాను.

ఆమె తలస్నానం చేసినట్టుంది. పట్టుకుచ్చులాంటి ఆమె కురులు బయటినించి వస్తున్న గాలికి చిన్నగా కదులుతున్నాయి. ఆమె జుట్టును ముడివేసుకోకుండా చిన్నక్లిప్ పెట్టుకుని వదిలేసింది. మేచింగ్ డ్రెస్. ఆమె అందం నన్ను పరవశుడిని చేస్తోంది.

కాఫీ తాగిన తర్వాత "మీరు నాకో విషయం చెబుతారా జగదీష్‌గారూ" అన్నది అరవింద తన కుర్చీని నాకు దగ్గరగా జరుపుకుంటూ.

"ఏమిటి?"

"రాత్రి మమ్మీ ఎందుకలా కేక పెట్టింది?"

"మీరు విన్నారు గదా! ఆమెకు ఏదో భయం కలిగించే కల వచ్చిందిట."

"అది నిజమేనంటారా?"

"నిజం కాదనే అనుమానం మీకు ఎందుకు వచ్చింది?"

"కల రావటమే నిజమయితే మమ్మీ అంతసేపు ఆగి వుండదు. మనం అడిగిన వెంటనే ఆ విషయాన్ని చెప్పెయ్యవచ్చు. కాని అలా చెప్పలేదు. అందుకే నాకు నమ్మ శక్యంగా లేదు."

ఆశ్చర్యమనిపించింది. అరవింద బాగా తెలివయినది. సహేతుకంగా ఆలోచించగలదు.

"మమ్మీకి దయ్యం కనిపించిందంటారా?" అడిగింది.

"కనిపించలేదని తనే చెప్పింది కదా!"

"అబద్ధం చెప్పిందేమో!"

"ఎందుకు?"

"నిజంగా ఈ ఇంట్లో మమ్మీకి, మీకు తప్పించి ఇంకెవరికీ దయ్యాలున్నాయంటే నమ్మకంలేదు. అటువంటప్పుడు మమ్మీ తనకు దయ్యం కనిపించిందని చెప్పినా ఎవరూ నమ్మరు. ఎందుకంటే మొదటినించీ దయ్యాల గురించి, భయపడుతున్నది తనే. అందుకే ఎవ్వరూ నమ్మకపోగా ఆమె భ్రమపడిందనీ, నిజంగా దయ్యాన్ని చూడలేదనీ అంటారు. తన మాట ఎవ్వరూ నమ్మరు కాబట్టి చెప్పినా ప్రయోజనం లేదని మమ్మీ ఆ విషయాన్ని దాచి వుంచిందేమో."

అరవింద వాదన నన్ను ముగ్ధుడిని చేసింది. ఆమె ఆలోచన సరయినదే. పదిమంది నమ్మకంలేని మనుషుల మధ్య ఒక్క నమ్మకం వున్న మనిషి ఏం చెప్పినా ఉపయోగం

లేదు.

"కాని ఆమెకు నా సపోర్టు వుంది అరవిందగారూ. అటువంటప్పుడు నాకయినా నిజం చెబుతుంది. నా కూడా చెప్పలేదంటే మీ మమ్మీకి దయ్యం కనిపించ లేదు."

"మరెందుకలా కేక పెట్టింది?"

"ఆమెకే తెలియాలి."

అరవింద మాట్లాడలేదు.

ఆలోచిస్తూ గది బయటకు చూశాను.

ఎవరిదో నీడ చిన్నగా కదులుతోంది.

"ఎవరు?" అన్నాను.

"నేనే" అంటూ లోపలకు వచ్చింది రంజిత.

"మీరా. గుడ్ మార్నింగ్" అన్నాను నవ్వుతూ.

అరవింద కుర్చీలోనించి లేచి నా మొహంలోకి చూసింది. అప్పటివరకూ మా ఇద్దరి సంభాషణా ఆమె విన్నదేమో అనిపించింది.

"అప్పుడే లేచారే? పన్నెండు గంటల వరకూ నిద్ర లేవరనుకున్నాను" అన్నదామె కుర్చీలో కూర్చుని.

"నాకు రోజుకు అయిదుగంటల నిద్ర చాలు" అన్నాను.

రంజిత మొహంలోకి చూశాను. ఇంకా ఆమె మొహం అదోలా వుంది. భయం తాలూకు నీడలు ఆమెను పూర్తిగా వదిలిపోలేదు.

"ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఎవరూ లేరా?"అడిగాను.

"లేరు. మనమూ వంటవాడే వున్నది."

మేము మాట్లాడుకుంటున్నప్పుడు అరవింద ఆ గదిలో నించి వెళ్ళిపోయింది.

కూతురు వెళ్ళగానే రంజిత లేచివెళ్ళి గది తలుపులను

దగ్గరగా మూసివచ్చి కుర్చీని నాకు మరింత దగ్గరగా జరుపు కుని "రాత్రి మీకు అబద్ధం చెప్పాను జగదీష్‌గారూ" అన్నది చిన్నగా.

"అనుకున్నాను" అన్నాను.

"ఎలా!" ఆశ్చర్యంగా అడిగింది.

చెప్పాను.

"నిజంగా మీరు తెలివయిన వారు. రాత్రి మీరు ఆ విషయాన్ని గురించి చెప్పమని నన్ను బలవంతం చేస్తారను కుని భయపడ్డాను. ఇంతకీ నేనెందుకలా కేక పెట్టానో చెప్పమంటారా?" అన్నది.

"చెప్పండి" అన్నాను కుతూహలంగా.

"ఆయన నన్ను గొంతు నొక్కి చంపబోయారు."

ఉలిక్కిపడ్డాను.

"నిజంగా!"

"అవును. నన్ను ఎవరో నొక్కినట్టు అనిపించి కళ్ళు తెరిచాను. ఆయన నన్ను రెండుకాళ్ళ మధ్య నొక్కిపట్టి రెండు చేతులనూ నా గొంతు చుట్టూ బిగిస్తున్నారు. ఆయన కళ్ళు ఎర్రగా వున్నాయి. జుట్టంతా రేగివుంది. చూడగానే భయపడ్డాను. అంతే. పెద్దకేక పెట్టాను.

అలా కేక పెట్టగానే ఆయన నన్ను వదిలి లేచి నిల బడ్డారు. తర్వాత మీరు తలుపుల మీద బాదగానే వచ్చి తలుపు తెరిచారు. ఇదీ జరిగింది. అంతమందిలో ఆయన నన్ను గొంతునొక్కి చంపబోయారని ఎలా చెప్ప గలను? అందుకే కలవచ్చి భయపడ్డానని అబద్ధం చెప్పి, అరవింద గదిలో పడుకున్నాను. ఇదీ జరిగింది" గట్టిగా నిట్టూర్పు వదిలింది ఆమె.

"నమ్మశక్యంగా లేదు రంజిత గారూ! ఆయన మిమ్మల్ని గొంతునొక్కి ఎందుకు హత్యచెయ్యాలని అనుకుంటారు? అందుకు తగిన కారణం వుండాలికదా! చెప్పండి. మీ ఇద్దరిమధ్యనా యేవయినా గొడవలు వున్నాయా? మహేంద్ర గారు మిమ్మల్ని వదలించుకోవాలని ప్రయత్నిస్తున్నట్టు అనుమానించారా యెప్పుడయినా?" అడిగాను ఆమె మొహంలోకి చూస్తూ.

"లేదు....ఆయన్ని అనుమానించటంలో అర్థంలేదు. ఆయనకు నేనంటే యెంతో ప్రేమవుంది. మీకు తెలీదు గదా? నేను ఆయన ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. ఇప్పటివరకూ మా మధ్య ఎటువంటి కలతలూ రాలేదు. ఏ విషయం గురించీ మేము ఒకరి నొకరు ద్వేషించుకో లేదు. పెళ్ళి చేసుకున్నందుకు బాధపడలేదు. ఇప్పటికీ నాకేదయినా చిన్నదెబ్బ తగిలితే ఆయనకేమీ తోచదు. ఆయనను అనుమానించటం పాపమే అవుతుంది" అన్నదామె ఆవేశంగా.

"ఆశ్చర్యంగా వుంది. అటువంటి మనిషి రాత్రి మిమ్మల్ని గొంతునొక్కి హత్య చెయ్యాలని యెందుకు ప్రయత్నం చేస్తారు?"

"నాకూ అదే.అంతుబట్టలేదు. అందుకే రాత్రి యీ విషయాన్ని మీ అందరిముందూ చెప్పలేకపోయాను. చెప్పాననుకోండి....పిల్లలముందు ఆయన గౌరవం ఏమవుతుంది? వాళ్ళందరూ ఆయనంటే భయపడతారుకదా! ఇవన్నీ ఆలోచించే రాత్రి నేను అబద్ధం చెప్పాను. కాని తర్వాత ఆలోచిస్తే నాకో ఆలోచన వచ్చింది" అన్నది రంజిత.

"ఏమిటి?"

"దయ్యాలు మనుషుల్ని ఆవహిస్తాయని అంటారు. అలాగే ఈ మేడలోవున్న దయ్యం ఆయనని రాత్రి ఆవహించిందేమోనని అనుమానంగా వుంది. ఆయన్ని గమనించారా? ఆయన జుట్టు రేగిపోయి వుంది. ఆయన కళ్ళు ఎర్రగా వున్నాయి...." చెబుతోంది రంజిత.

ఆలోచిస్తున్నాను.

ఈ మేడలో దయ్యం వుందా?

# 7

రాత్రి పన్నెండు గంటలయింది. మేడలో నేనొక్కడినే మెలకువతో వున్నాను. మిగిలిన అందరూ గాఢ నిద్రలో మునిగి వున్నారు—ఎవరి గదుల్లో వాళ్ళు పడుకొని.

రంజిత ఈరోజు రాత్రికూడా అరవింద గదిలోనే పడుకొంది. ఆమె ఆలోచన నిజమే అయి వుండవచ్చు. మహేంద్రను నిజంగా దయ్యం ఆవహించి వుండవచ్చు. అందుకే ఆయన తను యెంతో గాఢంగా ప్రేమించే భార్యను గొంతునొక్కి చంపెయ్యాలనే ప్రయత్నం చేశాడు. బహుశ అలాంటి ప్రయత్నం యీ రాత్రికి కూడా జరగవచ్చు. అందుకే రంజితను అరవింద గదిలో పడుకోమని చెప్పాను.

మేడనంతా ఓసారి చుట్టివచ్చాను. వాతావరణమంతా మామూలుగా వుంది. ఆ మేడలో దయ్యం వున్నదంటే ఎవ్వరూ నమ్మలేరు. నాకు కూడా నమ్మకంగా లేదు. ఉందోలేదో తేల్చుకోవాలి. రాత్రి జరిగిన సంఘటన ఒక్కటే ఇందుకు సరిపోదు.

సిగరెట్టు పొగ గాలిలో పైకి పోతోంది. మేడలో అక్కడక్కడా దీపాలు వెలుగుతున్నాయి.

ఒకసారి తోటలోకి వెళ్ళి చూడాలనిపించింది.

సగంవరకు కాలిన సిగరెట్టును విసిరి మరో సిగరెట్టును ముట్టించాను.

రాత్రిలాగే అరవింద ఈ రాత్రికూడా నాకు కంపెనీ ఇస్తే బావుండే దనిపించింది. కాని ఇక నాకు అటువంటి అవకాశం రాదు.

బయటకు వచ్చాను.

గాలి రివ్వున వీస్తోంది. చెట్లు అటూయిటూ వూగుతూ వున్నాయి పూనకం వచ్చిన మనుషుల్లా.

బయట చాలావరకు చీకటిగా వుంది.

కొంచెంసేపు తోటబయటే నిలబడిపోయాను సిగరెట్టు కాలుస్తూ.

దయ్యాలు గురించీ అవి చేసే సాధారణమయిన పనుల గురించీ ఆలోచిస్తున్నాను.

దయ్యాలు నడుస్తుంటే గజ్జల చప్పుడు వినిపిస్తుందనీ, అవి నవ్వుతాయనీ ఏవేవో వింతపనులు చేస్తాయనీ విన్నాను. చాలా పుస్తకాల్లో చదివాను.

కాని—ఈ మేడలో అటువంటివి ఏవీ జరగటంలేదు.

ఆలోచిస్తున్న వాడిని ఒక్కసారి ఉలిక్కిపడ్డాను.

నా పెదవుల మధ్యవున్న సిగరెట్టు ఎవరో లాగిపారేసి నట్టు వెళ్ళి నా ముందు దూరంగా పడింది.

కళ్ళు పెద్దవి చేసుకొని చుట్టూ చూశాను.

ఎవ్వరూ కనిపించలేదు.

రివ్వున వీస్తున్న గాలికి కిందపడిన సిగరెట్టు మీదనించి నిప్పురవ్వలు పీస్తున్నాయి. గాలి సిగరెట్టు పీకను గబగబా ముందుకు నెట్టుకు వెళ్ళింది.

స్థాణువులా అక్కడే నిలబడిపోయాను.

ఏమిటిది? సిగరెట్టు ఎలా కింద పడిపోయింది?

గాలికి పడిపోయిందా లేక ఎవరయినా అదృశ్యంగా వుండి లాగి పారేశారా? అలా అయితే ఎవరు ఆ పని చేసింది? దయ్యమా?

తోటలో చెట్లు వూగుతూ కీచుమంటూ శబ్దాలు చేస్తున్నాయి.

ప్యాంటు జేబులోనించి సిగరెట్టు ప్యాక్ బయటకు తీసి ఓ సిగరెట్టును పెదవులమధ్య పెట్టుకుని అగ్గిపుల్ల గీసి ముట్టించబోయాను.

అగ్గిపుల్ల టప్ న ఆరిపోయింది ఎవరో వూదినట్టు.

మరోపుల్ల వెలిగించాను.

మళ్ళీ అలాగే జరిగింది.

ఐదు పుల్లలు ఆరిపోయాయి. సిగరెట్టు వెలగలేదు.

నిజంగా షాక్.

ఎంత గాలి వీస్తున్నా మొదటి అగ్గిపుల్లకే సిగరెట్టు వెలిగించటం నాకు బాగా అలవాటు.

కాని ఇప్పుడు ఐదు పుల్లలు గీసి నా సిగరెట్టు అంటు లేదు.

అంటే? ఎవరో సిగరెట్టు అంటుకోకుండా ప్రయత్నము చేస్తున్నారు.

ఎవరు?

దయ్యమేనా?

ఎవరో నవ్వారు....కలకలా.

ఏమిటి ఇదంతా?నిజంగా జరుగుతున్నదా? నా భ్రమా?

చెవులు రిక్కించాను.

సందేహంలేదు. నా వెనక ఎవరో నవ్వుతున్నారు చిన్నగా—నా చెవులో నవ్వుతున్నట్టు అనిపించింది.

వెనక్కి తిరిగాను గబుక్కున.

ఎవ్వరూ కనిపించలేదు.

ఆ నవ్వు నిమిష నిమిషానికీ పెరిగిపోతోంది. భరించ లేకుండా వున్నాను.

ఏమిటీ సస్పెన్స్?

ప్యాంటు జేబులోనుంచి పెన్‌టార్చి లైటును బయటకు తీశాను.

వెలిగించి చుట్టూ ఫోకస్ చేశాను.

ఏమీ లేదు....

చూస్తున్నాను....గబుక్కున యెవరో నన్ను రాసుకుంటూ వెళ్ళినట్టు ఫీలయ్యాను.

పక్కకు తిరిగాను.

ఏమీ కనిపించలేదు.

ఇక భరించలేక పోయాను.

"ఎవరూ?" అన్నాను ధైర్యంగా.

జవాబులేదు.

నా చెవిలో నవ్వినట్టనిపించింది.

"మాట్లాడరేం? ఎవరు?"

మళ్ళీ అదే నవ్వు. ఎవరో నడివయసు స్త్రీ నవ్వు.

"ఎందుకీ నవ్వు? ధైర్యముంటే కనిపించు...."

అలా అన్న వెంటనే నా చెవిలో వినిపిస్తోన్న నవ్వు ఆగిపోయింది.

తోటలో ఎవరో నడిచిన చప్పుడు వినిపించింది. కళ్ళు చిట్లించి చూశాను.

ఎవరో చెట్టు దగ్గర నిలబడినట్లు లీలగా అనిపించింది.

టార్చిని అటువేపు ఫోకస్ చేశాను.

నా ఆశ్చర్యం వర్ణనాతీతం.

చెట్టు మొదట్లో ఓ లంబాడీయువతి నిలబడి నవ్వుతోంది.

ఒక్క-క్షణం....

అంతే! టార్చి ఆరిపోయింది.

ముందుకు పరుగుదీయబోయాను.

కాని ఇంతలోనే మేడలో ఓ మగాడికేక ప్రతిధ్వనించింది.

వెనక్కు తిరిగి మేడలోకి పరుగుదీశాను.

# 8

నేను పైకి వెళ్ళేసరికి చంద్రం గదిముందు పోగయినారు—అందరూ.

గదిబయట బోర్లా పడివున్నాడు చంద్రం. అతని తలలోంచి నెత్తురు కారుతోంది సన్నగా.

అతను స్పృహలో లేడు.

"ఏమయ్యింది?" అడిగాడు మహేంద్ర.

"ఏమో....తోటలో వున్నాను. కేక వినిపించింది. పరిగెత్తుకొంటూ వచ్చాను. ముందు నీళ్ళు తీసుకురండి" అన్నాను.

నౌకరు పరిగెత్తుకొని వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తీసుకువచ్చాడు.

నీళ్ళను చంద్రం మొహంమీద చల్లాను. అతను కొంచెం అటూయిటూ కదిలాడు.

ప్యాంటు జేబులోనించి కర్చీఫ్ తీసి అతని తలకు కట్టు కట్టాను నెత్తురు కారకుండా. అంత పెద్ద గాయం కాలేదు. లేకపోతే అతన్ని అప్పటికప్పుడే హాస్పిటల్లో అడ్మిట్ చెయ్యవలసి వచ్చేది.

అందరూ భయంగా ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటున్నారు.

పది నిమిషాలకు చిన్నగా కళ్లు తెరిచాడు చంద్రం. చుట్టూవున్న మనుషులను అదోలా చూశాడు.

"చంద్రంగారూ....ఏం జరిగింది? చెప్పండి. మిమ్మల్ని యెవరో తలమీద కొట్టారు....ఎవరు?" అడిగాను.

అతను ఓసారి చేతితో తలమీద తడుముకుని బాధగా మొహాన్ని పెట్టి "ఎవరో నాకు తెలీదు. బాత్‌రూమ్‌కి వెళ్ళి వస్తున్నాను. ఇక్కడకు రాగానే తలమీద బలమయిన దెబ్బ తగిలింది. అంతే. కేక పెట్టాను. తర్వాత ఏం జరిగిందో నాకు తెలీదు" అన్నాడు బలహీనంగా.

"మీకు ఎవరయినా కనిపించారా లీలగా అయినా?"

"లేదు....కాని పడిపోతున్నప్పుడు ఎవరో పరిగెత్తుతున్నట్టు అనిపించింది."

"ఎటువైపుకు?"

"నా వెనుక వైపుకు."

"అంటే కిందికి దిగటానికి రెండోవేపునున్న మెట్ల వేపు."

"అవును" అన్నాడు చంద్రం. ఆశ్చర్యం....అటువైపు నించే నేను పైకి వచ్చాను.

"మీ వెనుక వైపువున్న గదుల్లో వుంటున్నది అందరూ ఆడవాళ్ళే. మగవాళ్లు యెవ్వరూ లేరు. ఆడవాళ్ళలో మిమ్మల్ని ఎవరు కొడతారు?" అడిగాను.

చిన్నగా నవ్వాడతను. తర్వాత "నేనేం చెప్పేది. నాకు అంతా అయోమయంగా వుంది. మీరే పరిశోధించి కనుక్కోండి" అన్నాడు.

"మిమ్మల్ని కొట్టింది మనిషేనని ఒప్పుకుంటారా?" అన్నాను.

"తప్పకుండా" అన్నాడు.

"అయితే అందరూ వినండి. ఈ మేడలో దయ్యం తిరుగుతోంది" చెప్పాను నా అనుభవాన్ని గుర్తుతెచ్చుకుని.

"వ్వాట్!" అదిరి పడ్డారు అందరూ.

"అవును.... ఈ మేడలో నిజంగానే దయ్యం వుంది. మామూలు దయ్యంకాదు....లంబాడీ దయ్యం."

"లంబాడీ దయ్యమా?" అన్నాడు మహేంద్ర.

"అవును."

"ఎలా చెబుతున్నారు? మీకు కనిపించిందా?" అడిగాడు చంద్రం.

తల వూపాను.

"ఎప్పుడు? ఎక్కడ?" అరవింద అడిగింది.

"తోటలో చూశాను" అని బయట జరిగినదందా వాళ్ళతో చెప్పాను.

రంజిత నా కళ్ళలోకి భయంగా చూసింది.

"నేను నమ్మను" అన్నాడు మహేంద్ర.

"నేనుకూడా నమ్మను" అన్నాడు చంద్రం.

"నాకూ నమ్మకంగాలేదు" అన్నాడు సురేష్.

"నేను నమ్ముతాను" అన్నది రంజిత.

"థాంక్యూ రంజితా. ఈ యింట్లో మీరు తప్ప ఇంక యెవ్వరు ఈ మేడలో దయ్యం తిరుగుతుందంటే నమ్మటం లేదు. నేను నాకు జరిగిన అనుభవాన్ని చెప్పాను. అయినా యెవరూ నమ్మలేదు. అంటే నా మాటమీద యెవరికీ నమ్మకం లేదన్నమాట. నామాట మీద నమ్మకం లేని క్లయింట్ల తరఫున నేను ఏ కేసునూ పరిశోధించను. మిస్టర్ మహేంద్రా! నేను ఈ కేసునించి విరమించుకుంటున్నాను. ఇప్పుడే ఈ మేడను వదలి వెళ్ళిపోతున్నాను" అన్నాను.

అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

"ప్లీజ్ .... మీరు కోపం తెచ్చుకోకండి జగదీష్ గారూ! మీ మాటలను నేను నమ్ముతున్నాను. ఈ మేడలో దయ్యం వుంది. ఇంకెవ్వరూ నమ్మక పోవచ్చు. కాని ఇది నిజం. పదండి. మీతో పాటే నేనుకూడా ఈ మేడను వదలి వచ్చేస్తాను" అన్నది రంజిత.

"ఆంటీ.... నీకేమయినా మతిపోయిందా? మనకెవ్వరికీ కనిపించని ఆ లంబాడీ దయ్యం ఒక్క డిటెక్టివ్ గారికే యెందుకు కనిపించింది? ఆ దయ్యానికి మనల్ని చూస్తే భయమా? నువ్వే ఆలోచించు. ఈ మేడలో నిజంగా ఏ దయ్యమూ లేదు. అంతా జగదీష్ గారి భ్రమ" చంద్రం అన్నాడు.

నాకు అటువంటి పరిస్థితిలోనూ నవ్వొచ్చింది.

"ఓ. కే. మిస్టర్ చంద్రం. ఈ మేడలో దయ్యం లేదు. అయితే యింతకు ముందు మిమ్మల్ని వెనుకనుంచి కొట్టింది ఎవరంటారు?" అడిగాను.

"ఎవరో మనిషే అయివుండాలి" అన్నాడతను.

"ఎవరా మనిషి?"

"ఏమో.... నాకు తెలీదు."

"ఆలోచించండి. ఈ ఇంట్లోవున్న మనుషులందరూ మీకు తెలుసు. వాళ్ళలో మిమ్మల్ని వెనుకనించి కొట్ట వలసిన అవసరం యెవరికి వుంది?"

"అయితే ఇంతకీ మీరేమంటారు? నన్ను ఆ లంబాడీ దయ్యమే కొట్టిందంటారా?"

"అవును."

"ఎందుకు?"

"భయపెట్టటానికి."

"ఎందుకు భయపెట్టటం?"

"ఈ మేడను వదలి మనమంతా వెళ్ళిపోవటానికి.... నిన్నరాత్రి రంజితగారు ఎందుకలా కేకపెట్టారో మీకెవరికీ తెలీదు. మహేంద్రగారు ఆమెను గొంతునొక్కి హత్యచెయ్యబోయారట్ట" అన్నాను.

అందరూ ఉలిక్కిపడ్డారు. భయంగా మహేంద్రను చూశారు.

"నాకేం తెలీదు...." అన్నాడు మహేంద్ర.

"నిజమే....మీకేమీ తెలీదు. ఈ మేడలో వుంటున్న లంబడీ దయ్యం మిమ్మల్ని ఆవహించింది. అందుకే మీరు అలా చేశారు. ఇప్పటికయినా మీరు యీ మేడలో లంబాడీదయ్యం ఉన్నదని నమ్మి ఈ మేడనువదిలి వెళ్లండి. దిసీజ్ మై రిక్వెస్ట్" అన్నాను అందరితో.

"ఏమో....మీరు ఎన్నయినా చెప్పండి. దయ్యాలు ఉన్నాయంటే నేను నమ్మను. ఇది ఆధునిక యుగం. ఈ కాలంలోకూడా దయ్యాలేమిటి? దిసీజ్ ఆల్ బోగస్. ఐడోంట్ బిలీవ్ దీస్ డెవిల్స్" అన్నాడు చంద్రం.

నేనేదో మాట్లాడబోయాను.

ఇంతలోనే అతను పెద్దకేకపెట్టి వెనక్కి పడిపోబోయాడు. గబుక్కున అతన్ని పడిపోకుండా పట్టుకున్నాను. అతను నిలవలేదు. పూనకం వచ్చినవాడిలా వూగిపోయాడు.

తర్వాత పెద్దగా నవ్వాడు. నాకు ఒళ్ళు జలదరించింది ఆ నవ్వు వినగానే. రంజిత భయంగా నాకేసి చూసింది. మిగిలిన అందరూ కళ్ళు పెద్దవిచేసి భయంతో చంద్రాన్ని చూస్తున్నారు.

"ఒక్కరోజు గడువిస్తున్నాను. ఈ మేడను వదిలి

వెళ్ళిపోండి. ఈ మేడ నాది. ఈ మేడలో మూడుతరాల కిందట నేను దాచుకున్న నిధని క్షేపాలున్నాయి. ఈ మేడలో యెవ్వరూ వుండటాన్ని నేను సహించలేను. అందుకే మిమ్మల్ని ప్రాణాలు తియ్యకుండా హెచ్చరిస్తున్నాను. వెంటనే ఈ మేడవదలి ప్రాణాలమీద ఆశ వుంటే వెళ్ళిపొండి. ఇదే చివరి హెచ్చరిక....హి....హి ...హి" అని పెద్దగా పిచ్చివాడిలా నవ్వటం మొదలు పెట్టాడు చంద్రం.

అందరూ భయంతో వణికిపోవటం గమనించాను. ప్రతి ఒక్కరికీ చెమటలుపట్టాయి. రంజిత కళ్ళు భయంతో బెదురుతున్నాయి.

నిముషం తర్వాత చంద్రం నా చేతుల్లో నీరసంగా ఒరిగిపోయాడు.

ఐదు నిమిషాల తర్వాత అందరూ ఆ భయంనించి తేరుకున్నారు.

"క్షమించండి జగదీష్‌గారూ. మీ మాటలను నమ్మనందుకు. ఇప్పుడే ఈ మేడను ఖాళీచేసి వెళ్ళిపోదాం" అన్నాడు మహేంద్ర.

తల వూపాను సిగరెట్టు ముట్టించుకుంటూ.

—: ఐపోయింది :—

# (ఏడవ భాగము)

క్షణాల్లో బైటికి వచ్చాడు రైనా.

పెట్రోల్ స్క్వాడ్ కార్ లోకి మెరుపులా గెంతి, కార్ని విద్యుత్ వేగంతో జస్లోక్ ఆస్పత్రి వైపు పరిగెత్తిం చాడు రైనా, సైరన్ మ్రోగించుకుంటూ....

అయిష్టంగా ఒప్పుకున్నాడు రాణా—తిరిగి హెడ్ క్వార్టర్స్‌కు రావడాన్కి. లూసీ ట్రీట్ మెంట్ విష యంలో—తనకు యింతకుముందు ట్రీట్ మెంట్ ఇచ్చిన కాంబే హాస్పిటల్ వైదుల్ని సంప్రదించవలసిందిగా రాణా జస్లోక్ వైద్యుల్ని కోరాడు.

ప్రధానవైద్యుడు అందుకు అంగీకరించాడు. కాని రాణాకు యింతకుముందు ఏర్పడిన ఉన్మాదం గురించి మరి కొన్ని వివరాలు అడిగాడు.

ఇన్‌స్పెక్టర్ రైనా, అసహనంగా మధ్యలో అడ్డు కున్నాడు. మొత్తం వివరాలన్నీ రాణాకు ముందు ట్రీట్ మెంట్ తీసుకున్న కాంబే మిషనరీ హాస్పిటల్ నుండి పొందవలసిందనీ—ఇప్పుడు అర్జంటుగా తాము పోలీస్ హెడ్ క్వార్టర్‌కి వెళ్ళాలనీ—అక్కడి సమస్య ఒక స్త్రీ క్షేమంకంటే తీవ్రమైన సమస్య అనీ—గబగబా చెప్పి, నివ్వెరబోతూ చూస్తున్న డాక్టర్ని వదిలిపెట్టి-రాణాను లాక్కుపోయాడు రైనా.

ట్రాఫిక్‌ని అదరగొడుతూ తిరిగి హెడ్ క్వార్టర్స్ వైపు దూసుకుపోయింది పెట్రోల్ కార్.

పది నిమిషాల్లో రాణా, రైనా-మెహ్రోత్రా ఆఫీసులో ప్రత్యక్షమయ్యారు.

ఉపోద్ఘాతం లేకుండా సూటిగా ప్రారంభించాడు సూపరింటెండెంట్ మెహ్రోత్రా. "క్షమాపణలకి ఇప్పుడు

సమయంలేదు మిస్టర్ రాణా! ఉదయం లూసీ యింట్లో జరిగిన దుర్ఘటన గురించి రైనా ద్వారా తెల్సుకున్నాను. నీ మానసిక సంఘర్షణ నేనర్థం చేసుకోగలను. నీ పట్ల గుండెలనిండా సానుభూతి ఉంది కూడా. కానీ యింత కంటే ప్రాధాన్యతగల, దారుణమైన సంఘటనలు మరి కొన్ని జరిగాయ్."

పైపులోంచి గుప్పుగుప్పున పొగ వదులుతూ హాడావుడిగా చెప్పుకుపోయాడు మెహ్రోత్రా. "రాత్రి అంతా రిపోర్ట్సు ప్రవహిస్తూనే ఉన్నాయి కంట్రోల్ రూమ్‌కి, మరికొన్ని విచిత్ర సంఘటనల గురించి.... ఈ సందర్భంలో ఒక విషయం గుర్తు చెయ్యాలి. నేను చేసినవన్నీ అనధికారమైన ఏర్పాట్లే. ఎందుకంటే నీ ఒక్కడి కంప్లెంట్ మీద, ఎంతో మందికి సంబంధించిన కేస్‌ని డీల్ చేయటం యిది. నా జాగ్రత్తలో నేనుండాలిగా...."

"నా ఒక్కడి కంప్లెయింట్ మీద యింత శ్రద్ధ తీసుకున్నందుకు థాంక్స్" అన్నాడు రాణా వ్యంగ్యంగా.

మెహ్రోత్రా యిబ్బందిగా తల దించి, గొంతు సర్దుకున్నాడు. మళ్ళీ అతని కంఠం అధికారయుతంగా పల్కింది. "వెల్! మొత్తానికి రిపోర్ట్సు మెల్లగా గుట్టలయ్యాయి. నిముషాల్లో ఈ కేస్ నా ఒక్కడికే సంబంధించింది కాకుండా, హెడ్‌క్వార్టర్స్‌లోని పోలీసు అధికారులందరూ కలగజేసుకోవాల్సిన కేసుగా మారింది. మొదట్లో యిలాంటివే కొన్ని వ్యక్తిగత సంఘటనలు జరిగాయి.... తర్వాత చిల్లరమల్లర సంఘటనలు.... మళ్ళీ దారుణకృత్యాలు.... యివన్నీ బొంబాయికి తూర్పున ఉన్న భావ్‌నగర్, కాంబే ఊళ్ళనుండి ఉత్తరాన వున్న మాహిమ్ పట్టణానికి ప్రాకాయి....

"ఈ వార్త పోలీస్ కమిషనర్ కు, ఆయన్నుంచి ఐ.జీ.కీ,....ఐ.జి. నుండి హోమ్ మినిస్టర్ కీ, హోమ్ మినిస్టర్ నుండి ముఖ్యమంత్రికీ చకచకా పాకిపోయింది.

"తత్ఫలితంగా వెంటనే ఓ అత్యవసర సమావేశం ఏర్పాటు చేయబడింది. ఈ ఎమర్జన్సీ సమావేశాన్కి ఢిల్లీ నుంచి మంత్రులు, కార్యదర్శులు వెంటనే బయలుదేరి స్పెషల్ విమానంలో వస్తున్నారు....

"అకస్మాత్తుగా ఇది జాతీయ సమస్య ఎందుకయిందో యిప్పుడు చెప్తాను. రెండుగంటల క్రితం-మా కాళ్ళు గడ గడలాడించిన వార్త యిది....కాని యింకా పూర్తి వివరాలు అందలేదు....ఈ వార్త నమ్మరాని అసహజ వార్త! ప్రపంచ చరిత్రలో యింతటి దారుణ సం...."

"ఫర్ గాడ్ సేక్!" దాదాపు అరిచాడు రాణా.

"ఈ ఉదయం సుమారు ఆరుగంటలకి, బొంబాయికి ఉత్తరాన ఉన్న మాహిమ్ పట్టణంలోని దాదాపు మొత్తం జనాభా అంతా యిళ్ళు వాకిళ్ళు వదిలిపెట్టి సముద్రంలోకి మూకి మూకుమ్మడిగా ఆత్మహత్య చేసుకున్నారు."

గదిలో అకస్మాత్తుగా భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది....

కొంత సేపటికి రాణా నిద్రలో కలవరించినట్లుగా అన్నాడు.

"మైగాడ్....యిట్స్ ఇంపాసిబుల్...."

"ఇంపాసిబుల్. ఎస్! కాని ఈ మారణహోమం ప్రత్యక్షంగా జరిగింది, మిస్టర్!—ఒక లక్షా యాభైవేల ఎనిమిదివందల మంది ప్రజలు! యిది పొరుగూర్ల నుంచి పనుల మీదా, శలవుల మీద, టూరిస్టులాగా, ఆ వూరు వచ్చిన జనాభా కాకుండా-చెప్పిన సంఖ్య..

స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు, ముసలీ, ముతకా అందరూ మునిగిపోయారు....

చోటులేక, సముద్రంలోకి నడిచే దారిలేక, యితతలగా కొట్టుమిట్టాడుతున్న కొంతమందిని మాత్రం రక్షించే ప్రయత్నాలు జరుగుతున్నాయి....

బొంబాయి హార్బరంతా శవాలతో నిండిపోయింది! సముద్రతీరం పొడువునా మృతకళేబరాలు ముట్టడించి ఉన్నాయ్....

అంతవరకూ మౌనంగా వున్న ఇన్‌స్పెక్టర్ రైనా, టాపిక్ మారుస్తూ అన్నాడు.

"విషమేఘం విషయమేమిటి సర్? అది లొకేట్ చేయబడిందా?"

"లేదు. అది ప్రస్తుతం ఎక్కడ ప్రయాణిస్తోందో తెలియలేదు. పోలీసు బలగం అంతా అదే ప్రయత్నంలో వుంది. ఎనీవే, ప్రజల్లో యిప్పుడు ఉన్న ఆందోళన చాలు. విషమేఘమే దానికి కారణమని మనం పబ్లిసిటీ చేస్తే ఆ వార్త అట్టుడికిపోతుంది. ప్రజల దైనందిన జీవితం స్తంభిస్తుంది. అదిగో తోక అంటే ఇదిగో పులి అంటూ రకరకాల పుకార్లతో, నీలివార్తలతో రాష్ట్రం భీతావహమౌతుంది.

ఈ విషయాన్ని పబ్లిసిటీ యిచ్చేముందు నేను కమిషనర్ అనుమతి కోరాలి.

కాని ఒక్క విషయం నాకు రూఢిగా తెల్సింది.

నిన్నటిరోజు అంతా దట్టమైన పొగమంచుతో కప్పబడివుంది మాహిమ్ టౌన్."

• • •

మధ్యాహ్నం రెండు గంటలైంది.

మహారాష్ట్ర శాసనసభా భవనాన్ని కల్సివున్న ఛత్రపతి భవన్‌లోని కాన్ఫరెన్స్ హాల్లో అత్యవసర సమావేశం జరుగుతోంది.

ఢిల్లీనుంచి ప్రత్యేక విమానంలో వచ్చినవారిలో భారత హోమ్ సెక్రెటరీ, రక్షణశాఖ సహాయమంత్రీ, ఆర్మీ అండర్ సెక్రటరీ, వాతావరణ కాలుష్య పరిశోధనా శాఖ డైరెక్టర్ ఉన్నారు.

హోమ్ సెక్రటరీ—రాణా చెప్పే కథను మధ్య మధ్యలో సందర్భయుతమైన ప్రశ్నలు వేస్తూ, ఓపిగ్గా, ఆశ్చర్యంగా, శ్రద్ధగా ఆలకిస్తున్నాడు.

రౌండ్ టేబుల్ చుట్టూ రాష్ట్ర, కేంద్ర—అధికారులు కూర్చుని వుండగా, రాణా తన అనుభవాన్ని పూసగుచ్చినట్టు వివరిస్తున్నాడు, అప్పుడప్పుడు పిస్టోలు తూటాల్లా విరుచుకుపడుతున్న ప్రశ్నలకు ఓపిగ్గా సమాధానాలిస్తూ. రక్షణశాఖ సహాయమంత్రి—రాణా వ్యక్తిగత వ్యాఖ్యానాలకు కోపంలో విరుచుకుపడుతున్నాడు.

ఇరవైనిముషాల్లో అధికార్ల మధ్య—సమస్యకు పరిష్కారం దొరక్కపోగా—వాదోపవాదాలు చెలరేగి సమావేశం గందరగోళంగా మారింది.

హోమ్ సెక్రటరీ విసుగ్గా పిడికిలితో టేబులుమీద గుద్దాడు. "జంటిల్మెన్! సమస్య ఈ స్థాయిలో ఉండగా మనం వాదోపవాదాలు కొనసాగించడం ఎంత మాత్రం వాంఛనీయం కాదు. మిస్టర్ రణధావే! ఖుల్నా ఏరియాలో మీరు నెలకొల్పిన మిలటరీ ఏస్టాబ్లిష్‌మెంట్స్ మీద ఫుల్ రిపోర్టు నాకు కావాలి" ఆర్డర్ జారీచేస్తూ అన్నాడు, ఆర్మీ అండర్ సెక్రటరీకి "అక్కడ మీరు

ఈ మధ్య చేసిన ప్రయోగాల పూర్తి వివరాలు నాకు కావాలి. ముఖ్యంగా ఆ....ఎక్స్....ఎక్స్‌పెరిమెంట్"

ఆ వాక్యం అర్ధాంతరంగా పూర్తవుతుండగా యిద్దరి మధ్యా సాగిన తత్తరపాటు చూపులు రహస్యంగా గమనించాడు రాణా.

"గోకుల్ రామ్‌జీ!" హోమ్ సెక్రెటరీ-రక్షణశాఖ సహాయమంత్రి వైపు తిరిగాడు. "భావ్‌నగర్, కాంబే, ట్రాంబే మొదలైన ప్రమాదాన్కి గురికాగల ఊళ్ళల్లో జనాన్ని ఖాళీ చేయించడాన్కి సైనికశక్తి అవసరం! కమిషనర్! మీ వాళ్ళు విషమేఘాన్ని లొకేట్ చేయగల్గారా?"

"నాట్ యెట్ సర్! విషమేఘం కన్పించిన మరుక్షణం హెడ్‌క్వార్టర్స్‌కి రిపోర్టు చేయమని పోలీస్ ఫోర్స్ కంతటికీ ఆదేశాలు ఇవ్వబడ్డాయ్."

"మెటీరియాలజీ ఆఫీస్‌ని వెంటనే కాంటాక్టుచేసి వారి సహాయంతో ఎయిర్ కరెంట్స్‌లో మార్పులు గమనిస్తూ వుండమని నా సలహా."

"విషమేఘం ఉనికి తెల్సుకోవడంలో వాళ్ళు యిప్పటికే మాతో కల్సి పని చేస్తున్నారు సర్!" చెప్పాడు వినయంగా కమిషనర్.

"తీరా మీకు ఆ విషమేఘం కనబడిన తర్వాత అది ఎటువైపు వెళ్తుందో తెల్సుకోవడం ఎలా? అంటారు. అవునా?" వ్యంగ్యంగా అన్నాడు హోమ్ సెక్రెటరీ.

"అసలు విషయం చర్చించలేదు. విషమేఘం కనబడిన తర్వాత, దాన్ని ఏమి చేద్దామనుకుంటున్నారు? అది గాలిలో తేలుంటే వెనకాల పరిగెడతారా?"

ఓ తెల్లగడ్డం వ్యక్తి కంఠం గంభీరంగా వినబడింది.

ఆయన ప్రొఫెసర్ సన్యాల్.

రాణాకు సంబంధించిన వ్యక్తి.

డిపార్టుమెంట్ ఆఫ్ ఎన్విరాన్ మెంట్-డైరెక్టర్.

అంత సీరియస్ వాతావరణంలోను నవ్వులు విన బడ్డాయి.

"దేరార్.... మెథడ్స్ ప్రొఫెసర్ సన్యాల్!" రక్షణ శాఖ సహాయమంత్రి కోపంగా చూస్తూ అన్నాడు. "కొన్ని పద్ధతులు లేకపోలేదు....పూర్వపు యుద్ధాల్లో బ్రిటిష్ వాళ్ళు అవలంబించిన పద్ధతులు కొన్ని ఉన్నాయి. కాని రాడార్ అభివృద్ధి చెందిన తర్వాత అవి పాతబడి పోయాయి. కాని ఆ పాతపద్ధతుల ద్వారా ఇంకా ఫలితాలు సాధించవచ్చు."

"మొట్టమొదట ఈ విష మేఘం ఉనికిని తెల్సుకోడం ముఖ్యం" అసహనంగా అన్నాడు హోమ్ సెక్రటరీ. "అది ఏ దిశగా పయనిస్తోందో నాకు తెలియాలి. తర్వాత ఆ దిక్కులో జనం లేకుండా చూడాలి."

"మిస్టర్ రాణా! కేంద్ర ఆరోగ్యశాఖకు సంబంధించిన మెడికల్ రీసెర్చి విభాగం యిదే నగరంలో వుంది. వారికి మీరు ఎప్పుడూ అందుబాటులో ఉండాలి. యునో, విష మేఘం ప్రభావం నుండి కోలుకుని బైటపడిన వారు ప్రస్తుతానికి మీరు ఒక్కరే.

మీరు యెలా కోలుకోగలిగారో నాకు తెలియాలి. అది తెల్సుకుంటే—మనం వేలాది ప్రాణాలను రక్షించ వచ్చు."

"స్....సర్! మా షేరా మైదాన్ వ్యక్తులు, మెడికల్ రీసెర్చి వాళ్ళతో కల్సి పనిచేస్తే ఉపయోగకరంగా వుంటుందని నా అభిప్రాయం" గొణిగాడు ఆర్మీ అండర్

సెక్రటరీ.

"షేరా మైదాన్?" కనుబొమలెగరేశాడు వాతావరణ కాలుష్య పరిశోధనా శాఖ డైరెక్టర్ సన్యాల్.

"ఎస్. మా డిపార్టుమెంట్ తాలూకు కెమికల్ రీసెర్చి అండ్ మైక్రోబయోలాజికలు రీసెర్చి ఎస్టాబ్లిష్మెంట్స్ అక్కడ వున్నాయి."

"షేరా మైదాన్, ఖుల్నా ఏరియాలో ఉంది కదూ?" నొక్కి పలికాడు సన్యాల్, అనుమానంగా చూస్తూ.

"అవును."

"మొత్తం వ్యవహారమంతా నాకేదో గూడుపుఠాణిలా కన్పిస్తోంది." ఉద్రేకంగా అన్నాడు సన్యాల్ పైకిలేస్తూ "డిఫె"....

వాదప్రతివాదాలు ఆపమన్నట్లుగా, రెండు చేతులూ చాపాడు హోమ్ సెక్రటరీ. "జంటిల్మెన్! ఖుల్నా ఏరియాలో జరిగే ప్రయోగాల గురించి మొత్తం రిపోర్టు యివ్వమనవల్సిందిగా రణధావేని కోరాను. ఆ రిపోర్టు చదవకుండా, మనలో మనం కొట్లాడుకోడంవల్ల ఉపయోగంలేదు. ప్రస్తుతాన్కి మనం చెయ్యవల్సిన పనులు ఇంతకంటే ముఖ్యమైనవి ఉన్నాయ్.

ఇకపోతే మెడికల్ రీసెర్చ్—'మైక్రో బయోలజీ పరిశోధకుల్ని' ఉపయోగించుకోడాన్కి అభ్యంతరం లేదు.

ఈ ఉపద్రవాన్ని ఎదుర్కోడంలో, ఎంత చిన్న సహాయం ఎటువైపు నుంచి లభించినా దాన్ని పూర్తిగా మనం వినియోగించుకోవాలి. ఈజ్ ఇట్ అండర్స్టుడ్?"

మరో నలభై నిముషాలదాకా వారు ఆ అసాధారణ పరిస్థితి నెదుర్కోడాన్కి ప్రణాళికలు వేస్తూ చర్చలు

జరిపారు.

ప్రజల్ని ప్రమాదస్థలాలనుంచి ఖాళీ చేయించడానికి ఏ విధమైన చర్యలు తీసుకోవాలో విషమేఘాన్ని ఎలా విడగొట్టాలో మొదలైన కీలకమైన విషయాలు చర్చించబడ్డాయి. వివిధ అధికారులకు కొత్త బాధ్యతలు అందించబడ్డాయి. అంతలో ఎవరో వచ్చి పోలీస్ కమిషనర్‌కి ఓ కాగితం ముక్క తెచ్చి యివ్వడంతో సమావేశ కార్యక్రమానికి భంగం ఏర్పడింది.

"జంటిల్మెన్! విషమేఘం ఉనికి తెలుసుకోబడింది" లేచి నిలబడి ఎనౌన్స్ చేసాడు కమిషనర్, విచారంగా "అది ఇప్పుడు బొంబాయి ఉత్తర దిశలో ప్రయాణిస్తోంది నాసిక్ వైపు...."

ర ర ర

మాహిమ్ సముద్రపు దుర్ఘటన, దాదాపు దేశంలోని అన్ని వార్తాపత్రికల్లోనూ ప్రముఖంగా ప్రచురించబడింది.

వేలాది పత్రికా విలేఖరులకు చేతినిండా పని తగిలింది?

ఎడిటోరియల్ కాలమ్స్‌లో ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరిని, ప్రభుత్వ యంత్రాంగ సోమరితనాన్ని దుయ్యబట్టాయ్ అన్ని పత్రికలూ....

కొన్ని పత్రికలు—మాహింలో లక్షన్నర మంది ప్రజల అమాయకపు చావు సంఘటన వెనక ఏదో శత్రుదేశం హస్తముందనీ, అది ముందుగా గూఢచారిశాఖ ఎందుకు తెల్సుకోలేకపోయిందో సంజాయిషీ చెప్పాలనీ, డిమాండ్ చేశాయి.

పత్రికలవాళ్ళకి, చేతులకీ, కాళ్ళకీ, పని తగిలితే-పార్లమెంటులో ప్రతిపక్షానికి నోటినిండా పని తగిలింది.

ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొనేలోగా, యింకా

ఎన్ని లక్షలమంది మరణించాలంటూ వారు కేకలు పెట్టారు.

అంతటా గందరగోళం ఆవిర్భవించింది.

§ § §

రాణా కార్లో జస్లోక్ హాస్పిటల్ కి వెళ్ళాడు లూసీని ఆలిండియా మెడికల్ రీసెర్చి భవనాన్కి తరలించడానికి.

వెంట ఎస్కార్ట్ గా మరో కార్లో రాణాను అనుసరించాడు డిటెక్టివ్ ఇన్ స్పెక్టర్ రైనా.

భారత్ హోమ్ కార్యదర్శివల్ల రాణా ఇప్పుడు అధికారుల్లో విలువైన వ్యక్తిగా పరిగణింపబడుతున్నాడు.

విషమేఘం ప్రభావం నుండి కోలుకున్న వ్యక్తి ఒక్క రాణాయే కావడంవల్ల అతన్కి యెంతో ప్రాధాన్యత లభించింది.

ఏ విధంగా కోలుకోగలిగాడో తెల్సుకోడానికి— అతని ప్రస్తుత ఆరోగ్యం - మెదడు సరళి మొదలైన విషయాలపై అనేక పరీక్షలకు గురికాబోతున్నాడు ఆలిండియా మెడికల్ రీసెర్చి భవనంలో.

ప్రస్తుతం అందుబాటులో వుండడంవల్ల, విషమేఘం ప్రభావాన్కి గురి అవుతూండడంవల్ల, లూసీ అవసరం కూడా ఏర్పడింది వారికి.

మెదడుకు ఏ విధమైన నష్టం వాటిల్లిందో పరిశోధించడాన్కి మాహిం నుండి కొందరి మృతదేహాలు హెలికాప్టర్లో బొంబాయికి తరలించే ఏర్పాట్లు చేయబడ్డాయి.

జీవించివుండీ, ఉన్మాదస్థితిలో వున్న మిగతా ప్రజల్లో కొందర్ని ఎన్నుకొని-పరీక్షలకోసం తరలించబోతున్నారు.

జస్లోక్ హాస్పిటల్ నుండి లూసీ, రాణాలు అంబు

లెన్స్‌లో వైద్యశాఖ ప్రత్యేక భవనానికి ప్రయాణిస్తు న్నారు.

అంబులెన్స్‌లో కూర్చుని రాణా—మత్తుమందు ప్రభావంలో పడి నిద్రపోతున్న లూసీ రెండు చేతులు పట్టుకుని బెంగగా ఆమెకేసి చూస్తున్నాడు.

తెల్లగా పాలిపోయివున్న ఆమె ముఖం రాణాలో ఆందోళన రేకె త్తిస్తోంది.

వాచీ చూసుకున్నాడు రాణా.

9-45.

భగవాన్! తాను ఎంత అలసిపోయాడు.

తను అప్పుడే మధ్యాహ్నం అయిందనుకున్నాడు. బొంబే రోడ్లమీద ట్రాఫిక్ ఉధృతమౌతోంది.

జనం ఆఫీసులకి తరలుతున్నారు.

మాహిమ్ దుర్ఘటన విన్న ప్రజల్లో భయభ్రాంతులు చెల రేగాయి? మొత్తం లక్షన్నర జనాభా పొగమంచు సోకి ఉన్మాదస్థితిలో సముద్రగర్భంలో కలిసిపోయారు. దారుణ సంఘటన.

ప్రజలకు ఖచ్చితంగా సమాధానం చెప్పుకోవాల్సి వుంది ప్రభుత్వం.

తన ఉద్యోగ నిర్వహణలో—వాతావరణ కాలుష్యం మనిషి ఆరోగ్యానికి ఎంత ప్రమాదకరమో తెల్సు కున్నాడు.

కాని యింత సర్వనాశనం అది సృష్టించగలదా?

పత్రికలు బహుశా-ఏదైనా రసాయనంవల్ల గానీ ఎక్క డైనా సైంటిఫిక్ లాబరేటరీ వదిలిపెట్టిన వాయువువల్ల గానీ ఈ ప్రమాదం ఏర్పడినట్లు భావిస్తాయి.

తన అనుమానం రక్షణశాఖ గుమ్మంలో ఆగిపోయింది.

పటిష్టమైన ఆధారం లేకుండా తను లోపలికి వెళ్ళలేదు.

అప్పుడే ఎక్కడ్నించో భయంకరమైన ప్రేలుడు విన బడి ఆలోచనల్లోంచి త్రుళ్ళిపడ్డాడు రాణా.

అంబులెన్స్ సడన్ బ్రేకుతో నిల్చిపోయింది. చివా లున అతను వెనుక తలుపులు తీస్తుండగా

ఓవర్ బ్రిడ్జి దాటుతూ, ఎక్కడ ట్రాఫిక్ అక్కడ స్థాణువుల్లా నిల్చిపోడం గమనించాడు రాణా.

రాణా వాన్ దిగుతుండగా, వెనకాల్నించి ఎస్కార్టు పోలీస్ కార్ లోంచి, గాభరాగా పరిగెట్టుకుంటూ వచ్చాడు ఇన్ స్పెక్టర్ రైనా.

"రాణా! లుక్ దేర్!" అన్నాడతను కంగారుగా, చూపుడు వేలితో ఆకాశంలో చూపుతూ.

దట్టమైన నల్లటిపొగ, బ్రహ్మాండమైన బంతి ఆకా రంలో, సుడులుతిరుగుతున్న దృశ్యం కనబడింది రాణాకి.

క్రిందభాగంలో ఎర్రగా కనబడుతున్న ఆ బ్రహ్మాండ మైన పొగ, నాల్కలు చాచి నీలి ఆకాశంలోకి పయని స్తోంది.

"వాట్ ది హెల్ ఈజ్ ఇట్?"

రాణా కంఠం, కాస్త ఆపి ఆశ్చర్యంగా నిలబడి చూస్తున్న జనం మధ్య బిగ్గరగా ప్రతిధ్వనించింది.

"అయామ్ నాట్ ష్యూర్" యిబ్బందిగా పలికాడు రైనా. "ఆ పొగ బహుశా బోరిబందర్ సెంటర్ చుట్టు ప్రక్కల్నించి వెలువడుతూ వుండివుండాలి. మున్సిపల్ కార్పొరేషన్ బిల్డింగ్ ముందుభాగంలో అయ్యుండాలి. అవును.... కార్పొరేషన్ టవర్ ఏదీ....?"

నోరు తెర్చుకుని వుండిపోయాడు రైనా.

దూరాన్నించి యింకా ప్రేలుళ్ళు సన్నగా విన

బడుతున్నాయి.

అగ్నిశిఖలు పిస్తోలు తూటాల్లా ఆకాశంలోకి దూసుకు పోతున్నాయ్.

"సో....ఇక్కడ కూడా ప్రారంభమైందన్నమాట!" గొణుక్కున్నాడు రాణా.

"వాటో? నో....మనకిక్కడ విషమేఘం లేదు!" గాభరాగా అన్నాడు రైనా. "దానికీ, దీనికీ సంబంధం లేదు-ఉండటానికి వీల్లేదు!"

"ఆ విషయం మనకి నిర్ధారణగా తెలిస్తే బాగుండేది."

జనం గుంపులు గుంపులుగా చేరి, ఉద్రేకంగా మాట్లాడు కుంటున్నారు మధ్యలో నల్లని ఆకారం వైపు చేతులతో చూపిస్తూ....

ఇన్‌స్పెక్టర్ రైనా, నడుచుకుంటూ ఓ గుంపుమధ్యకు వెళ్ళాడు.

ఒక నిముషం తర్వాత—తిరిగి వచ్చాడు. "నీ ప్రశ్నకు సమాధానం దొరికింది" చెప్పాడు రాణాతో. "అక్కడి జనం నగరంచుట్టూ తిరుగుతున్న ఓ విమానాన్ని చూసారట! చాల క్రిందకి ఎగురుతుండడంతో ప్రమాదంలో వుందని గ్రహించారట. సడన్‌గా విమానం డైవ్ చేసు కుంటూ క్రిందికి వెళ్ళిందట. అప్పుడే టవర్‌ని గుద్దిందని వాళ్ళు అనుకుంటున్నారు. ఒకతను ఖచ్చితంగా చూసినట్లు చెబుతున్నాడు."

నమ్మలేనట్లుగా తల విదిలించాడు రాణా. "దారుణం! ఇది కూడా ఆ విషమేఘ ప్రభావమే అయ్యుంటుంది—"

"మామూలుగా నీకు చెప్పానంతే! విషమేఘానికీ ఈ దుర్ఘటనకీ సంబంధం లేకపోవచ్చు."

"చేదునిజాన్ని నమ్మకతప్పదు రైనా! తప్పదు....

ప్రస్తుతం నాసిక్ ప్రాంతంలో కదులుతున్న ఆ పొగ మంచులో నుండి వచ్చివుంటుంది."

అకస్మాత్తుగా రాణా శరీరం చలితో జలదరించింది— అంతటి ఎండలో.

* * *

వైద్య పరిశోధనా విభాగం—బిల్డింగు క్రిందభాగంలోని అండర్ గ్రౌండ్ లో వుందని తెల్సుకొని ఆశ్చర్యపోయాడు రాణా.

బొంబాయిలో—ఆల్ యిండియా మెడికల్ రీసెర్చి శాఖకి ఒక భవంతి ఉన్నట్లే తెలియదు, రాణాకి ఇంతకు పూర్వం.

నీలిరంగు సూటులోవున్న ఓ లావుపాటి వ్యక్తి ఛీఫ్ మెడికల్ ఆఫీసర్ గా తనను తాను పరిచయం చేసుకున్నాడు రాణా, రైనాలతో

"జంటిల్మెన్! మిమ్మల్ని బేస్ మెంట్ క్రింద అంతస్థులోకి తీసుకెళ్ళి మిస్. జులేఖాకి అప్పగించబోతున్నాను. మిస్. జులేఖా ఇక్కడ 'రీసెర్చి' విభాగాన్కి ప్రధాన వైద్యాధికారిణి. ఆమె సెక్షన్ కీ, మా సెక్షన్ కీ సంబంధం లేదు.

కాని కొన్ని ప్రత్యేక కారణాలవల్ల ఆమె విభాగం యిదే బిల్డింగ్ లో కేటాయించబడింది. వారి ప్రత్యేక పరిశోధనలు దేశం నలుమూలలా కొనసాగుతుంటాయ్.

కాని ఒక ప్రాజెక్ట్ లాంటి ప్రత్యేక కార్యక్రమం అమలుపర్చవల్సి వచ్చినపుడు ఆమె శాఖలోని వైద్యనిపుణులందరూ ఇక్కడ సమావేశమాతూ వుంటారు.

"బైదిబై ....అఫీషియల్ సీక్రెట్స్ చట్టం గురించి మీకు తెలుసుననుకుంటాను. కాబట్టి యీ వివరాలు మీ

రెక్కడా బైట పెట్టకూడదు" తన మాటలకు వారి ముఖాల్లో రంగులు మారడం గమనించి నవ్వాడు సి.ఎం.ఓ "కంగారుపడకండి. అంత అతిరహస్యం కాదనుకోండి. కాని కొన్ని కారణాలవల్ల ఈ విభాగం గురించి బైటి వాళ్ళకు తెలియడాన్ని ఒప్పుకోలేం."

ముగ్గురూ లిఫ్ట్‌లో ప్రవేశించారు.

మత్తులో, స్పృహ కోల్పోయివున్న లూసీ-బిల్డింగ్ వెనకవున్న ఓ ప్రత్యేక ద్వారం గుండా లోనికి తరలించ బడింది.

లిఫ్ట్ తలుపులు తెర్చుకోగానే రాణా కళ్ళు జిగేలు మన్నాయ్.

ఎదురుగా—ఉల్లిపొరలాంటి పసుపురంగు చీరమీద తెల్లనికోటు ధరించిన ఓ అపురూప సౌందర్యవతి ప్రత్య క్షమైవుంది.

ఎవరూ పరిచయం చేయడాన్కి ఎదురు చూడకుండా ఆమె విద్యుల్లతలా ముందుకి కదిలి, రాణాతో చేయి కలి పింది. "మిస్టర్ మహారాణా మీ రేననుకుంటాను" నవ్వి నపుడు ముత్యాల్లాంటి ఆమె పలువరస తళుక్కున మెరి సింది. "మీ డిపార్టుమెంట్ మీ గురించి పంపిన ఫైలు చదివి వివరాలు తెల్సుకున్నాను. నిజం చెప్పాలంటే ఫైల్లో వున్న మీ ఫోటోగ్రాఫ్ మీకు న్యాయం చేయలేదు. మీరు బైటే బావున్నారు."

ఆమె చొరవకు అప్రతిభుడౌతూ, రాణా బల హీనంగా నవ్వాడు.

ఛీఫ్ మెడికల్ ఆఫీసర్ సేత్నా కలగజేసుకుంటూ అన్నాడు నవ్వుతూ "ఈమే మిస్. జులేఖా! వయసు ముప్పై. పెళ్ళి చేసుకోలేదు. జీవితాన్ని వైద్యానికి అంకితం

చేసింది" అంటూ ప్రక్కకి తిరిగి అన్నాడు "జులేఖా! ఇక వీళ్ళని నీకు వదిలేస్తున్నాను. ఓ.కే?"

ఆమె తలవూపింది.

ఆరోగ్యమంత్రిత్వ శాఖకు చెందిన ఆ వ్యక్తి-చుట్టూ లిఫ్ట్ డోర్ మూసుకుంటూ వుండగా, అన్నదామె.

"ప్లీజ్ ఫాలో మీ జంటిల్మెన్!"

ఇద్దరూ ఆమెను అనుసరించసాగారు.

ఈమె మెడికల్ ఆఫీసరా?

రాణా నవ్వడంకంటే ఏమీ చేయలేకపోయాడు.

జులేఖా సినిమాతారలా వుంది, మిరుమిట్లు గొలిపే అందంతో——

కాని త్వరలో ఆమే నిరూపించుకోవాలి, తన వైద్య విజ్ఞానాన్ని.

జులేఖా నడుస్తూ గడగడా మాట్లాడసాగింది. "సర్ సేత్నా మీకు చెప్పే వుంటారనుకుంటాను, ఈ ప్రత్యేకస్థలానికి మిమ్మల్ని ఎందుకు తీసుకురావల్సి వచ్చిందో.... దేశంలో వివిధ ప్రదేశాల నుంచి, మా సభ్యులైన వైద్యనిపుణులుని ఇక్కడికి తీసుకురావడం జరిగింది. మిమ్మల్ని వారి పరీక్షలకోసం, దేశం నలువైపులా తిప్పటం కంటే, యిదే సులభంగా వుంటుందని, యీ ఏర్పాటు చేసాం....

"మీరు ఇంకా విన్నారో లేదో.... ప్రతిపక్షాల ప్రోద్బలంతో ఇంటర్నల్ ఎమర్జన్సీ డిక్లేర్ చేయబడింది. దానిప్రకారం ప్రభుత్వం తరఫున పనిచేస్తున్న వైద్యనిపుణుల ఆదేశాలను ప్రజలు ఖచ్చితంగా పాటించాలి. అందుకే, మేం ఈ విషమేఘం సమస్యకు వెంటనే పరిష్కారం కనుక్కోవాలి.... చాలా చాలా వేగంగా...."

ఇద్దర్నీ ఓ ఆఫీసులోకి నడిపించి కూర్చోమని చెప్పింది జులేఖా. టేబుల్ అంచుకు ఆనుకుంటూ నిలబడిందామె,

"నౌ, ది ఫస్ట్ థింగ్ ఈజ్ .... మీ ఇద్దరూ ఉదయం నుంచీ ఏమైన ఆహారం తీసుకున్నారా?"

. అడ్డంగా ఊగుతున్న తలలు చూసి నవ్విందామె. "రైట్! ఆ ఏర్పాట్లు వెంటనే చేస్తాను. కాని మిస్టర్ మహారాణా! మీరు ఎక్కువగా తినకూడదని చెప్పడానికి చింతిస్తున్నాను. మేము మీ మీద చేయబోయే పరీక్షలు దానికి అంగీకరించవు. అలాగని ఖాళీకడుపుతో ఉంచను లెండి. డాక్టర్ల చేతుల్లో మీరు స్పృహకోల్పోవడం నాకు యిష్టంలేదు. వాడ్డు యు సే?"

రాణా, ఆమె మాటల్లోని వశీకరణశక్తికి విస్తుపోతు న్నాడు. ఆమె సన్నిధిలో తన అలసట మెల్లగా మాయ మౌతున్నట్లు గ్రహించాడతను.

"మిస్టర్ మహారాణా! మీరు ఆహారం తీసుకుంటూ విషమేఘం గురించి మీకు తెల్సినదీ, చూసినదీ, ఫీలైనదీ, మొత్తం అంతా నాకు వివరంగా చెప్పాలి పూసగుచ్చి నట్లు, ఏదీ మర్చిపోకుండా."

"యు.నో? ఒక్కోసారి 'అతిచిన్న' విషయానికే ప్రాధాన్యత లభిస్తుంది, అందుచేత."

టెలిఫోన్ అందుకుని ఒక బటన్ నొక్కి యిద్దరికీ బ్రేక్‌ఫాస్ట్ ఆర్డర్ చేసింది జులేఖా.

రైనావేపు చూసాడు రాణా.

తనకు అక్కడ ఏ మాత్రం ప్రాధాన్యత లేనందుకు, ముఖం చిన్నబుచ్చుకుని, కూర్చుని ఉన్నాడు ఇన్‌స్పెక్టర్ రైనా.

"ఓహ్!.... బైదివే, మీరు నన్ను జులేఖా అని పిల

వొచ్చు, ముందు 'మిస్' కాని 'డాక్టర్' కాని అక్కర్లేదు" వారిద్దరికీ చెప్పింది నవ్వుతూ రిసీవర్ క్రెడిల్ చేస్తూ జులేఖా.

"నా మిస్టర్ మహారాణా! యింతకు ముందు మీకు చెప్పినట్లుగా ఈ రోజు మాకు చాలా బిజీడే! మీకు, మాకు కావల్సిన సౌకర్యాలు, సదుపాయాలు, అన్నీ ఉన్నాయి ఇక్కడ. దేశంలోని గొప్ప వైద్య మేధావులు ఈ రోజు ఇక్కడకు వచ్చారు. కొంతమంది జస్లోక్ నిపుణులు వున్నారు. ఇండియన్ ఇన్స్టిట్యూట్, ఢిల్లీనుండి ఇంకా ప్రొఫెసర్లు రావాలి. వారు యిప్పటికే బయలేరారు. ఐ కెన్ ప్రామిస్ యూ వన్ థింగ్....గత రెండు గంటల్లో కూడా ఒక్క నిముషమైనా మేము వృధా చెయ్యలేదు."

"మీరు స్పష్టంగా నన్ను పరీక్ష చేసి కనుక్కోవాల్సిందేముంది? ఐమీన్....నేను పూర్తిగా కోలుకున్నాననంటాను. అవునా?"

"ఫస్ట్ ఆఫ్ ఆల్ -'ఇన్ఫర్మేషన్' రాణా! కాంబేలో మీకు ట్రీట్మెంట్ ఇచ్చిన డాక్టర్లను ఫోన్లో కాంటాక్ట్ చేశాను. అప్పట్లో మీ ఉన్మాద లక్షణాల గురించి వారు యిచ్చిన వివరణ మాకెంతో ఉపయోగకారైంది. కాని ఆ వివరాలు సఫిషియెంట్గా లేవనే చెప్పాలి. మిమ్మల్ని పరీక్ష చేయడం ద్వారా—మీ మెదడుకు ఎంతవరకు నష్టం వాటిల్లిందో పరిశోధించవచ్చు. నా ఉద్దేశంలో మీరు యిప్పుడు పూర్తి ఆరోగ్యవంతులు. కాని దాని తాలూకు ఛాయలు యింకా కదలాడుతుండవచ్చు. ఉదాహరణకు ఒక దెబ్బవల్ల శరీరం కమిలినట్లు—ఒక గాటు—మచ్చను మిగిల్చినట్టు...."

"డు యు థింక్ ఐ నీడ్ సర్జరీ?"

జులేఖా పకపకా నవ్వింది. "లేదు రాణా! మీ కేసులో దాని అవసరం లేదు. సర్జరీ చెయ్యాల్సివస్తే మాకు మృతదేహాలున్నాయిగా?"

"వాట్ ఎబౌట్ లూసీ?"

"ఆమెను తప్పక క్యూర్ చేయడానికి ప్రయత్నిస్తాం."

బ్రేక్‌ఫాస్ట్—ట్రాలీమీద అమర్చబడి, చక్రాలు దొర్లుతుండగా లోనికి వచ్చింది.

జులేఖా, హియరింగ్ సెషన్‌కి సిద్ధమాతూ వెనక్కి తిరిగి, టేప్ రికార్డర్ స్విచ్ ఆన్ చేసింది.

"నౌ స్టార్ట టాకింగ్ రాణా!" ఆదేశించింది జులేఖా. "ఆ మిస్టీరియస్ విషమేఘం గురించి మీకు తెల్సున్నదంతా చెప్పండి. ప్రశాంతంగా, మొదటినుంచీ ప్రారంభించండి. ఏ చిన్నవిషయం కూడా మర్చిపోకుండా చెప్పడానికి ప్రయత్నించండి."

గ గ గ

ఆ రోజులో మిగతా భాగం ఎలా గడిచిందో లీలా మాత్రంగా మాత్రమే జ్ఞాపకం వుంది రాణాకి....

రకరకాల పరీక్షలు, ప్రశ్నలు, పరిశోధనలతో దాడి చేయబడ్డాడు రాణా....

ఎలక్ట్రోకార్డియోగ్రాఫ్‌తో అతని గుండె టెస్టు చేయబడింది....

అతని శరీరమంతా ఎక్స్-రే చేయబడింది....

మెదడులో ఏ భాగమైనా తన సహజ సరళిని కోల్పోయిందేమో తెల్సుకోవడంకోసం, గుండెనుండి, మెదడుకు బయలుదేరే ఓ రక్తనాళాన్ని ఒక విధమైన

'రేడియో ఒ పేక్' ద్రవం ఇంజక్ట్ చేయబడింది....

కంతిలాంటిదేమైనా, ఫార్మ్ అయివుంటే పసికట్ట డాన్కి, అతని తలచుట్టూ ఎలక్ట్రోడ్స్ అమర్చబడ్డాయ్. సూదిద్వారా, అతని శరీరంలో సెరబ్రోస్పైనల్ ద్రవాన్ని బైటకుతీసి, తిరిగి అతని వెన్నెముక క్రింద భాగంలో ఉండే 'సబారాక్నాయిడ్ స్పేస్'లో ఇంజక్ట్ చేసారు.

ఇవికాక, ఇంకా అనేక రకాల పరిశోధనలు లూసీ, రాణాలమీద జరుపబడ్డాయ్.

మధ్యాహ్నానికల్లా—ప్రయోగాలకు చిత్రహింస అయిన రాణా శరీరం గాఢమైన నిద్రలోకి ఒరిగిపోయింది....

కొద్దిగంటలు గడిచాక, రాణా నిద్రనుంచి మేల్కొని కళ్ళు తెరిచేసరికి, ఎదురుగా వాలుకుర్చీలో జారబడి కునికి పాట్లు పడ్తున్న ఇనస్పెక్టర్ రైనా కనపడ్డాడు.

రాణా లేచి కూర్చుంటుండగా, జోగుతున్న రైనా ఉలిక్కిపడి, కళ్ళుతెరిచి బెడ్ వైపు చూసాడు.

నవ్వుతూ ముఖం రుద్దుకున్నాడు రైనా, "ఈ లోకంతో సంబంధం లేనట్లు నిద్రపోయావ్!" అన్నాడు రైనా.

"నువ్వు నాకంటే ఏమీ తీసిపోలేదు."

"య్యా....కాని నాకు నిద్ర ఎప్పుడూ మత్తుగా పట్టదు" విచారంగా చూసాడు ఇన్స్పెక్టర్. "లుక్ బ్రదర్! మనం యిక రాజీపడ్డం మంచిది. నీ పట్ల నేను చాలా రఫ్‌గా ప్రవర్తించాను. కాని పరిస్థితి అలాంటిది. అసహజమైనదదీ....నమ్మశక్యం కానిదీ....ఏమంటావ్?"

"అవును."

"వెల్. అయామ్ సారీ."

"ఓ.కే. ఆ విషయం మర్చిపోదాం. నువ్వింకా ఇక్కడే వున్నందుకు నా కాశ్చర్యంగా వుంది."

"స్పెషల్ డ్యూటీ బ్రదర్. నేను బాడీగార్డుని. నువ్విప్పుడు దేశంలో ప్రముఖ వ్యక్తివి. మరో ప్రముఖ యువతి బైటవుంది."

"నన్ను ఎవరైనా హత్య చేస్తారని వాళ్ళు భావిస్తున్నారా? లేక నేను 'పారిపోతానని' అనుకుంటున్నారా?"

రాణా కంఠంలో అనుమానం, కోపం ధ్వనించాయ్. ఇన్స్పెక్టర్ రాణా బరువుగా నిట్టూర్పు విడిచాడు.

"ఫ్రాంక్లీ రాణా! వారి జాగ్రత్తలు వాళ్ళు తీసుకుంటున్నారు. పొగమంచు ప్రభావం, యింకా బయటి ప్రజలమీద వున్నదన్న విషయం మర్చిపోకు. తర్వాత— నువ్వు దాని ప్రభావాన్నుంచి పూర్తిగా బయటపడ్డావని ఇంకా రూఢిగా మాకు తెలియదు."

"ఆల్ రైట్" వెనక్కు తగ్గాడు రాణా. "నేను నిద్రలో వుండగా బయట ఏం జరుగుతూవుందో చెప్పు."

"చాలా జరుగుతూంది. రెండుగంటల క్రితం యిక్కడి డాక్టర్లు, రీసెర్చి మనుషులూ చర్చించుకున్నారు. దేని గురించో నాకు స్పష్టంగా తెలియలేదుగానీ, షేరా మైదాన్ నుంచి వచ్చిన ఆ మైక్రోబయోలాజికల్ రీసెర్చి వ్యక్తులకీ, ఇక్కడి డాక్టర్లకీ తీవ్రంగా వాదోపవాదాలు జరిగాయ్. చాలా ప్రశ్నలకి సమాధానాలు చెప్పడాన్కి వారు నిరాకరించారు. డిఫెన్స్ మినిస్ట్రీ అనుమతి లేకుండా వాళ్ళు నోరు విప్పరట."

"కాలువన్నీ నదిలో కల్సినట్లు, అందరి అనుమానాలు ఒకదారిన పడ్డాయన్నమాట" వ్యాఖ్యానించాడు రాణా.

"అవును. కోపంలోవున్న డాక్టర్లను వదిలిపెట్టి— వాళ్ళు రక్షణశాఖ సహాయమంత్రిని సంప్రదించడానికి బైటికి వెళ్ళిపోయారు. వైద్యనిపుణులు తమ పని తాము చూసుకుంటున్నారు. కాని వారు అయిష్టంగా, అసంతృప్తిగా ఉన్నారని ఖచ్చితంగా చెప్పగలను."

"హౌ ఈజ్ లూసీ?"

"తెలీదు. మెడికల్ ఆఫీసర్ నువ్వు లేవగానే కబురు పంపమంది" అంటూ పైకిలేచి గుమ్మం దగ్గిరకి నడిచి, తలుపుబైట, యూనిఫాంలో నిలబడివున్న కానిస్టేబుల్‌కి సూచనలిచ్చాడు ఏవో రైనా.

"విషమేఘం సంగతేమిటి?" అడిగాడు రాణా, వెనక్కి తిరిగి కుర్చీవైపుగా నడుస్తున్న ఇన్‌స్పెక్టర్ని చూస్తూ.

"వాళ్ళకి కనబడిందది. నీకు తెల్సు ఆ విషయం. అదృష్టవశాత్తు గాలివేగం తగ్గడంవల్ల నెమ్మదిగా కదులోంది అది. 'ఇప్పుడు' ఆ విషమేఘం చాలా ఆశ్చర్యం గొలిపే దృశ్యం! ఒక మైలు పొడవు, ఒక మైలు వెడల్పు."

"మైగాడ్! అది పెరిగి పెద్దదైందన్న మాట!" అన్నాడు రాణా ఆ ఆలోచనే, ఆ భయంకర సత్యం— రాణా గుండెల్లో సంచలనం రేకెత్తిస్తోంది.

ఎటో చూస్తూ అన్నాడు బెంగగా. "నేను మొదట్లో చూసినపుడు దాని పరిమాణం చాలా కొద్దిగా మాత్రమే వుంది."

(సశేషం)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులుకాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో న్యూసెన్సు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## "పేరంటానికి రారండి!"

మధ్యాహ్నం పన్నెండు కావస్తున్నది.

ఉన్నంతసేపు ఇంటిని చిన్నసైజు 'కిష్కింధ' లాగ మార్చే ఇద్దరు పిల్లలూ స్కూలుకెళ్ళారు. శ్రీవారు ఆఫీసుకు దయచేసారు. ప్రొద్దుటనుంచి యంత్రంలాగ పనిచేసే నాకు మళ్ళీ నాలుగు గంటలవరకు విశ్రాంతి భోజనం అయింది. కొంతసేపు 'ఆపన' చదువుకుని నడుము వాలుద్దామని ప్రక్కబట్టలు సర్దుతున్నాను సోఫా కమ్ బెడ్ మీద.

బర్....బర్....కాలింగ్ బజర్ మ్రోగింది.

"ఎవరబ్బా! నిద్రపోనీయకుండా!" విసుక్కుంటూనే తలుపు తీసాను.

గుమ్మం అవతల ఇద్దరు స్త్రీలు। ఇంతకుముందు వాళ్ళని చూపిన గుర్తులేదు. లేని చిరునవ్వును పెదాలమీద పులుము కొని మర్యాదకోసం లోనికి ఆహ్వానించి కుర్చీలుచూపెట్టాను.

"థాంక్స్।" అంటూ చెరొక కుర్చీలో కూర్చున్నారు. ఇద్దరిలో పెద్ద శాల్తీ భారీగా, తెల్లగా వుంది. వయస్సు ముప్పై దాటినా, చిన్నగా కనిపించాలని ఆమె చేసిన ప్రయత్నం ఫలించినట్లు లేదు. సన్నగా, పీలగా వున్న రెండో అమ్మాయి వెదురు కట్టకు చీర, జాకెట్టు తొడిగినట్లుంది. ఇరవై లోపునే వుండవచ్చు. నల్లటి ముఖంమీద

దట్టంగా పట్టించిన పౌడరు, చెమట వలన చారికలు కట్టి అసహ్యంగా వుంది!

"మేము ఎవరమా? అని ఆలోచిస్తున్నట్లున్నారు. చెంగల్రావు పేటలో వుంటున్నాము. మావారు గోపాలరావుగారు, మీవారు మృత్యుంజయరావుగారు ఒక్క ఆఫీసులోనే పని చేస్తున్నారు. వచ్చే ఆదివారం మా అమ్మాయికి పుట్టినరోజు. పేరంటానికి పిలవడానికి వచ్చాము. మీ రిద్దరూ, పిల్లలూ తప్పక రావాలి!" అంది ఇద్దరిలో పెద్దావిడ.

"చాలా సంతోషం! మీ పేరు?" ప్రశ్నల పరంపర ప్రారంభించాను నేను.

"నాపేరు కమల! ఈ అమ్మాయి నా ఆడపడుచు విశాల."

"ఎండలో అంత దూరంనుంచి అక్కయ్యాపాటెం వచ్చారు. ఆఫీసులో ఒక్క ముక్క మీవారు చెప్తే వచ్చే వాళ్ళం కదా!" అన్నాను సానుభూతిగా.

"మీది పెద్దమనసు గాబట్టి సరిపెట్టుకుంటారు. ఇంటి కొచ్చి బొట్టుపెట్టి పిలుస్తేనేగాని మనలో చాలామంది రారు. విశాఖపట్నంలాంటి ఊర్లో ఊరు నాలుగు మూలలా వెళ్ళి అందరినీ పిలవడం సాధ్యమా? అందుకే రెండు రోజుల నుంచి ఒక్కొక్క పేట కవర్ చేస్తున్నాము. మర్చిపోకుండా రండి. ఆదివారం సాయంత్రం. రావుగారికి మా ఇల్లు తెలుసు. సెలవు తీసుకుంటాము" అంటూ బొట్టుపెట్టి బయలుదేరడానికి సిద్ధపడ్డారు.

"వస్తాముగాని, ఒక్క నిముషం ఆగండి! కాఫీ తీసుకుని వెళుదురుగాని."

"అబ్బే! అవేమీ పెట్టుకోకండి...." నసిగింది కమల.

"కనీసం నిమ్మకాయరసం తీసుకోండి! ఎండలో ఇంకా

చాలాదూరం వెళ్ళాలి. క్షణంలో చేపి తీసుకొస్తాను. కూర్చోండి!" సమాధానం కోసం ఎదురు చూడకుండా లోనికి పరుగెత్తాను.

ఐదునిముషాల తర్వాత రెండు గ్లాసులలో తిరిగివచ్చాను.

"వెళ్ళొస్తామండీ!" భుజాన బాగ్‌లు తగిలించుకుని ఇద్దరూ బయలుదేరారు.

వీధి చివర దాటేవరకు చూపి తలుపు వేసుకున్నాను. అరగంట లేటుగా నడుము వాల్చాను. నాలుగు గంటలకు పనిమనిషి వచ్చి లేపేదాకా నిద్రపోయాను. పనిమనిషికి చెయ్యవలసిన పనులు పురమాయించి, ముఖం కడుక్కొని మేకప్ అవడానికి డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరకు నడిచాను.

గుండె గుభేల్‌మంది. పైన వుండవలసిన నా వుంగరం లేడీస్ వాచి కనపడలేదు. గాభరాగా అంతా వెతికాను. కన పడలేదు ఏమయ్యాయి? ఎవరు తీసారు? నుదురు అంతా చెమటలు పట్టాయి.

"ఇందాక వచ్చినవాళ్ళు....ఛీ! ఛీ!....ఇంటికి వచ్చిన వాళ్ళని, అందులో శ్రీవారి కొలీగ్ భార్యను అనుమానిం చడం చాలా పాపం! పనిమనిషి అలాంటిది కాదు. అవ కాశంలేదు....నాముందే పెరట్లోకి వెళ్ళింది" ఆలోచనలు రకరకాలుగా ముసురుకున్నాయి.

సాయంత్రం శ్రీవారు వచ్చేసిరికి ఏడుపు ముఖంతో అంతా ఏకరువు పెట్టాను. పెళ్ళినాటివి విలువయినవి పోయి నందుకు మావారు చాలా డీలాపడిపోయారు. కాస్సేపటికే సర్దుకుని ఇంటికి ఎవరెవరు వచ్చిందీ ఆరాతీశారు. పేరంటం పిలుపు గురించి చెప్పాను. డ్రింక్స్ తేవడానికి వంటింట్లోకి వెళ్ళడం చెప్పాను.

"వాళ్ళే తీసుండాలి. నువ్వు లోపలకు వెళ్ళగానే చురుగ్గా

పనిచేసారు" అని శ్రీవారు మాట పూర్తి చేయకుండానే.

"మీ కోలీగ్ గోపాలరావుగారి తాలూకా అట" అన్నాను.

"ఆ పేరులో ఎవరూ మా ఆఫీస్‌లో లేరు. సందేహం లేకుండా వీళ్ళెవరో ఘరానా దొంగలు" అన్నారు.

"దొంగలయితే మీ పేరు యెలాగ తెలిసిందండీ!" నీరసంగా అన్నాను.

"గుండెలు తీసిన బంట్లు ...వాళ్ళకి ఇదొకలెక్కా? పైగా తాటికాయంత అక్షరాలతో మృత్యుంజయరావు L.I.C. అని బోర్డు గుమ్మానికి వుంది. అది చాలదూ!" అన్నారు.

నా తెలివితేటలకు నాకే నీరసంవచ్చి నిలుచున్న పళంగా క్రిందపడబోయాను. మధ్యలోనే శ్రీవారి రెండుచేతులు పడకుండా పట్టుకున్నాయి. —ప్రభాకర్, తిరుచ్చి-14.

## పావురాల వ్యాపారం?

ఒక పత్రికా విలేఖరి ఒక పెద్దమనిషిని ఇంటర్వ్యూ చేస్తున్నాడు.

విలేఖరి:—మీరు ధనవంతులుగా ఇంత త్వరగా అవడములోగల రహస్యం ఏమిటి?

పెద్దమనిషి:—ఏమీ లేదు. పావురాల వ్యాపారములో పైకొచ్చాను!

విలేఖరి:—మీరు మొట్టమొదట యెన్ని పావురాలతో వ్యాపారం మొదలుపెట్టారు?

పెద్దమనిషి:—ఒక్కటే ఒక్కటి!

విలేఖరి:—అదెలాగా?....

పెద్దమనిషి:—ఏముంది? పావురాన్ని అటు అమ్మగానే ఇటు వెంటనే నా ఇంటికి తిరిగి వచ్చేసేది!!—

—పి.ఎస్. నారాయణ, గుంటూరు.

